

నాట్యం భిన్నరుచేః జనస్య
బహుధాఽప్యేకం సమారాధనమ్.

ఫిబ్రవరి, 1965
25 పైసలు

# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 9 ప్రధాన సంపాదకుడు : టి. రామచంద్రరావు మాఘం - ఫాల్గుణం 1886 శకం
సంచిక : 4 సంపాదకుడు : కప్పగంతుల లక్ష్మణశాస్త్రి ఫిబ్రవరి, 1965

## విషయసూచిక



---

*1* వ అట్ట : నాట్యం భిన్నరుచేః జనస్య
బహుధాఽప్యేకం సమారాధనమ్ — కాళిదాస

నాట్యము, వేరువేరు అభిరుచులుగల జనులకు, వారి అభిరుచులకు అనుగుణముగా, వివిధ రీతులలో ఒకేవిధమైన ఆనందము కలిగించును. (ఫొటో : ఎస్. ఆర్. కె. రావు)

*2* వ అట్ట : ముఖార్పణేషు ప్రకృతిప్రగల్భాః
స్వయం తరంగాధరదానదక్షః
అనన్యసామాన్యకళత్రవృత్తిః
పిబత్యసౌ పాయయతే చ సింధూః — కాళిదాస

స్వభావముచేతనే నేర్పరురాండ్రైన స్త్రీలు (నదులు) ప్రియులకు స్వయముగా తమ ముఖములను (అధరములను) అర్పించుట లోకములో వాడుక. ఇక్కడ సముద్రుడు తన తరంగ మనెడు అధరమును నదీమహిళలకు స్వయముగా అందించుట విచిత్రము, అస్వాభావికము. అయినను అతడు తన తరంగాధరమును నదీముఖములకు అందించి వారిచే అధరపానమును చేయించుచు తాను గూడ ఏకకాలములో నదుల అధరపానము చేయుచున్నాడు. ఇది లోకములో ఎక్కడగూడ లేని అనన్యసామాన్యకళాప్రవృత్తి.

*3* వ అట్ట : ఆదాయ దండం సకలాసు దిక్షు
యోఽయం పరిభ్రామ్యతి భానుభిక్షుః
అబ్ధౌ నిమజ్జన్నివ తాపసోఽయం
సంధ్యాభ్రకాషాయమధత్త సాయమ్ — శ్రీహర్ష

"సూర్యుడు అను సన్యాసి దండమును ధరించి అన్ని దిక్కులలో తిరుగుచు సాయంకాలము సముద్రములో మునిగి సంధ్యాకాలపు మేఘమనెడి కాషాయ వస్త్రమును ధరించెనా యనునట్లున్నది." (ఫొటోలు : ప్రధాన సంపాదకునిచే)

*4* వ అట్ట : ఆపీయమానసలిలం అగాధం అనంతం
అప్రతిమం అపాంనిధానం రమ్యసరః — బాణభట్టు

"తృప్తిగా త్రాగబడుచున్న నీరుగలిగి, లోతై, అపారమై, అసమానమై జలములకు గనిగానున్నది యీ అందమైనసరస్సు." (ఫొటో : నందగోపాల్)

లోపలిఫొటోలు : డి.ఎస్.నాయుడు, నందగోపాల్, నయిదుద్దీన్.



# ముఖ్యమంత్రి లేఖ

ప్రియమైన చదువరీ,

మనదేశ సరిహద్దుల సమీపంలో చైనా జరిపిన అణ్వాస్త్ర పరీక్షను గురించీ, మన దేశంపై దీని ప్రభావాన్ని గురించీ నేను గత డిశంబరు నెలలోనే మీకు వ్రాసిన లేఖలో ప్రస్తావించడం జరిగింది. ఆ దేశ కార్యకలాపాలను నేను ఇప్పుడు మళ్ళీ తప్పనిసరిగా పేర్కొనవలసి వస్తున్నది.

రెండు సంవత్సరాల క్రితం మన సరిహద్దులపై చైనా జరిపిన దురాక్రమణ సంఘటనలను మరువలేము. మన హిమాలయా అగ్ర స్థావరాలపై చైనా విద్రోహకరంగా, లజ్జావిహీనంగా దురాక్రమణ జరిపింది. లడక్ ప్రాంతంలో విశాలభాగాన్ని ఆక్రమించుకున్న పిమ్మట చైనీయులు నేఫా సరిహద్దులగుండా దేశంలోనికి చొచ్చుకొని వచ్చారు. హఠాత్తుగా జరిగిన ఈ దాడివలన ప్రజలు మొదట అధైర్య పడినప్పటికీ మన ప్రియతమ నాయకుడు స్వర్గీయ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఇచ్చిన పిలుపునందుకొని సమస్త జాతి ఒకే వ్యక్తిగా ఈ ఉపద్రవాన్ని ప్రతిఘటించింది. శత్రువును వెనక్కు పారద్రోలడానికి సన్నద్ధమైనది. చైనా దీనిని ఊహించుకోలేక పోయింది. అది విద్రోహాలపై ఆధారపడి, సులభంగా చొచ్చుకొని వెళ్ళవచ్చని ఆశించింది. కాని మనందరం ఒక్కుమ్మడిగా ఎదుర్కోవడంవల్లా, శాంతికాముక దేశాలన్నీ చైనాచర్యలనుఖండించడంవల్లా వారు వెనక్కువెళ్ళక తప్పలేదు. కాని చైనీయులు మన ఉత్తర సరిహద్దులలో తిష్టవేసుకొని వున్నారు. ఈ పరిస్థితి మన భద్రతకు శాశ్వతమైన ప్రమాదంగా పరిణమించింది. గౌరవనీయమైన షరతులపై రాజీ కుదర్చడానికి కొలంబో రాజ్యాల వారు చేసిన ప్రయత్నాలన్నీ చైనా వితండవైఖరివల్ల విఫలమయ్యాయి. తమ శక్తిని ప్రదర్శించడంద్వారా, విద్రోహకరమైన చర్యలద్వారా మన దేశాన్ని లోబరచుకోవడానికి చైనామళ్ళీ ఎత్తులు వేస్తున్నది. ఈ పన్నుగడలో చైనాకు మన పొరుగునవున్న వింతనేస్తగాని తోడ్పాటు లభించింది. ఈ మిత్రుడు ప్రజాస్వామిక ప్రపంచానికి తాను విశ్వసనీయమైన నెయ్యుడుగా చెప్పుకోవడం విడ్డూరంగా వుంది.

చైనా, అణుబాంబును ప్రయోగించడంతోనే తృప్తిజెందక తాను సూపర్‌సానిక్ విమానాలను కూడా సమకూర్చుకున్నట్లు ఇప్పుడు ప్రకటించింది. ఇవన్నీ శాంతి ప్రయోజనాలకు ఎలా ఉపకరిస్తాయి. వెనువెంటనే కాకపోయినా భవిష్యత్తులో నయినా మననూ, యింకా శాంతి కాంక్షించే యితర దేశాలనూ ఎదుర్కోవడమే దానిలక్ష్యం. చైనారాజ్య విస్తరణ దాహానికి అంతులేదు. అది తన బాహు

ద్వేయాన్ని మరీవిశాలంగా దూరదూర భూముల్లోకికూడా విస్తరిల్ల జేస్తున్నది.

నూతన సంవత్సరంనాడు చైనాబలాలు సిక్కిం భూగర్భంలోకి– హిమాలయగిరుల్లో అల్లుకున్న అతిచిన్న దేశంలోకి – చొచ్చుకొచ్చాయి. శతాబ్దాలతరబడీ ఆ యిరుదేశాలమధ్యా సరిహద్దులు గుర్తింపబడి, గౌరవింపబడుతూనేవున్నా యీ నాడిట్టి సంఘటన జరిగింది. చైనాసైన్యం బహుళసంఖ్యలో చుంబిలోయల్లో సమీకరింపబడడాన్నీ, సిక్కింస్వాతంత్ర్యంపై చైనా దురాక్రమణనూ చూసీ చూడనట్టు ఊరుకోరాదు. రానున్న దినాలకివి దర్పణాలు.

ప్రపంచశాంతిని చెరచడానికీ, ఆసియా ఆధిపత్యానికై తను కంటున్న కలలకు స్వరూపాన్నివ్వడానికీ చైనా మలయేసియా, యిండోనేసియాలమధ్య కలహప్రియుడిలా కూర్చుని అగ్నిలో ఆజ్యంపోస్తున్నది. ఇండోనేసియా అధ్యక్షుడు డా॥ సుకర్నోకు వంత పాడుతున్నది. ఈ చిన్న రాజ్యాధిపతి బ్రహ్మాండమైన ఐక్యరాజ్య సమితిని ఎదుర్కొవడానికి సంసిద్ధుడయ్యాడు. అర్థమూ పర్థమూలేని కారణంతో ఐక్యరాజ్య సమితిమీద అలుకవహించి బైటకు వెళ్ళిపోతానని బెదిరిస్తున్నాడు. ఒక సభ్యదేశం ఐక్యరాజ్య సమితినుంచే వైదొలగడం యీ యిరవైయేళ్ళ సమితిచరిత్రలో యిదేప్రథమం. తెరవెనుక చైనా ఆడుతోన్ననాటకం స్పష్టంగా తెలుస్తూనేవుంది.

యుద్ధోన్మాద మనస్తత్వం వల్లా, ఆ మాదిరి చర్యలవల్లా చైనాకు సమితిలో సభ్యత్వం యివ్వనందుకుగాను సమితిబలాన్ని పటాపంచలు చేయాలన్నది చైనా ఆశయం.

మన స్వదేశంలోకూడా దేశవిద్రోహచర్యలకు పూనుకొనే విధంగా యిక్కడి తన రహస్యసానుభూతి పరులను పురికొల్పే నీచ కార్యానికి కూడా చైనా ఒడికట్టింది. మన దేశంలోని పెడత్రోవపట్టిన పౌరులు కొందరు చేసిన అనేక దుష్కృత్యాలనుగూర్చి నేను వేరే చెప్పాల్సిన అవసరంలేదు. అదృష్టవశాత్తు మన కేంద్ర హోం మంత్రి సద్దులేకుండా రయముగా యీ వర్గంవారిని నిర్బంధించారు. దేశవ్యాప్తంగాజరిగిన యీ దేశద్రోహుల అరెస్టులగూర్చి జాతి నుద్దేశించి ఆకాశవాణిద్వారా ప్రసంగిస్తూ కేంద్ర హోంమంత్రి ఇలాఅన్నారు: "మనదేశంలో జాతివిద్రోహుల దుష్కృత్యాల దృష్ట్యా యీ నిర్బంధాలను తక్షణ రక్షణచర్యగా భావించాలి. మనప్రజల స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి కొందరువ్యక్తుల స్వేచ్ఛను అరికట్టడంఅవసరమౌతుంది. ప్రభుత్వం తొందరపాటుగా యీ నిర్ణయం చేయలేదని నేనుమరోసారి చెప్పుతున్నాను. అత్యవసర అధికారాలను వినియోగించడంలోమనం ఎంతో ఓర్పుతో వ్యవహరిస్తూ ఉన్నాము. వామపక్షంవారి చర్యలను నిరంతరం జాగరూకతతో పరిశీలిస్తూనే ఉన్నాము. మన సందేహభయాలు నిజమని భావించగానే మనం చర్యలు తీసుకున్నాము." ఏ యితర దేశంలోనైనా వారి గతి మరోవిధంగా ఉండేది. మనం శాంతి కాముకులము. అందువల్లనే యీ మహాశయులతో ఎంతో ఉదారంగా వ్యవహరించినాము. అయితే యీ విషయంలో మనం ఎంతమాత్రం ప్రమత్తతతో ఉండరాదు. అన్యాయ బుద్ధిగల స్నేహశీలతలేని విదేశశక్తి ఆజ్ఞానుసారంగా దేశాన్ని చిన్నాభిన్నం చేసి, అరాచకం వ్యాపింపచేసి ఆ విధంగా మన స్వాతంత్ర్యాన్ని, దేశాన్ని పళ్ళెంలో పెట్టి తమ విదేశ గురువులకు కానుకగా సమర్పించడమే ధ్యేయంగాగల దురాలోచనా పరుల వర్గాన్ని సహించేటంతటి రాజకీయాలను భారతదేశమేగాదు ఏ దేశం కూడా అనుమతించదు. స్వదేశంలోని విద్రోహుల కారణంగానే అతిశక్తివంతమైన దేశాలుకూడా దురాక్రమణదారునికి దాసోహం అన్నాయి. చరిత్ర నేర్పిన గుణపాఠాలను మనం మరువరాదు. అంతేగాక గతంలో చాలామంది "ప్రపంచ విజేతలు" తమ అత్యాశలకు తామే భస్మమై పోయారు. యుద్ధోన్మాదులైన చైనాపాలకులకు కూడా యిదే గతిపట్టి తీరుతుంది. అయితే వారు క్షీణించే లోపుగా కొన్ని దురాగతాలు జరుపవచ్చు. మనదేశానికి అటువంటి స్థితి దాపురించకుండా మనం అన్ని విధాల నివారించాలి. మన కష్టార్జితమైన స్వాతంత్ర్యాన్ని, దేశరక్షణను మనం అపూర్వంగా భావించుకున్నప్పుడు మన స్నేహితులైనా రక్తసంబంధీకులైనా వారు ఎవరైనా విద్రోహచర్యలకు పాల్పడితే వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించాల్సిందే. మన దేశంలోని విద్రోహులు, చైనాదురాక్రమణదారు బారినుండి అప్రమత్తతతో మెలిగి మనజన్మభూమినుండి యీ విషబీజాలను పెరికివేయడంలో ప్రభుత్వంతో సర్వవిధాల సహకరించాల్సిందిగా మనదేశ రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా నేను మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

జై హింద్.
భవదీయుడు

# కవికోకిల: కాళిదాసు

పోచిరాజు శేషగిరిరావు

ఆ. కాళిదాసు కవిత కమనీయ మేఘమై
మెఱపు లీనుచుండు మింట నంటి
ఆర్ద్రహృదయ మలరి యది తాకఁగా రస
వర్ష ధార లురలు ప్రవిమలముగ.

ఆ. కాళిదాసు వాణి కలకండ రుచులూరు
తీయనైన గుళిక : దీపకళిక :
పరిమళమ్ము విడని పచ్చకర్పూరపు
క్రోవి ; కూర్చు ముద్దుగుమ్మ మోవి :

ఆ. ఆర్ష ధర్మరక్తి — యాధ్యాత్మికపు దీప్తి
పూర్వ రాజకీర్తి — పోహళించి
కావ్యశిల్పమందు — గండరించె ననల్ప
కల్పనాప్తి రఘువు — కథనమందు.

ఆ. దివికి భువికి విడని తీయని ముడి వైచి
చూపినావు సూక్తి సుందరముగ
ప్రకృతి పుల్కరించి పలికిన వేళ, శా
కుంతలంబు కూర్చుకొంటివేమొ !

తే. ఊర్వశీ రసమూర్తి నపూర్వరీతి
కల్పన మ్మొనరించితె క్రమఫణితి
ఎందఱెందరు కవుల్లో నీ విడిన మూస
లోన నొదిగిరి కావ్యప్రలోభపరత.

తే. రసపిహితమైన నందనారామవీథి
'ఋతువు' లను పేర మెఱసె - భావింపలేము
తద్గతోన్మీలనాశక్తితతి నొకింత -
అమరకవి ! నీ కిదే భక్తినంజలింతు.

తే. ఆదికవి కోకిలాగీతి కాలపనము
హృదిని రవళించి రాగసంపదల నూర్చి
'ఉపమ' కొక కామధేనువై యూఁది నిల్చి
క్షీరరసధుని స్రవియింపఁ జేసినావు !

తే. అమరకవి జీవితమ్ము క్రీడాభిరామ
మై రణించె నటందు రెవ్వారి కెఱుక
భావనావీథి పయనించు పథికరసిక !
నవ్యరసపాళి ! కవితాసనాథమౌళి !

తే. అమర సాహితీ నందనోద్యానవాటి
వాణి వీణను మీటు గీర్వాణసుకవి
రసపరిప్లుత కావ్యధారా స్రవంతి
పులఁపినాఁడవు కవికుల మలరునట్లు.

# ఇది మీరు వెలిగించిన జ్యోతి

## యం. ఆర్. అప్పారావు

నెహ్రూజీ నాగార్జునసాగర్ కు వచ్చినప్పుడు నిరక్షరాస్యుడైన ఒక వృద్ధ శ్రామికుడు ఆయనకు ఎదురుపడి నమస్కరించి, "నాగార్జునసాగరం మీరు వెలిగించిన జ్యోతి" అని అప్రయత్నంగా అన్నాడు. ఈ వాక్యార్థం అడిగి తెలిసికొన్న నెహ్రూజీ ఆనందానికి అవధిలేకపోయింది. "భారత దేశపు ప్రజానీకం నన్నుగూర్చి చేసిన పొగడ్త ఇది. దీనిని ఉత్తమోత్తమమైన గౌరవంగా నేను ఎంచుకొంటున్నాను" అని ఆయన అప్పుడు పేర్కొన్నారు.

ఇట్లు "ప్రజలే తాను, తానే ప్రజలు"గా జీవించిన నెహ్రూజీ నేడింకలేడు. వారి మరణం మన దేశ జీవితంలో ఒక తీరని లోటు. మన దేశమేగాక ప్రపంచంయావత్తూ వారి మరణంవల్ల శోకమగ్నమై పోయింది. ఈ విధంగా ప్రపంచమంతా శోకించిన మరియొక సంఘటన ఇటీవలి కాలంలో ప్రెశిడెంటు కెన్నడీహత్య.

*ప్రపంచ పౌరుడు :*

నెహ్రూజీ ప్రధానంగా ప్రపంచపౌరుడు. విదిత మానవాళిని మేల్కొలిపిన వైతాళికుడు. "1947 మార్చినెలలో ఆయన ఆశియా దేశాల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. 1954 లో నూత్నశకానికి నాంది అయిన 'పంచశీల'ను — శాంతియుత సహజీవనానికి మూలములైన అయిదు సూత్రాలను — ప్రవచించారు. ఆయన ఏర్పాటుచేసిన ఇతర అంతర్జాతీయ సమావేశాలు 1955 లో జరిగిన బాండుంగ్ సమావేశానికి దారి తీశాయి. 'తటస్థ వైదేశికవిధానం' అనే క్రొత్త సిద్ధాంతాన్ని ప్రపంచానికి ప్రసాదించారు. ఈ సిద్ధాంతం 1961 లో బెల్ గ్రేడ్ లో జరిగిన శిఖరాగ్ర సమావేశంలో స్థిరపర్చబడింది. 30–5–1964 తేదీనాటి భారతప్రభుత్వ ప్రకటన, యునైటెడ్ నేషన్సు ఆశయాలను, ఆ ఛార్టరు సూత్రాలను మనఃపూర్వకంగా, ఆశాసంతోషాలతో బలపర్చారు. వసుధైక ప్రభుత్వానికి ఆయన సుముఖుడు. అది కేవలం స్వాప్నికజగత్తు కాదని ఆయన నమ్మిక. ఆ నమ్మకంతోనే వివిధ భాషలతో, మతాలతో, జాతులతో నిండియున్న భారత దేశాన్ని ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందకు తీసుకొని రాగలిగారు. తక్కువ పరిధిలో భారతదేశం ఒక చిన్న యునైటెడ్ నేషన్సు; ఈ భారత దేశంలోకూడా తప్పక సాధ్యం కాగలదని ఆయన విశ్వసించారు. 1948 లో యునైటెడ్ నేషన్సు జనరల్ అసెంబ్లీ తృతీయ సమావేశంలో ప్రప్రథమంగా ఆయన ప్రసంగించారు. ఇంక 1960 లో చేసిన ప్రసంగం తుదిప్రసంగం. ప్రపంచ శాంతి అత్యంత ప్రధానమనీ, ప్రపంచ నాయకులు పరస్పర వ్యవహారాలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలనీ నూత్నశకానికి నాంది అయిన తీర్మానాన్ని ఆయన ప్రతిపాదించారు.

1963 ఆగష్టునెలలో అణుశక్తి ప్రభుత్వాలు మూడున్నూ చేసికొన్న వార్షిక అణ్వస్త్ర నిషేధపు ఒడంబడికను బలపర్చిన ప్రథమ ప్రభుత్వాధినేత నెహ్రూజీయే.

సత్యాహింస లనెడి సూత్రాలను ప్రవచించి, భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించారు గాంధీజీ. ఆ సూత్రాలనే అంతర్జాతీయ రంగానికి వ్యాపింపజేసి యుద్ధాన్ని నిర్మూలించడానికి, అస్త్ర విసర్జనద్వారా శాంతిని సాధించడానికి నిరంతర కృషి చేశారు నెహ్రూజీ. స్వాతంత్ర్యంకోసం పోరాడే పీడిత మానవాళికి భారతదేశం మార్గదీపిక అయింది. శాంత్యహింసల ద్వారా భారతదేశం దాస్యవిమోచనం పొందింది. తక్కిన పీడితదేశాల, వలస రాజ్యాల ప్రజలు ఈ మార్గంలోనే స్వాతంత్ర్యం సంపాదించుకొన్నారు. రక్తపాతం, యుద్ధం లేకుండానే ఆశియా — ఆఫ్రికా ఖండాలలోని పెక్కు దేశాలు స్వతంత్రాలైనాయి.

*రచయిత :*

నెహ్రూజీకి ఉత్తమ ఆంగ్లభాషా రచయితలలో ఉన్నతమైన స్థానాన్ని సంపాదించి పెట్టడానికి సాహిత్యకృషి ఒక్కటే చాలు. ఆయన రచనలు — స్వీయచరిత్ర, కుమార్తెకుతండ్రిఉత్తరాలు, ప్రపంచచరిత్ర, భారతదేశ దర్శనము — ఉత్తమ గ్రంథాలుగా ప్రపంచ ప్రసిద్ధి నందాయి.

నవభారతదేశం:

మతరహిత రాజ్యాంగాన్ని నిర్మించుకొన్న నవభారతదేశం నెహ్రూజీ సృష్టి. ఈ విషయంలో ఆయనకృషి అసాధారణమైనది. 1946 సెప్టెంబరు 2వ తేదీన భారత ప్రభుత్వంలో అధికార పదవిని స్వీకరించారు. దేశ భవిష్యదభివృద్ధికి నాడాయన తీసికొన్ని చర్యలు రెండు — ఒకటి "ప్లానింగు కమీషను" ఏర్పాటు. రెండవది "సైంటిఫిక్ మాన్‌పవర్ కమిటీ" ఏర్పాటు. ఈ కమిటీ ఏర్పాటు కాలక్రమంలో పెక్కు జాతీయ వైజ్ఞానిక పరిశోధనాగారాల స్థాపనకు దారితీసింది. నాటినుంచి ఈ రెండు ఏర్పాట్లు దేశాభివృద్ధికి మార్గదర్శక స్తంభాలైనాయి.

లక్ష్యాలు:

రాజ్యాంగంలో విధింపబడిన ప్రాథమిక హక్కులకు, నిర్దేశసూత్రాలకు, అనుగుణంగా సంపూర్ణము, సరిసమానము, ప్రతిబంధరహితము అయిన విధంగా ప్రజాభివృద్ధి జరగటానికి ఆర్థికాభివృద్ధి ముఖ్యమని నెహ్రూజీ వాదం. ఈ విధంగా భారతదేశపు ప్రణాళిక లనెడి వృక్షం ప్రజాస్వామ్య — సామ్యవాద సిద్ధాంతాలనెడి భూమిలో జన్మించిందని చెప్పవచ్చు. ఈ ప్రణాళికలలో కమ్యూనిటీ ప్రాజెక్టు అత్యంత ప్రధానాలని నొక్కిచెప్పారు నెహ్రూజీ. అంతేకాదు. శాంతియుతాలైనప్పటికి ఉద్ధృతమైన విప్లవశక్తికి అవి సాధనాలని ఆయన విశ్వాసం.

నెహ్రూజీ "నేషనల్ డెవలెప్‌మెంట్ కౌన్సిల్"లో చేసిన ప్రసంగం భావినిగూర్చి విశదంచేస్తోంది — "ప్రణాళికా రచన అంటే మీకు కావలసినవాటిని చేర్చుకొనటంకాదు, మీరు చేయగోరెడివాటి కన్నింటికి ప్రాముఖ్యమివ్వటం మాత్రమేకాదు, ప్రణాళికారచన ఇంతకంటె చాల విశాలమైనది. అగాధమైనది — ప్రణాళికలవిషయంలో నే నిప్పుడు ఊహించే తొలివిషయం మన గమ్యస్థానం యొక్క నిర్దిష్టస్వరూపచిత్రం. బాయ్‌స్కౌట్సువలె, ప్రతి రోజూ ఏవో కొన్ని మంచి పనులు చేయాలనీ, ఏవో కొన్ని మంచి మంచి ఉద్యమాలను నిరహ్వించాలనీ పేర్కొనటం — ఈ విధంగా లక్ష్యరహితంగా ఎవ్వరూ ప్రణాళికా రచన చేయజాలరు. నిర్దిష్టగమ్యస్వరూప మేదో మనకు స్పష్టంగా తెలియాలి. ఈ స్వరూపం మార్పునకు అతీతమైనదిగా ఉండాలనీ నేను భావించటంలేదు. మనకు లభించిన అనుభవాన్ని బట్టి, సమాచారాన్ని బట్టి అది మార్పునకు లోనుకావచ్చు. అయినప్పటికీ లక్ష్యానుగుణంగానే మన మిప్పుడు ప్రణాళికారచన చేసుకోవాలి." "విస్తారమైన ఈ ప్రణాళికంతో వ్యవహరించట మన్నదే చాల కష్టతరమైన సమస్య. వాటిని పైపైన మార్చటం, లేదా ఇచ్చట పార్లమెంటులో చేయబడిన శాసనాలద్వారా మార్చటం మాత్రమేకాదు, వారి మనస్సులనే మార్చివేసి, చిరకాలంగా అలవాటుపడి ఉన్న, కరుడుకట్టుకొని పోయిన మానసిక స్థితినుండి, సాంఘికాచారాలనుండి వారిని విముక్తులను చేయాలి."

ఇంకా ఈ విధంగా అన్నారు : — "ఒక విషయాన్ని నేను నొక్కి చెప్పాలనుకొంటున్నాను. ప్లానింగు కమీషను కరడుగట్టిపోయిన దృష్టితో ఉండటంవల్ల ప్రయోజనం ఉండదు. మార్పునకు సంబంధించినంత వరకు మనకు సచేతనమైన దృష్టి ఉండాలి. ఈ మార్పు అన్ని రంగాలలోను — ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగాలలో — రావాలి. నా మనఃఫలకంలోని చిత్రం స్పష్టంగా, సంపూర్ణంగా సామ్యవాద సమాజానికి సంబంధించిన చిత్రం. నే నీ పదాన్ని పిడివాద దృష్టితో వాడటంలేదు. సమాజం మొత్తానికి లాభం కలిగేటట్లుగా ఉత్పత్తులు సమాజ యాజమాన్యంతో సాగి, సమాజానికే చెందాలన్న సువిశాలమైన అర్థంలో నే నీ పదాన్ని వాడుతున్నాను " "అభివృద్ధి చెందని దేశస్థులమైన మనం — పారిశ్రామికంగా ఏమాత్రమూ అభివృద్ధి చెందని మనం — ఈ వెనుకబడినతనాన్ని అధిగమించి, కొంత త్వరితగతిని పురోగమించటానికి నిర్విరామంగా కృషిచేయాలి...మన పరిశ్రమలను అభివృద్ధి చేసికోవాలని వాంఛించినప్పుడు విదేశాలనుండి యంత్రాలను ఎడతెగకుండా దిగుమతి చేసికోవటమన్న దృష్టిని విడనాడాలి. ఆ యంత్రాలను ఎడతెగకుండా ఇచ్చటనే నిర్మించుకోవాలి. ఇది స్పష్టమైన విషయం...మూలవస్తువులైన యంత్రాలను ఇచ్చటే నిర్మించుకొనటం లక్ష్యంకావాలి."

కాగా, దేశంయొక్క భవిష్యదభివృద్ధి సామ్యవాద — ప్రజాస్వామ్య సిద్ధాంతాల ద్వారానే సాధింపబడాలని పై ఉపన్యాసంలో పది సంవత్సరాల క్రిందటనే స్పష్టం చేయబడినదన్నమాట.

పారిశ్రామికాభివృద్ధి:

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో సుదూర ఫలితాలను దృష్టిలో పెట్టుకొన్న కృషికి అవకాశంలేదు. అంతకుముందే చేపట్టిన వివిధ పరిశ్రమల కృషిని శీఘ్రతరం చేయడం జరిగింది. అంతేకాదు, ఆహార సమస్యాపరిష్కారం ప్రధాన స్థాన మాక్రమించింది. భావి పారిశ్రామిక సౌధానికి పునాదిమాత్రం వేసినట్లయింది. ఇంక ద్వితీయ పంచవర్ష ప్రణాళికా రచయితలకు అవకాశం, అనుభవం కూడ లభించాయి. ఆ విధంగా ఆచార్య పి. మహలనోబీస్ రచించిన ముసాయిదా ప్రణాళిక నెహ్రూజీని చాలా ఉత్సాహపరిచింది, త్వరితగతిని

టెక్నాలజీ అభివృద్ధి పారిశ్రామి కాభివృద్ధి సాధ్యమగుటకు అనువుగా పారిశ్రామిక సౌధ నిర్మాణానికి అందులో పునాది వేయబడినదని ఆయన తలంచారు. దేశం సాంఘికంగా, ఆర్థికంగా, నైతికంగా అభివృద్ధి చెందటానికి సైన్సు విజ్ఞానం బాగా ఉపయోగపడా లనీ ఆయన ఎల్లప్పుడూ విశ్వసించేవారు. ఆయన దృష్టిలో ప్రణాళికాలక్ష్యం స్వశక్తిమీద ఆధారపడిన ఆర్థికాభివృద్ధి.

ఆయన ఇంకా ఈ విధంగా ఉద్బోధించారు :- "ప్రణాళికా రచనలో - ముఖ్యంగా ప్రజాస్వామ్యంలోని ప్రణాళికా రచనలో - సాధ్యమైనంతవరకు దేశంలో ఉన్న అనుభవజ్ఞు లందర్నీ సంప్రదించవలసిఉంది. అయినప్పటికి ప్రణాళికా రచన అధికాధికంగా విశాలమైన లక్ష్యాలమీదనే కాక గణాంక విజ్ఞానం మీద కూడ ఆధారపడి ఉంటుంది. కావుననే గణాంక సంబంధములైన ఆధారాలను సేకరించటం, నమూనా పరిశీలనలు జరిపించటం, మన కార్యక్రమ ఫలితాలను ప్రతి దశలోను గణించుకొనటం అనేవాటికి అధిక ప్రాధాన్యం లభించటం సహజం. ఉత్పత్తులు, వినియోగాలు, ఉద్యోగావకాశాలు, ఎగుమతులు సాఘిక సేవా కార్యక్రమాలు విద్యా — వైద్య పథకాలు — వీటి అన్నింటికి పరస్పరం అనుబంధం కలిగించటమే ప్రణాళికా ధ్యేయం. సామ్యవాద ఆశయాలను సాధించా లంటే లక్ష్యాల విషయంలో, వాటిని సాధించే విధానాల విషయంలో, సాధనాల విషయంలో నిష్కర్ష జరగాలి."

"అన్నింటినీ జాతీయం చేసి మనకున్న శక్తి సంపదలను ప్రైవేటు పార్టీలకు నష్ట పరిహారం క్రింద వ్యర్థం చెయ్యాలనినెహ్రూజీ ఎన్నడూ వాంఛింపలేదు. కాని, కొన్ని కార్యక్రమాలు ప్రభుత్వానికి చాలా ముఖ్యాలనీ, పబ్లిక్ రంగానికి అధికమైన అవకాశం లభించాలనీ ఆయన వాంఛించారు. ఇంక తక్కిన రంగాలన్నింటిలోను ప్రైవేటు వ్యాపారం అభివృద్ధి చెందటానికి అవకాశం, స్వాతంత్ర్యం లభించాలి. అంతేకాక ఉత్పత్తులను పెంచి, దేశాభివృద్ధికి తోడ్పడే ప్రతి విభాగాన్ని పెంపొందించి, ప్రోత్సహించటం మన ధర్మం. భారీ యంత్రాల నిర్మాణంలో నిమగ్నమైన పరిశ్రమల విషయంలో మన మెక్కువశ్రద్ధ చూపాలి. పారిశ్రామికాభివృద్ధికి ఇదేఆధారం."

శ్రీ తర్లోక్ సింగ్

ఈ ఆశయాల ననుసరించి, 1949 నాటి పారిశ్రామిక విధాన నిర్మాణాన్ని, 1956 నాటి నూత్న పారిశ్రామిక విధాన తీర్మానాన్ని సరిదిద్దుకోవలసిఉంది.

*గ్రామీణాభివృద్ధి*

పారిశ్రామికాభివృద్ధికి పిమ్మట వ్యవసాయానికి, గ్రామీణాభివృద్ధికి ప్రాముఖ్యమిచ్చారు. నెహ్రూజీ. అధిక సంఖ్యాకులైన ప్రజలు గ్రామాల్లో నివసిస్తూ, వ్యవసాయం మీదనే ఆధారపడే భారతదేశంవంటి దేశాల్లో గ్రామీణార్థికాభివృద్ధికి అత్యంత ప్రాముఖ్యం లభించటం సహజం. బీద దేశంలో, బడ్జెట్ లోని అనేకాంశాలలో ఆహారం పద్దు ప్రధానాంశంగా ఉంటుంది. కావుననే ఆహారం పుష్కలంగా లభించటం, వాటికి సరసమైన ధరలు నిర్ణయింపబడటం అనే సమస్యలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి. ప్రణాళికా సర్వస్వానికి ఇది మూలగ్రంధి అని నెహ్రూజీ గ్రహించారు. గ్రామాన్ని ప్రాథమికమైన ఒక యూనిట్ గా చేసికొని, ప్రజల ఉద్యమంగా సాగే సాహకారోద్యమాన్ని ప్రవచించే "సహకార విధానము"ను 1958 నవంబరు నెలలో నేషనల్ డెవలప్ మెంటు కౌన్సిల్ తీర్మానరూపంలో అవలంబించింది. 1958 జనవరి నెలలో డెవలప్ మెంట్ కౌన్సిల్ విప్లవాత్మకమైన ఒక నిర్ణయం చేసింది. దీనిప్రకారం గ్రామస్థాయిలో బ్లాక్ సాయిలో స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రజా స్వామ్య సంస్థలు నెలకొనటం జరిగింది. దీనినే పంచాయితీ రాజ్యసాన మంటారు. సమాజాభివృద్ధి కార్యక్రమాలు ఈ పంచాయతీ రాజ్యసంస్థలకు అప్పగించబడ్డాయి. భారతదేశంలో ఇటి సంస్థలను నెలకొల్పిన ప్రథమరాష్ట్రం ఆంధ్రప్రదేశ్. నెహ్రూజీ ఇచ్చిన ప్రోత్సాహంతో సహకార వ్యవసాయం, భూసంస్కరణలు ప్రవేశపెట్టటానికి కూడ నిర్ణయాలు జరిగాయి. అయితే భూసంస్కరణల కార్యక్రమం బాగానే సాగింది కాని సహకార వ్యవసాయ కార్యక్రమం మాత్రం అంతగా సాగలేదు.

తృతీయ పంచవర్ష ప్రణాళికా రచనా సమయంలో పంచాయతీ రాజ్యసంస్థల ద్వారా ప్రజలను సంప్రదించటం జరిగింది. ప్రజలను సంప్రదించి నిర్ణయించిన ప్రథమ ప్రణాళిక తృతీయ పంచవర్ష ప్రణాళిక యని చెప్పవచ్చు. ప్రజల సలహాలను పరిశీలించి, స్వయంగాఆలోచించిన పిమ్మటనే మన ఆర్థిక వ్యవస్థ స్వయంపోషకస్థితిని చేరుకొనటానికి అనువుగా పారిశ్రామిక సౌధాన్ని గట్టి పునాదులపై నిర్మించటమే ప్రణాళికల ప్రధాన లక్ష్యమని నెహ్రూజీ స్పష్టంచేశారు. ప్రజలు అత్యుత్సాహంతో చేయూత నొసంగినచో ప్రణాళికలు నిరర్ధ కాలవుతాయని ఆయన బాగా గ్రహించారు. ప్రజలను వివేకవంతులను చేయటానికి సామూహికంగా విద్యాప్రదానం చెయ్యటం, కనీసపు సౌకర్యాలు కలిగించటం అతి ముఖ్యాలు. అందుచేత ఈ అంశాలకు తృతీయ పంచవర్ష ప్రణాళికలో ప్రాముఖ్యం లభించింది. వెంటనే వివరాలను సవిస్తరంగా పరిశీలించారు. భారీ పరిశ్రమల, ప్రాథమిక పరిశ్రమల అభివృద్ధి అవసరాలను తీర్చటానికి ఉక్కు, బొగ్గు

(మిగతా 62వ పేజీలో)

# మిహిరకులుడు

సీరియల్ నవల:

(నాలుగవ యధ్యాయము)

ఆనాటిరాత్రి గాంధారపతి మహాసౌధోపరిభాగమున నున్న యేకాంతప్రదేశమున గల పెద్ద సావడిలో మిహిరకులుడు రాత్రి పదింటికి బంగరు పట్టెమంచముమీద, సంజ మొదలు యామినీప్రథమయామము గడచువఱకు గ్రింద నున్న మహాసౌధములయందు పురోహితులు, పేరంటాండ్రు, బ్రాహ్మణులు నిర్వర్తించిన వైదిక లౌకికోత్సవములు నిర్వర్తింపబడినతరువాత భోజనము చేసి బంగారపుపట్టెమంచముమీద హంసతూలికలతో నిర్మింపబడిన పట్టుపరపులమీద, నాలుగుగజముల యెత్తున పందిరియం దమర్పబడి వ్రేలాడుచున్న వజ్ర వైడూర్య మరకత మాణిక్యముల కాంతులు గదిలో కోణములం దమర్పబడిన సన్నని దీపముల వెలుతురులచేత తాడింపబడి యాకసమునందు సమావేశబడిన యచ్చరల శరీరధాళధళ్యములు క్రిందికి ధారలుగా వెల్లివిరియుచున్న కాంతులలో పట్టెమంచపు సమీపమున నమర్పబడిన యేనుగుదంతములచేత చేయబడిన, యానుకుని కూర్చుండదగిన మెత్తని యాసనములవంక జూచుచు, సావడి యంతయు నిది మల్లెపూల వాసన, యిది జాజుల వాసన, ఇది గేదంగుల తావి, యిది సంపెంగల తావి, యిది చేమంతుల పరిమళము, ఇది పారిజాతముల పరిమళము, ఇది యగరువస్తువులది, యిది కస్తూరిది, యిది పునుగుది, యిది జవాజిది మొదలైన వివేకమేర్పరుపరాకుండ నీ సమస్త పరిమళముల సమాహారమై వానికంటె భిన్నమైన మరి యేదో పరిమళము విచిత్రముగా మనోమోహనములుగా నాసారంధ్రములయందు సోడుముట్టగా, ఎచటనో యమర్పబడిన గుప్తప్రదేశములనుండి యొక సన్నని పొగ కన్నులలోనికి పోయి బాధించనిది, యిది యేమి యనిపించనిది, సన్నని గాలిపొరలతో కలసిపోవునది, వచ్చుచున్న పరిమళముతో నవినాభావసంబంధము కలది, యాకసమున చిఱుసన్న తెల్లనిమబ్బులు వియన్మహాప్రదేశము నాచ్ఛాదింప కాచ్ఛాదించునట్లు ప్రవర్తించునవి పోలె వ్యాపించుచుండగా సన్నని రాగము సౌధాధోభాగమునుండి వినపించుచుండగా నది యొక స్త్రీయొక్క గొంతని తెలియుచుండగా నా గొంతులోని సుస్పష్టత తన్మయత్వము తెచ్చునేమో, యీయవి స్పష్టత గాలివలె పరిమళమువలె వెలుగువలె శరీర మన

## విశ్వనాథ సత్యనారాయణ

శ్రవణేంద్రియ సుఖాపాదిమాత్ర మగుచుండగా సౌధోపరిభాగముననే మట్టి పోసి పెంచిన వృక్షములలో జుమ్మని తుమ్మెదల మ్రోత గవాక్షములనుండి సన్నగా వినవచ్చుచుండగా నా వృక్షముల యొక్క శాఖాంతర్భాగములయందు నీడములు నిర్మించుకొని యండములు పెట్టికొనిన పక్షులు, సగము పిల్లలైన యండములు తమ మేని యొత్తిడికి నలగిపోవునేమో యన్న భయముతో సుకుమారముగ నొత్తిగిలుచు సన్నని కూతలు కూయుచుండగా మిహిరకులు డొక్కడును కూర్చుండెను. అతని నచ్చటికి బంపిరి. అతనికి మనసులో నచటి కొక్క ర్తుకయు కళ్యాణవతి వచ్చునని తెలియును. ఎందుకు వచ్చునో తెలియును. ఏల రావలయునో యతని కర్థము కాలేదు. ఆమెను వివాహ మాడెను. నిజమే. స్త్రీ పురుషుల నిర్మితి యతనికి దెలియును. తెలిసిన విషయమే వాని మనస్సునందు పునఃపునః వేరూహలచేత నాచ్ఛాదింపబడుచుండును. కొంతసేపటికి కళ్యాణవతి వచ్చెను. వచ్చినట్లలికిడి తగిలెను. వచ్చుచున్న దనుకొనెను. ఆమె రాలేదు. ఆ మహాసౌధోపరిభాగమునకు శిలానిర్మితసోపానములు లేవు. ఒక బలిష్ఠము దారు నిర్మితము నైన నిచ్చెన కలదు. భార్యాభర్త లిద్దరు పైకి వెళ్ళినంతనే యా నిచ్చెనను తీసివేయుదురు. ఆ నిచ్చెన తీసివేయబడిన సవ్వడికూడ మిహిరకులునకు విన్పించెను. ఎందుకు తీసివేసిరి? తన్నిచ్చట సంహరింతురా? తన్ను సంహరించుట సాధ్యమా? గాంధారపతి యింత మోసము చేయునా? అట్లు చేసినచో తన మంత్రులును సేనానులును సేనలును రిత్తగా మరలిపోవుదురా? గాంధారపతి దుర్గమును నేలమట్టము చేయరా? కళ్యాణవతి పైకి వచ్చినట్లు వినిపించినది గాని రాలేదు. ఆ వచ్చె నను కొన్నది కళ్యాణవతి కాదు. నిచ్చెన తొలగించుటకు వచ్చినవారిలో నెవరిదో సవ్వడి. మిహిరకులుడు మేడమీదికి వచ్చునప్పుడు తన ఖడ్గమును చురకత్తియు డాలును తీసికొని రాబోయెను. స్త్రీలు పరిహాసము చేసిరి. అతడు వానిని పరిత్యజించెను. కాని తన చామరగ్రాహిణులచేత నిద్దరిచేత వానిని రహస్యముగా పైకి పంపించెను. వందమంది నైన సంహరింపగలడు. పైనుండి దూకి పారిపోగలడు. తన యశ్వము నొకచోట గుర్తుగా నుంచెను. దాని నెక్కి పారిపోగలడు. తిరిగి వచ్చి గాంధారమును చూర్ణము చేయగలడు. ఇట్లుండగా నా గదిలోని కిత డను కొన్నట్లుగానే యొక కవచఖడ్గపాణి శిరస్త్రాణి వచ్చెను. మిహిరకులుడు చూచెను. అతడు

వెంటనే లేవబోయెను. వెంటనే గుర్తు వచ్చెను.

మిహిరకులుడు : ఏమయ్యా రాజకుమారా ? ఒంటరిగా వచ్చితివి ? నన్ను నీవు గెలువ గలవా ?

కళ్యాణవతి : నా తండ్రికి పుత్రులు లేరు. మరియు నే నొంటరిగా రాలేదు.

మి : ఆ వచ్చినవా డేడి ?

కళ్యా : నాలోననే యున్నాడు.

మి : నా కర్థము కాలేదు.

కళ్యా : మహారాజా! వాడు నీలోన నున్నాడు; నాలోన నున్నాడు.

మి ; అపుడు వా రిద్దరును యుద్ధ మాడుదురు. వారు వారు యుద్ధము చేయుచుండగా నీవు నన్ను గెలువలేవు.

కళ్యా : మహారాజా ! స్త్రీలు గెలువరు. వా రెప్పుడు నోడియేపోవుదురు. వారి యోటమియే వారి గెలుపు.

మి : అయినచో నిన్ను గెలువనీయను. ఓడనీయను.

కళ్యా : నా కోడ యక్కఱలేదు. పడవ యక్కరలేదు. రథ మక్కరలేదు. నా రథము నా కున్నది. దానిపేరు మనోరథము. అది యిద్దరిని మోయగలదు.

మి : మన మిద్దఱము దానిమీద నెక్కినచో రథమును తోలెడివా డెవడు ?

కళ్యా : మన యిద్దఱిలో నున్నవాడు.

మిహిరకులుడు నిమేషము మాటాడకుండ గూర్చుండెను. అతనికి యుద్ధవ్యవహారము తెలిసినంత శృంగారవ్యవహారమును సాహిత్యవ్యవహారమును దెలియవు. జాగ్రద్గురువు చాల గ్రంథములు చదివించెను. స్వప్నగురువు లౌకికేతరవిషయములను పెక్కింటిని బోధించెను. జాగ్రద్గురువు శృంగారరసప్రబంధములనుగూడ మిహిరకులునకు జెప్పెను. ఇతడు వానిని పట్టించుకొనలేదు. కాని చదివిన జ్ఞాపక మున్నది. అవి యన్నియు ముసరికొని తన మనస్సుమీదికి హృదయముమీదికి దాడి వెడలుచున్నవి. అతడు నెమ్మదిగా లేచి భార్య వద్దకు బోయెను. ఇట్లనెను — "ఓయీ ! రాజకుమార ! ప్రొద్దుపోయినది. శ్రమపడి వచ్చితివి. ఒడ లంతయు చెమ్మట పోసి యుండును. ఈ యినుపకవచమును బాహుత్రాణములును, శిరస్త్రాణమును వక్షమునందు మోచేతులందు నుదురునందు నొరసికొని బాధించుచుండును. స్నానము చేయుదువుగాని" యని తానే యామె యొక్క కవచాదులను తొలగించెను. ఆమె పంచె విరిచికట్టినది. చిక్కని యంగీ తొడిగినది. శిరస్త్రాణ ధారణయోగ్యముగా జుట్టు పైకి ముడిచికట్టినది. అత డిట్లనెను. "ఇచ్చట జలములేదు. వేన్నీళ్ళు లేవు. ఎట్లు స్నానము చేయుదువు."

కళ్యా : ఎవరికి గావలసినవి వారు తెచ్చికొందురు. వేన్నీళ్ళున్నవి. లేపములున్నవి. మహాసేనాపతి ! ఆనాడు నీ స్కంధావారమున నేను స్నానము చేయలేదు. ఈనాడు నీ విడిదిలో స్నానము చేయుదును.

అని యామె వెడలిపోయెను. ఆ దీర్ఘమైన సావడి చివర వేఱొక గది యున్నది. దాని కిందులోనుండి త్రోవ యున్నది. ఆమె యా గదిలోకి పోగా మిహిరకులు డిట్లూహించెను. "ఎవరికి గావలసినవి వారు తెచ్చికొందురా ? నేను కవచ ఖడ్గ శిరస్త్రాణములు తెచ్చికొనిన ట్లీమె కెట్లు తెలియును ? అందుకనియే యీమె యీ రూపమున వచ్చెను గాబోలు. భర్తలవద్దకు భార్యలు కవచాదులు ధరించి వత్తురా ?" ఆమె ఏమి చేయుచున్నదో యని యితడు పోయి తలుపు త్రోసి తొంగిచూచెను. ఆమె వివస్త్రయై యుండెను. స్నానము చేయుచుండెను. ఆమె సిగ్గుపడి ముడుచుకొని కూర్చుండెను. స్త్రీలు సిగ్గుపడుదు రని యితనికి దెలియదు. కాని తన రాజ్యమున స్త్రీలు స్నానము చేయునపుడు పరిచారికలు వారికి నొడలు తోముట మొదలగు పనులు చేయుదు రని వారికి దెలియును. ఈమె రాచకూతురు. పరిచారికలు చేయు పనులుకూడ తానే చేసికొనవలసి వచ్చెను. తాను పరిచారికలను పిలువవలయు ననగా నచ్చట నెవ్వరును లేరు. తాను మహారాజు. తా నొక పరిచారికవలె ప్రవర్తించునా ? ఇచ్చట నెవ్వరును లేరుకదా ! తాను పరిచారికవలె నామె కొడలు తోమినచో నీళ్లు పోసినచో నెవరు చూతురు ? ఆమెకు తెలియునుకదా ! ఆమె తన భర్త తన కిట్లు చేసెనని పరులతో చెప్పునా ? చెప్పినచో నీ రాజకుమారుని శిరచ్ఛేదము తాను చేయును. రాజకుమారు డేమి ? రాజకుమారికదా : ఓహో ! ఆమె ద్రోహము చేసినచో నామె యందలి స్త్రీత్వము లోపించునని యర్థమా ! స్త్రీలు ద్రోహము చేయరు. భర్తయందు చేయరు. చేసినచో వధార్హలు. తాను పోయి యామెకు నీళ్లు పోయుటయు నొడలు తోముటయు చేయ నారంభించెను. ఆమె పట్టరానంత సిగ్గుపడుచుండెను. చేతులు త్రోసివైచుచుండెను. కనులవెంట నీరు కార్చుచుండెను. కాని యిత డామెకు బలవంతముగా నీళ్ళు పోయుచుండెను. ఆమె శరీరమునకు నితని హస్తములకు సర్వంకషమైన పరిచయము కలుగుచుండెను. ఇతనివి బండచేతులు. ఖడ్గధారణముచేత, వింటినారి లాగుటచేత మోటుబారిన చేతులు; కండలు కట్టిన చేతులు; కాయలుకాచిన చేతులు. ఆకాయలు సన్ననికత్తులతో కోసినను నొప్పి యుండదు. వానికి స్పర్శగుణము లేదు. ఆ కాయలలో నేడు స్పర్శగుణము పొడచూపినది. అతని కాశ్చర్యము వేసెను. ఇదేమి ? ఈమె యొడలు మంచుకన్న చల్లనిదియా ? పోయుచున్న వేన్నీళ్ళను మించిన చల్లదన మీమె యొడలియందున్నదా ? ఆ వేన్నీళ్ళు చల్లబడవేమి ? తన చేయి చల్లబడునేమి ? అట్లు నూత్నస్పర్శసుఖ మెఱిగిన యీ హస్తములు తమ యనుభూతి తమకు చాలనట్లు తన దేహమునెల్ల యేదో జిల్లు మనిపించుచున్నదేమి ? తరువాత నతనికి తన యొడలు తనకు తెలియలేదు. కళ్యాణవతి నిస్సహాయురా

లైనది. ఒక యేనుగు వచ్చి తామరపువ్వుతో నాడుకొనుచున్న ట్లున్నది. పెకలించుటకు వచ్చినది ఆ యేన్గు తామరపువ్వును కాడతో సహా సుళువుగా పైకి నెత్తెను. తన కుంభ స్థలమునందు పెట్టికొనెను. మరల తీసెను. చెవులతో విసరెను. దానిమీద లేతతామరాకు లను దీసి కప్పెను. చెఱువు నొడ్డునకు బోయెను. శుష్కపత్రములు పొడివి తీసి తెలిపండుటాకులవంటి వాని నేరి యీ తామర పువ్వు తడి తుడిచెను. ప్రక్కనే యున్న లేయరటితోటలోని సన్నని తెల్లని ఉల్లి పొరలవంటి యాకులను కాడకు జుట్టెను. పూవును జూచెను. పూవునకు భయము పోయినట్లున్నది. పూవు నవ్వుచుండెను. నవ్వుచునే యున్నది కాని భయము పోయినట్లులేదు. ఆ పువ్వును భోగింపవలె నన్న యూహ తోచెను. పూవును భోగించుట యనగా నేమి? ఆఘ్రాణించుట యగును. ఆఘ్రాణించుట యనగా భోగించుటయా? పుష్పమునందు మధు వుండును. పరిమళ ముండును. పుష్పగత సర్వపరిమళము నొక్కసారి ఘ్రాణేంద్రియమునందు వోసి కొనుట యెట్లు? ఆ పూవునం దెడతెగని పరి మళధార యది వాడిపోవునంతవర కుండును. వాడిన తరువాతకూడ వైజాత్య సాజాత్యములు కలిగిన యొక పరిమళధార వచ్చుచునే యుండును. ఒక మహాదంతావళము దాని పరిమళమును తుదముట్ట నాఘ్రాణించగలదు. దానితో క్రీడించగలదు. కాని వట్టిపరిమళ మాఘ్రాణించుటచేత పుష్పమును సంపూర్ణ ముగా భోగించినట్లు కాదు. అనుభవించి నట్లు కాదు. దానిలోని మధువు నాస్వాదింప వలెను. ఏనుగు మధువు నాస్వాదించలేదు. అయ్యో! ఈ పుష్పమును సర్వంకషముగా ననుభవించవలెను. తాను దిగ్దంతావళము. ఛీ! ఛీ! నే నేనుగు నేమి? నే నొక తేటి నైనచో దీని మధువు మనసార గ్రోలగలను. మిహిరకులుడు నిమిషములో తుమ్మెద యాయెను. ఆ తుమ్మెద పువుమీద వ్రాలును. చుంబించును. లేచిపోవును. మరల వచ్చును. వందరేకులను వందసార్లు చుంబించును. ఆ తేటి చుంబించినంత మేర రేకురేకు లజ్జామి శిత శ్యామలవర్ణ మధురాకార యగుచుండెను. ఈ మగతేటియొక్క చుంబనములకు తాళ లేక యా పుష్పము మాటిమాటికి ముడుచు కొనుచుండెను. విరిసిన రేకుల చుంబనము మగతేటికి మధురముగా నుండెను. మనో మోహనముగా నుండెను. తేటి వచ్చును వ్రాలును. వచ్చినప్పుడెల్ల రేకులను చుంబిం చును. లేచిపోవును. పూవు మరల ముడుచు కొనును. తేటి మరల వచ్చి మరల రేకులను విరియింపజేయును. మరల జుంబించును. మరల లేచిపోవును. చుంబన రసాస్వాద నముచేత మొగము మొత్తిన తేటి-నిజముగా మొగము మొత్తలేదు. తదధికముగ నేదియో యనుభవింపబడలే దని తలచిన తేటి లోని తేనియను త్రావలేదని తెలిసికొనెను. మధు వెచ్చట నున్నది? రేకుల నడుమ పూదిమ్మ యున్నది. ఆ దిమ్మలో నున్నది కాబోలు! పుష్పము మాటిమాటికి ముడుచుకొనుచున్నది. దిమ్మను చేరనిచ్చుటలేదు. చేరనిచ్చుచునే యున్నది. పూవేకాదు తేటియు సిగ్గుపడు చున్నది. ఈ సిగ్గుతెరలు వందలుగా నున్నవి. తేటి సిగ్గుతెర పడినప్పుడు పూవుయొక్క సిగ్గు తెర తెఱచుకొనుచున్నది. మధువు నాస్వా దించు వేళకు నదివేళయని తెలియలేదు. అను భవపూర్తి వేళకు గవాక్షములనుండి సూర్యకిర ణములు చేదించుకొని వచ్చుచుండెను. తెల్ల వాఱుసరికి పూవును, తేటియు నిద్రామగ్నులై యుండిరి. నిచ్చెన మరల వేయబడెను జాము ప్రొద్దెక్కిన తరువాత నిద్దరు మేల్కొనిరి. వారికి తెలియకుండ వారియం దొక విచిత్రమైన లజ్జ సముద్భవించెను. ఇద్దఱు నొకరి కనులలో నొకరు చూచుకొనలేకపోయిరి. కనులు చేయలేని పని శరీరములు చేసినవి. కౌగలించికొనిరి. చెక్కిళ్ళు చెక్కిళ్ళు చేర్చి కొనిరి. వా రిద్దఱికిని శరీరములతో నేదియో దోషము చేసిన ట్లనిపించినది. ఈ దోషము సహజ మని మరల యనిపించుచున్నది. స్మృతికి మధురముగ నున్నది. మాధుర్యము లజ్జచేత పిహిత మగుచున్నది. చివరకు మేడమెట్లు దిగిపోవలయును. ముం దెవరు దిగిపోవలయును? నీ వనినచో నీవు. దిగిన వెంటనే యెవరైన కన్పింతురేమో! "ఈ యిల్లు నీది; అందఱు నీ బంధువులు; ని న్నేమియు ననుకొనరు: నీవు ముందు పో" మ్మని మిహిరకులుడు "మీరు మహాప్రభు వులు; మహావీరులు; మహాయోధులు; మిమ్ము చూచి భయపడుదురు; అందరు తొలగి పోదురు! మీరు పదు" డని కళ్యాణవతి ఇద్ద రును గలసి దిగిరి.

ఈనాటి రాత్రి యనఁగా నిష్కంటకుని గత్తులతోఁ గ్రుమ్మించిననాటి రాత్రి మిహిర కులుఁడు తన దేవేరి యయిన కల్యాణవతి కడకుఁ బోలేదు; సామాన్యముగాఁ గాశ్మీర రాజుల యంతఃపురములలోనికి విశ్వాస్యు లైన మంత్రులుకూడ పోరు. కల్యాణవతి యున్న మేడలోనికిఁ బురుషుఁ డెవ్వఁడును బోరాదు. పరిచర్య చేసెడివా రందఱు స్త్రీలే. ఈ నియమమును మిహిరకులుఁడు చేయలేదు. కల్యాణవతియే చేసెను. రాజు రాజకార్య ములను జూచికొని ప్రొద్దుపోయి యంతి పురమునకుఁ బోవును. కల్యాణవతి భర్త కొఱకుఁ బ్రతీక్షించుచుండును. ఒక్కొకపుడు నిద్రించుచుండును. రాజు పోయి యామెను మేల్కొల్పును. మఱియొకప్పుడు ప్రియు రాలు గాఢమైన నిద్రలో నున్నచోఁ దానుప్రక్క నున్న మంచముపై పరుం డును. ఆమెకు మెలకువ వచ్చినచోఁ బోయి తాను భర్తయొద్ద పరుండును. కాని వారి సంసారము చిత్రముగా నుండును. ఏక శయ్యాగతు లయ్యు నిద్దరు సహోదరులు పండుకొని నిదురించినట్లు నిదురింతురు. కల్యాణవతీ మిహిరకులుల సంయోగము జరిగి నెలనాళ్ళయినది. ఆ తొలినాటి సంస ర్గమే తప్ప మరల నింతరవకు వా రిద్ద రును గలసికొన్నదిలేదు. ఈనాఁడు కల్యాణ వతి నిష్కంటకుని వధ విన్నది. ఆమె కర్దము కాలేదు. పలుమంది పరిచారికల వలనఁ గథ యంతయుఁ దెలిసికొన్నది.

వసుకుళుడు ప్రాయోపవేశము చేసినపుడు నిష్కుంటకుడు ద్వారపాలకుడు. ఎవ్వరిని లోనికి రానియ్యవలదని రాజు నాజ్ఞ. నిష్కుంటకుడు నాడు యువరాజయిన తన భర్తను గూడ రానీయలేదు. ఇతని కత్తిని నాడు నరకెను. మిహిరకులుడు దండయాత్రకు బయలుదేరినప్పుడు నిష్కుంటకుని నగరాధ్యక్షునిగా నిలిపెను. మిహిరకులుడు తిరిగి వచ్చువేళకు నిష్కుంటకుడు నగరాధ్యక్షుడే కాదు. సేనాధ్యక్షుడు కాదగిన నేర్పు చూపెను. ఫలిత మేమియైనగ్ని. వాడు రాజభటుడు. రాజసేవకుని నెత్తురు వాని శరీరమున నిండి ప్రవహించుచున్నది. మిహిరకులుడు దేనుగంత బలము కలవాడు; నిష్కుంటకుడు పదియేనుగులంత బలము కలవాడట. వాడు కత్తి పుచ్చికొని నిలుచుండగా వేయిమంది వానినేమియు జేయలేరట. అది వానికి దెలియును. కాని యప్పటిరాజు చెప్పిన యాజ్ఞ నెట్లు నిర్వర్తించెనో యిప్పటిరాజు చేసిన యాజ్ఞయు నట్లే నిర్వర్తించెను. కత్తి పాఱవేయు మనగా పాఱవేసెను. నీ చేతులు విరచి కట్టుడు మనగా జేతులు వెనుకకు బెట్టెను. కత్తులతో బొడువగా బాధకూడ బడలేదు. రాజభక్తి యనగా బాధకూడ బడగూడదా? రాజభక్తి యుండును. భగవంతునియందు, భర్తయందు భక్తియుండును. వాడు రాజభక్తికి బరాకష్ఠ చూపించెను. భగవద్భక్తియందు బరాకాష్ఠ చూపించిన మహానుభావుల కథ లున్నవి. వ్యాసుడు ప్రహ్లాదుడు సంబరీషుడు శుకుడు శౌనకుడు దాల్భ్యుడు కలరు. పతిభక్తికి బరాకాష్ఠ చూపించిన స్త్రీలు కలరా? జనకరాజ దుహిత యయిన సీత కలదు. ఆమెయు రామచంద్రు నొకసారి నీవు పురుషరూపమున నున్న స్త్రీవి యని యన్నదట. అగ్నిప్రవేశము చేసినప్పుడు కూడ గొంత కష్టముగా మాటాడినది. సేవకుని, నిష్కుంటకుని మిహిరకులుడు పరీక్షించినట్లు భార్యలను భర్త లెవరు పరీక్షించిరి? దమయంతి ద్వితీయస్వయంవరము చాటింపించినది. ఆమె మనస్సు నలునియందే యున్నను వాక్కు జాఱిపోయినది. ఇంతకును దన భర్త మిక్కిలి తీక్ష్ణుడు. అతనితోడి సంసారము కత్తిమీది నడక. అతడు దండెత్తివచ్చుచుండగా దన తండ్రి పొందిన భీతి యామెకు గుర్తువచ్చినది. ఇతని ప్రేమ యెట్టిది? అతడు దేనిని వ్యతిక్రమముగా భావించును? కొందఱు రాజుయొక్క మనస్సెట్టిదని యెవ్వరికిని దెలియదని చెప్పుచున్నారు. తన కితని మనస్సు తెలియదు. ఎప్పుడు తా నేపని చేయునో యది భర్తకిష్ట మగునో కాదో తా నెట్లు గ్రహింపగలదు. తొలినాడు తన తండ్రియింట నొక పరవశమైన స్థితిలో వారు గలసికొనిరి. మరల నతడు తనయందట్టి కోర్కె నెఱపలేదు. పురుషుడు స్త్రీని ముద్దాడి, బుజ్జగించి, లాలించి, పౌనఃపున్యముగా బ్రేమను బ్రకటించుచున్నచో వానియందు స్త్రీకి జనవు కలుగును. తమ ఇద్దరిస్థితియు లోకసామాన్యముగలేదు. ఇరువురును మాటాడునదియే స్వల్పముగా నుండెను. అర్ధరాత్రములయం దతడు వచ్చును; ఇద్దఱును గౌగలించికొని పండుకొందురు. తాను భార్యయేమి? అతడు భర్తయేమి? దివాసమయములయందు దన కతని దర్శనమే లేదు. చూచిపోవుట కొకసారియైనను రాడేమి? అతడు యుద్ధవీరుడు. తాను స్త్రీ. కాని కొడుకులు లేని తన తండ్రి తనకు జదువు చెప్పించెను. యుద్ధవిద్య నేర్పించెను. తనకు వచ్చిన ఖడ్గవిద్య యసమాన మని తన గురువు చెప్పెను. ఒక సామాన్యుడైన రాజును బెండ్లియాడినచో వాని పరాక్రమము సంశయగ్రస్తమైనదైనచో దా నతని యుద్ధములను గెలిపింపగల శక్తి కలదాన నని యామె యనుకొనును. తన తండ్రి యట్లనెను. అస్త్రవిద్యాగురువట్లు చెప్పెను. తన నేర్చిన యస్త్రవిద్య నిరుపయోగమైనది. భర్తకు దాను భార్యయయ్యెను. తా నస్త్రవిద్యా నిపుణురాలని భర్తకు దెలియదు. తా నానాడు ధరించిన కవచాదులు తన దర్శనము లభించుటకు వేసికొనిన వేష మనుకొన్నాడు. అతని పేరు వినినంతనే కొంత, యతనిని జూచినంత పూర్తిగా దన మనస్సతనికి వశమగుటచేత నింకొకవిధముగా జరిగినది. తన సంకల్పము దైవముచేత నట్లు మరలింపబడకపోయినచో నతడు గాంధారదేశపు రాజధానిని ముట్టడించియుండును. తన పరాక్రమ మెఱిగియుండును. ఆమెకు మనసులో నొక యూహ కలిగెను. నిష్కుంటకుని నట్లు వధించియుండరాదు. రాజు కత్తి బూని వాని నెదిరింపవలయును. వాడు గెలిచినచో వాని కధికమైన యధికార మీయవలయును. ఓడినచో నున్నప్పటి యధికార మంచవలయును. ఆమె తా నత్తవారింటికి గాపురమునకు వచ్చుచు దన కవచఖడ్గశిరస్త్రాణములను వదలిరాలేదు. తా నింత వీరవనిత యని గాంధారములో నతనితో నెవరైన చెప్పియుందురు. కాని యితనితో మాటాడుటకే సర్వజనులకు భయమువేసినది. అత డెవ్వరికిని జనవీయడు. చనువు తీసికొన్నవారియెడల నతడు నెఱపెడి భయంకర దృష్టి వారిని గజగజలాడించును. అట్టి వానికి లోకములో నేమి సంబంధము? ఆయనకు లోక మెట్లు తెలియవలయును. ఆనాడు రాత్రి ప్రొద్దు పోవువరకు గల్యాణవతి భర్త కొరకు బ్రతీక్షించెను. అతడు రాలేదు. తెలవాఱవచ్చుచుండెను. ఆమెకు నిదుర పట్టెను. తెలవాఱెను. రాజు తన మంచముమీద లేడు. రాజు రాలేదని పరిచారికలు చెప్పిరి. కల్యాణవతి నాడు స్నానము చేసి, భోజనము చేసి బయలుదేరెను. కోట ముందు చచ్చదరమైన విశాలప్రదేశము కలదు. రాజు సాయంకాలములయం దచ్చట సభ తీర్చును. సభ యనగా గొన్ని న్యాయములు, కొందఱిని శిక్షించుటలు, కొందఱికి బహుమతు లిచ్చుటలు మొదలైనవి చేయుచుండును. ఈ సంగతిని రాణితో బరిచారికలు చెప్పిరి. కల్యాణవతి

నాటి మధ్యాహ్నము సకవచఖడ్గశిరస్త్రాణయై పరిచారికలు నివ్వెఱపోవుచుండఁగా రాజు కొలువునకుఁ బోయెను. చూపఱు లందఱు నెవఁడో రాజకుమారుఁడు వచ్చె ననుకొనిరి. ఎవఁడో యుద్ధవీరుఁడు వచ్చె ననుకొనిరి. ఎవఁడో రాజదర్శనము వాంఛించి వచ్చె ననుకొనిరి. ఆ వ్యక్తి మహారాణి యని వెనువెంట వచ్చిన యామె పరిచారికలకుఁ దెలియును. ఆ వేసమును జూచినంత నే మిహిరకులునకుఁ దెలియును. అతఁడు తీవ్రముగా నా మెవంకఁ జూచెను. అతని మనసు మనసులో లేదు. అతని కర్థము కాలేదు. అతని హృదయములో నొక యమృతపుబావి త్రవ్వఁబడెను. ఆ త్రవ్విన వ్యక్తి యీ వ్యక్తి. ఆ బావి పూడ్చరానిదిగా నున్నది. తన హృదయములో నెంత వెదకి నను గొండలు గుట్టలు మెట్టప్రదేశములు. వాన కురియునో కురియదో నీళ్ళు నిలువవు. వాన కురిసె నని యా శిలాప్రదేశమునకే తెలియదు. అచట నీమె యమృతపుటూటను బుట్టించెను. తా నంతిపురమును గదలిపో నని తన యంతిపురమునందుఁ బరపురుష ప్రవేశము గూడదని యామెయే నిర్ణయించు కొనెను. ఇట్లు పదిమందిలోని కేల వచ్చెను? మరల మిహిరకులుఁ డిట్లనుకొనెను. ఈమె యీ మెయని యెవ్వరికిని దెలియదు. అందఱకు నీమె యెవఁడో పురుషుఁ డనిపించెను. తన యంతిపురపు మర్యాదకుఁ దాను భంగము కలిగింపలేదు. ఆమె పరిచారికల కిది తెలియవచ్చును. వారి నోళ్ళు కట్టు పడునా? అది తరువాతిమాట. రాజునకుఁ దొలితీవ్రత తగ్గెను. తానుగూడ నా వ్యక్తి యెవఁడో యెఱుఁగనట్లు నటింప నారంభించెను. ఆమెను ముందునకు రమ్మని బిలిచి మిహిరకులుఁ డిట్లనెను. 'ఓయీ! వీరుఁడా! నీ వెవఁడవు? ఎచటినుండి వచ్చితివి? నీ వేమి కోరి వచ్చితివి?

కల్యా: మాది గాంధారదేశము. మాది మీ యత్తవారి యూరు. నే నొక న్యాయమును వాంఛించి వచ్చితిని.

రా: దానిని జెప్పుము. మా చేతనైనచో బాలింతుము.

రాణి; మహాప్రభువులకుఁ జేత కానిదని యుండదు.

రాజు: ఎందు కుండదు? ఒకరాజు నదీ ప్రవాహమును మరలింపఁగలఁడా? ఒక మహాపర్వతమును దాని యున్నచోట నుండి కదలించి మరియొకచోట పెట్టగలఁడా? అనంతకాలమున బ్రదికి యుండఁగలఁడా?

రాణి: అవి ప్రకృతిలోని ధర్మములు. రాజు చేసెడి ధర్మ మట్లుండవలయును. పెకలింపరాని పర్వతమువలె నుండవలయును. మరలింపరాని నదీ ప్రవాహము వలె నుండవలయును. సర్వకాలమునందు నిలిచెడి దానివలె నుండవలయును. అట్టి ధర్మమును జేసినచో మహారాజు చేయ లేని పని లేదని యర్థము.

రాజు: ఓయి వీరుఁడా! ధర్మము పర్వతము వంటిదికాదు. నదివంటిది. పర్వతమును పెకలింపలేముగాని నదీ ప్రవాహమును మరలించినచో మరలింపవచ్చును.

రాణి: అదియు సాధ్యముకాదు. అది యొక్క ధర్మమునకే సాధ్యమగును.

రాజు: మే మట్టి ధర్మమును జేయలేము. రామచంద్రునివలె రాక్షససంహారము చేయఁగలము; అనసూయాదేవివలె సూర్య సంచారము నాపలేము.

రాణి: కాని కొన్ని సామాన్య ధర్మము లున్నవి. వానిని జేయవచ్చును.

రాజు: నీ కేమి కావలయునో చెప్పుము.

రాణి: మహారాజా! మీరు గజబలులు, నేను మీముందుఁ బిట్టను. కాని నాకు ఖడ్గవిద్య తెలియును. మీరు నాతోఁ గత్తియుద్ధము చేయవలయునని వాంఛించి నేను వచ్చితిని —

అప్పుడు మిహిరకులుని ప్రక్క నున్న యొకఁడు 'నశించిపోయెదవు' అనెను. రాజు వాని శిరసును వెంటనే ఖండించెను. వాని శవము తొలఁగింపఁబడిన తరువాత మిహిరకులుఁ డిట్లనెను. 'మే మొకరితో మాట్లాడుచుండగా నడుమ నెవఁడో కల్పించుకొని మాటాడుట సభామర్యాద యెఱుఁగక పోవుట. మ మ్మవమానపఱచుట. మా యనుగ్రహమునకుఁ బాత్రుఁ డగుటకుఁ బ్రయత్నించుట. పొగడికలచేత మా యనుగ్రహము నెవ్వఁడును పొందలేఁడు. శక్తిసామర్థ్యముల చేతనే పొందగలఁడు. — కొంత సేపటికి సభ నిశ్శబ్ద మయ్యెను. ప్రజల భీతి పోయెను. అందఱి హృదయములయందు మర్యాదా భావము నిలచెను. మరల రాజు నా వీరునితో నిట్లనెను. 'నీవు మర్యాదాస్వరూపము నెఱిఁగినవాఁడవు. ఇంకొకఁడైనచో నీ సడిమికాలమున నెంతయో మాటాడి యుండును. నీవు మా ప్రశంస కెక్కితివి. నీవు మాతోఁ గత్తియుద్ధ మాడవలయునన్న కోరిక నీ కెందుకుఁ గలిగినదో మాకుఁ దెలిసి కొనవలయు నన్న కోరిక గలదు. మేము నిన్ను వధింపము. నీవు మ మ్మేమియుఁ జేయలేవు. ఆ కోరిక నీ కెందుకుఁ గలిగెను? మహావీరుఁడ ననిపించుకొనుటకా? మా ప్రశంస పొంది యీ రాజ్యమున నేదైన పెద్ద యధికారమును సంపాదించుటకా? నీకు హితులైనవారికి మా వలన నేదియైన నన్యాయము జరిగినచో దానిని సాధించుటకా?'

రాణి: మహారాజా! ఈ మూఁడుకారణములలో నేదియును గాదు. ప్రభువులకుఁ బ్రభువులే యన్యాయము చేసికొనుచున్నారు. ఆ యన్యాయము నివారించుటకు నే నిట్లు వచ్చితిని.

రాజు: మా కన్యాయము మేమే చేసికొన్నచో నీ కేమిపట్టినది.

రాణి: రా జాత్మవంటివాఁడు. ప్రజలు శరీరమువంటివారు. పరస్పరము వీరిద్దఱు రక్షార్చనలచేత నన్యోన్యవిరాజితులై యుండవలయును. నేను ప్రజ; ప్రజారూపమును. అందుచేత వచ్చితిని.

మిహిరకులునకు నిరాహారదీక్ష పొందిన బ్రాహ్మణు లెనుఁగులచేత మట్టింపఁబడఁ బోవువేళ వేదవేదాంగవేత్తయయిన యా

బ్రాహ్మణ యువకుఁడు చెప్పిన మాటజ్ఞప్తికి వచ్చెను. ఈమెతన ప్రజారూపము. తన సంతానరూపము. ఈమె యందు కలిగిన సంతానము తన రూపము. నాఁకు భవిష్యత్తున రాజు. ఈమె ప్రజ. అనఁగా ప్రజాగర్భ— సుంత సేపు తలవంచికొని రాజు కూర్చుండెను. సభలోని మంత్రులు సేనాపతులు విభ్రాంతిపొంది చూచుచుండిరి. రా జిట్లనెను. "మేము మాకుఁ జేసికొనిన యపకార మెట్టిది? నీవు దాని నెట్లుఁ దొలఁగింతువు?

రాణి: అది యిట్టిది. నిష్కంటకుఁడు మచ్చలేని రాజభక్తుఁడు. అతఁడు రాజభక్తి కొఱకు తన శౌర్యమును ప్రకటింపఁడు. తన బలమును వ్యక్తీకరింపఁడు. రాజు తన కపకారము చేయునని తెలిసికూడఁ దనకు నియమింపఁబడిన ధర్మమును స్వచ్ఛముగాఁ బరిపాలించును. వాని భక్తిని సాకుచేసికొని వానిని వధించుట ప్రభువులు తమకుఁ దామే యపకారము చేసికొనుట.

రాజు: అది నీవు మాతోఁ గత్తియుద్ధము చేసినచో నెట్లు క్షాళితము కాఁగలదు.

రాణి: నేనుగూడ ప్రభువులయం దట్టి భక్తిభావము కల వ్యక్తిని. నా భక్తియం దెప్పు డే వ్యతిక్రమము కలుగునో నాకు దెలియదు. ఇది రాచబంటుయొక్క ధర్మమని మేము చేయుదుము. ప్రభువులకుఁ గోపము వచ్చును. మా భక్తి యన్న ఖడ్గమును బూని మమ్మే వధింతురు. అట్టి నిష్క్రియమైన చావు కంటెఁ దమరితో యుద్ధము చేసి మరణించుటకు వచ్చితిని.

రాజు: (చాలసేపు మాటాడలేదు. చివరి కిట్లనెను.) 'ఓయి వీరుఁడా! నిన్ను నే నెఱుఁగుదును. నీ కట్టి యాపదలేదు. నీయందుఁ బది వ్యతిక్రమములు మేము సహింతుము. ఓయీ! నేటి నీ యుపదేశము నేను జీవితాంతము మఱువను. నా యెడలు నేను మఱచి నిన్ను వధించినచో వెంటనే నన్ను నేను వధించి కొందును.

రాణి: మహారాజా! నీ వనిన మాటలు సర్వజనులకు సమ్మోదము కలిగించుచున్నవి. నిష్కంటకుఁడు మహాబలుఁడు. నా కేమో యంతబలము లేదు. కాని యతఁడు ఖడ్గవిద్యానిపుణుఁ డని ప్రజలు చెప్పుదురు. గాంధారదేశమున నాయంతటి ఖడ్గవిద్యానిపుణుఁడు లేఁడని చెప్పికొందురు. ప్రభువులు నేఁడు నా కిచ్చిన వాగ్దానము నా వాఙ్నైపుణ్యము చేత మీ రార్ద్రచిత్తులై యిచ్చినట్లు భావింతురు. నా కట్టిభావనతో నవసరము లేదు. ఒకప్పు డట్టి దుర్దశ వచ్చినచో నిష్కంటకుని వలె నేనును ఖడ్గమును బరిత్యజింతును. అతఁడు సమర్థుఁడై రాజభక్తికొఱకు ఖడ్గమును బరిత్యజించెను. నాకును నట్టి శక్తి కలదని చూపింపవలయునుగదా! వ్యర్థమైన ఖడ్గము చేతిలోనుండి పరిత్యజించినచో రాజభక్తికి విలువలేదు.

మి. కు: నా కత్తితో నీ శిరస్త్రాణమును తొలఁగించెదను.

రాణి: అది చేయవచ్చును. ప్రభువు లది చేయలేనిచో నే నెప్పుడైన రాజభక్తిని పురస్కరించికొని ఖడ్గమును పరిత్యజించినచో నా రాజభక్తి వెల్లడియగును.

మిహిరకులుని మొగమున మందహాసము నెవ్వరు నెప్పుడు చూడలేదు. ఇపుడు రాజు మొగమున మందహాసమువంటి లక్షణ మొకటి కనిపించెను. అతని హృదయమున హేల యను లక్షణ మెన్నఁడు లేదు. ఇపు డతని హృదయమున హేల యను నొక లక్షణము కలిగెను. మంత్రులకు సేనాపతులకు నధికారులకు నితఁడు పురుషుఁడు కాఁడు స్త్రీ యని చూపింపవలయును. మహారాణి యని చూపింపవలయును. ప్రజలు నివ్వెఱపోవలయును. తనలో నామె త్రవ్విన యమృతపుబావి నీటితుంపురులు వారికిఁ గనిపింపవలయును. అపుడు భార్యమీఁదఁ గోపము వచ్చినట్లు నటించి యామె నంతిపురమునకుఁ బంపవలయును, తా నామెకు వాగ్దానము చేసెను. ఆమె వ్యతిక్రమములను తాను మన్నింపవలయును. ఆమెను శిక్షింపరాదు గాని పరిహాసము చేయవచ్చునుగదా! అతఁ డిట్లనెను — 'ఓయి వీరుఁడా! నీవు కవచధారివి. నాకుఁ గవచము లేదు. నేను నిన్ను సంహరింపను. నీ వొక ధర్మము కట్టిన మూర్తివలె నున్నావు. నే నాధర్మమును మడియింపను, కాని ధర్మమును బరిహసించుట నా ప్రకృతిలో నున్నది. నీ శిరస్త్రాణమును దొలఁగించి నిన్ను పరిహాసభాజనమును జేసెదను; కాని నీ వేధర్మముయొక్క మూర్తివో యా ధర్మము నా హృదయమునఁ బ్రతిష్ఠింపఁబడియున్నది. ధర్మము ధర్మమే. పరిహాసము పరిహాసమే. నిష్కంటకుని నేను వధించుటలోఁ దప్పేమియు లేదు. అతఁడు హిమవత్పర్వతమువంటివాఁడు. కాని శిలామూర్తి. నాకు విరోధులు దొంగలవలెఁ బోయి యా పర్వతపుగుహలలో దాగికొనవచ్చును. పర్వతము పర్వతముగా నున్నచో నష్టము లేదు. దాని గుహలయందుఁ జోరులు చేరినచో భయముగదా! నీవు న్యాయస్థుఁడవు గనుక బహిరంగముగా వచ్చి వానిని గూర్చి నాతోఁ జెప్పితివి. నాకు నేను చేసికొన్న యపకారము నుటంకించితివి. నే నన్నచో నీ కెంత భక్తియో నాయం దందఱకు నంతభక్తి యుండునా? వాఁడు బ్రతికియున్నచోఁ గుత్సితులైన జనులు వాని

యెద్ద చేరి రాజు నీ కట్లు చేసె నిట్లు చేసెను. నిన్నెప్పుడో వధించును. అని కుటిలపు మాటలు చెప్పి స్వచ్ఛముగా నున్న వాని రాజభక్తిగుణమును గలుషితము చేయుదురు. వాఁడిప్పుడు పుణ్యలోకములకుఁ బోవును. వానిని నరకలోకములనుండి నేను రక్షించితిని. వానిద్వారమున వచ్చు రాజవిప్లవములను దొలఁగించితిని'— ఈ మాటలన్నియు రాజు మంత్రులు సేనానులు మొదలైన వారు వినుటకుఁ జెప్పెను. ఇతఁ డొక్క యముఁడే కాఁడు; సహస్రాక్షుఁడు.— కాని మిహిరకులుని జీవలక్షణములో నున్న క్రూరత్వము వానియందుఁ బెక్కుమారులు హఠాదుద్భూత మగును. అతని ప్రకృతి దురత్యయమైనది. ఇప్పుడు కల్యాణవతీ సమక్షమున నతఁ డింద్రునివలె, మన్మధునివలె నుండెను. ఆ దక్షిణదిగధిపతి యైన యమునకు భార్య లేదా ? రావణునకు భార్య లేదా ? హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని శిక్షించెను. గాని వానియందు మమకారము కలిగి దుఃఖించిన లీలావతిని శిక్షింపలేదే. కల్యాణవతి యనుకొనని మెఱపు మెఱసినంత కాలములో ఖడ్గము పూని మిహిరకులుఁడు కల్యాణవతిపైకి లంఘించెను. ఆ నిముసమునం దతఁడు శిరస్త్రాణమునే కాదు కవచమునుగూడఁ దొలగించి తన భార్యను రెండవసారి కౌగిలింప నెంచెను. తెలియనట్లు నటింపనెంచెను. కాని కల్యాణవతి మెఱుపువలె వెనుకకు లంఘించెను. మిహిరకులుఁడు నివ్వెఱపోయి నిలబడెను. అంతట కత్తియుద్ధము సాగినది. కల్యాణవతి ఖడ్గము భర్తదెసకే పోదు. మిహిరకులుని ఖడ్గము కల్యాణవతి యొక్క శిరస్త్రాణమును దొలఁగించుటకే నిత్య ప్రయత్నమును జేయును. కాని శిరస్త్రాణమునకు ఖడ్గము తాఁకుటయే దుర్ఘటముగా నుండెను. రాజసభలో నెవరు నెవ్వరిని బ్రశంశింపరాదు. అది సభామర్యాదకు లోపము. అద్ధా! అహో! ఆహ్! ఆహా! మొదలైన ప్రశంసాశబ్దములు సర్వజనుల యధరముల లోపలనే నిలచిపోయెను. మిహిరకులుని యీ ప్రయత్నము గడియన్నరసేపు సాగెను. రాజునకుఁ దెలిసెను. అతఁ డిట్లనుకొనెను. ఈమె నన్ను ప్రేమించినది గనుక సరిపోయినది. నేను గాంధారరాజ్య ముఖ్యపట్టణమును ముట్టడింపగా ప్రత్యర్థియై యీమె లోపల నున్నచో నే నేమి చేయఁగలిగియుండెడివాఁడను. ఈమె శిరస్త్రాణమును గత్తితోఁ దాఁకలేని నేను ఈమె కవచమును ఛేదింపఁగలనా ? ఈమె పాములె, డేగవలెఁ బారాడుచున్నది — రాజు పోయి తన సింహాసనమునందుఁ గూర్చుండెను. అతఁడు కల్యాణవతివంకఁ జూచి యిట్లనెను. 'ఓయి రాజకుమారా! నీవే గెలిచితివి. ఎన్నఁడు జరుగనిది యొకవేళ జరిగినచో నిన్ను వధించుటకు నీ ఖడ్గమును దూరముగాఁ బాఱవేయుమన్నచో వట్టి భక్తిచేతనే పాఱవేసితివిగాని నన్ను నిర్జింపలేక పాఱవేసితివని నే ననుకొనను. నీ వింకఁ బోవచ్చును.'

రాణి : మహారాజా! నే నెవ్వరినో యిచ్చటివారికిఁ దెలియదు. ఎచ్చటినుండి వచ్చితినో వీరికిఁ దెలియదు. నేను రహస్యముగా వచ్చితిని, రహస్యముగాఁ బోవలయును. నే నెవరినో తెలిసికొనవలయునని కొందఱు కుటిలబుద్ధులు ప్రయత్నింపవచ్చును. నేను పోవుచుండగా నెవ్వఁడును వెనుదిరిగి చూడరాదు. ఉన్నచోటినుండి కదలరాదు. ఈ వరమును నా కిమ్ము.

రాజు రాజభటులవంకఁ జూచెను. ఆమె వెడలిపోయెను. సింహద్వారాభిముఖముగాఁ బోయిన ట్లుండెను. ఆమె మలుపు దిరిగి రాజప్రసాదములయం దున్న రహస్య మార్గములవెంట తన యంతిపురమునకుఁ జేరెను.

ఆనాఁడు రాత్రి రాజు మహారాణి యంతఃపురమునకుఁ బోయెను. నెలనాళ్ళతనియందు నిద్రాణమైయున్న మన్మథుఁడు లేచి చిందులు త్రొక్కుచుండెను. ఏమి కల్యాణవతి ? ఏమి రహస్యగోపనశక్తి గల స్త్రీ ? తన రహస్యమును దా నెంత రక్షించికొనగలదు? ఎంతటి ఖడ్గవిద్యావిశారదురాలు? ఎంతటి నిర్భీతురాలు ? ఎంతటి ధర్మభావన కలది ? అయ్యో ! ఆమె యామెకాక నిజముగా నెవ్వఁడో వీరుఁ డైనచో నీనాఁడు తాను వాని శిరశ్ఛేదము చేసియుండును. ఆమెవలనఁ దన యధికారులకుఁ దన నీతి తెలిసెను. తాను వట్టి రాక్షసుఁడు కాఁడు. తనయందు ధర్మమును న్యాయమునుగూడఁ గలవన్నట్లు రాణి ప్రజలకు వెలయించెను, ఇది యేమి నీతి ? మొదలుగాఁ బ్రశంసయుఁ బ్రేమావేశమును గలసికొనవలెనన్న యుద్రేకమును ముప్పిరిగొనఁగా రాత్రి రెండుజాముల వేళ నంతిపురమునకుఁ బోయెను. త్రోవ యంతయుఁ బరిచారిక లిచ్చు నీరాజనములతోఁ బ్రకాశించుచుండెను. తాను లోనికిఁ బోవుసరికి నామె ప్రతీక్షించుచుండునో నిద్రించుచుండునో యనుకొనుచు నతఁడు పోయెను. శయ్యాగృహమునందుఁ గల్యాణవతి లేదు. మిహిరకులుఁ డటునిటు పచారు చేయుచుండెను. ఆమె సకవచ శిరస్త్రాణయై లోనికి వచ్చెను. ఇట్లనెను: 'మహారాజా! నా శిరస్త్రాణమును గౌచమును చేతితోఁ దీయఁదగిన వానిని ఖడ్గముతోఁ దొలగించుట యెందులకు ? నన్ను క్షమింపు" మని పాదములపైఁ బడెను. రాజామె దేహత్రాణ మూర్ధత్రాణములను దొలగించి యిట్లనెను. 'నిన్నందుకు క్షమించితిని గాని వీనిని దొలఁగించు నాల

స్యము ఘటించినందులకు క్షమింపను. నీవు అనార్తవమైన పుష్పమువు. నేను దగలీజని తేటిని!

ఆ మఱునాఁడు రాజు నిష్కంటకుని కుటుంబమునుగూర్చి కనుగొనెను. నిష్కంటకున కొక కుమారుఁ డున్నాడు. వాఁడు తండ్రి యంతటివాఁడు. అంతటి రాజభక్తుఁడు. తన తండ్రిని రాజట్లు వధించగా వీఁడు రాజును ద్వేషింపలేదు. రాజును దిరస్కరించుచున్న ప్రక్కవారితో శ్రుతికలుపలేదు. తన తండ్రియొక్క రాజభక్తినే ప్రశంసించుచుండెను. తండ్రి పోయిన దుఃఖము ననుభవించుచుండెను. నిన్న రాజును రాణియు మాటాడుచుండగా రాణిని రాణియని తెలియకుండ నెవఁడో వీరుఁ డనుకొనుచుఁ దన తండ్రియొక్క రాజభక్తిని రాణి ప్రశంసించుచుండగా వాఁడా సభలోఁ గన్నీళ్ళు కార్చుచుఁ గూర్చుండెను. వానిని గూర్చి యధికారులు రాజుతోఁ జెప్పిరి. రాజు వానివంకఁ జూచెను. మఱునాటి ప్రొద్దున వానిని వచ్చి తన దర్శనము చేయుమని వార్త పెట్టెను. వాఁడు ప్రొద్దుటిపూట వచ్చుటకు వీలులేదు, తండ్రికర్మలు జరుగుచున్నవి, సాయంకాలమున నైనచో వత్తు నని తిరిగి చెప్పి పంపెను. రాజు వానికి వేయిదీనారములు పంపెను. కర్మలైన తరువాత రమ్మనెను. వాఁడు తండ్రిదినము చేసి రాజదర్శనమునకుఁ బోయెను. రాజు వాని పేరడిగెను. వాఁడు తన పేరు కృతజ్ఞుఁ డని చెప్పెను. రాజు ప్రక్కనున్న సేవకుని బిలిచి వీఁడు నిష్కంటకుని కుమారుఁ డని మహారాణికిఁ జెప్పి చూపింపు మని పంపెను. ఆమె నగరాధ్యక్షుని బిలిపించి యిట్లనెను. 'ఓయీ! నిష్కంటకుని కొడుకైన వీనికి రాజుగారు నగరాధ్యక్షపదవి నీయ నెంచుచున్నారు. నీ వింకొక యుద్యోగమడుగుము. నీ కిప్పింతు' ననెను. వాఁడు మఱియొక యుద్యోగమును గోరెను. రాణి కృతజ్ఞుని నగరాధ్యక్షుని జేసెను. —

(సశేషము)




హైద్రాబాదులో డిశంబరు 30 వ తేదీన అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనానికి యూనియన్ హోం మంత్రి శ్రీ గుల్జారీలాల్‌నందా ప్రారంభోత్సవం జరిపారు.



అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనం ప్రారంభోత్సవానికి హాజరైన ప్రేక్షకులు.



అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో ధర్మాదాయశాఖ ప్రదర్శనశాలను పంచాయతీరాజ్ శాఖామంత్రి ప్రారంభించారు.

అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో జనవరి 9 వ తేదీన వైద్యపరీక్ష పథకానికి డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ప్రారంభోత్సవం చేశారు.





హకీంపేటలో డిశంబరు 25 వ తేదీన పైలట్లు, నావిగేటర్లకోర్సు శిక్షితులు పెరేడులో పాల్గొన్నారు.

హకీంపేట విమానాశ్రయంలో యూనియన్ రక్షణమంత్రి శ్రీ వై. బి. చావన్ వందనస్వీకారం చేశారు.





ముఖ్యమంత్రి, డిశంబరు 23 వ తేదీన కరీంనగర్‌లో బహిరంగసభలో ఉపన్యసించారు.



కరీంనగర్‌జిల్లా సిరిసిల్లాలో డిశంబరు 24 వ తేదీన ముఖ్యమంత్రి గ్రంథాలయ భవనానికి శంకుస్థాపనచేశారు.



నిజామాబాదులో సహకార చక్కెర ఫ్యాక్టరీ ప్రారంభోత్సవ సందర్భంలో డాక్టర్ ఎం. చెన్నారెడ్డి ప్రసంగిస్తున్నారు.



సమాచార, కార్మిక, రవాణా శాఖలమంత్రి శ్రీ బి. వి. గురుమూర్తి కర్నూలులో సమాచార కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు.



సమాచారశాఖా మంత్రి సమాచార కేంద్రంలోని ప్రదర్శన వస్తువులను చూస్తున్న దృశ్యం.



రైల్వేల మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ హైదరాబాద్‌లో డిశంబరు 22వ తేదీన ఆర్థోపెడిక్ ఆసుపత్రిని ప్రారంభించారు.

శ్రీ హరినారాయణ ఆప్టే రచన తెలుగు అనువాద గ్రంథాన్ని, జనవరి 2 వ తేదీన రవీంద్ర భారతిలో జరిగిన సభలో గవర్నరు ఆవిష్కరించారు.





జనవరి 2 వ తేదీన, శ్రీ హరినారాయణ ఆప్టే శతాబ్ద్యుత్స వాల సందర్భంగా ఆయన చిత్రపటాన్ని ముఖ్యమంత్రి ఆవిష్కరించారు.

రాజేంద్రనగర్‌లోని వ్యవసాయ కళాశాలలో అంతర్ కళాశాలల క్రీడా వారోత్సవం చివరిరోజు కార్యక్రమంలో గవర్నరు ఉపన్యసించారు.





ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ముఖ్యమంత్రి స్నాతకోప న్యాసం చేస్తున్న దృశ్యం.



ముఖ్యమంత్రి డిశంబరు 23 వ తేదీన కరీంనగర్ జిల్లా, వెనవంకలో కుటుంబనియంత్రణ కేంద్రానికి ప్రారంభో త్సవం జరిపారు.



కరీంనగర్ జిల్లా గూడూరులో డిశంబరు 23 వ తేదీన ముఖ్యమంత్రి రక్షిత మంచినీటి సరఫరా పథకానికి ప్రారంభోత్సవం చేశారు.



పైలట్లు, నావిగేటర్ల కోర్సులలో ఉత్తమ శ్రేణిలో నెగ్గిన విద్యార్థులకు హకీమ్‌పేట విమానాశ్రయంలో, డిశంబరు 25 వ తేదీన శ్రీ వై. బి. చావన్ ట్రాఫీలు అందజేశారు.



విమానాశ్రయంలో శ్రీ చావన్ రక్షణదళాన్ని పరిశీలించారు.



ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా శ్రీ పి. సత్యనారాయణరాజుచే గవర్నరు ప్రమాణస్వీకారం చేయిస్తున్నారు.



పెరేడుకు హాజరు కావడానికి వెళ్తున్న ప్రిన్స్ ముకర్రమ్ జా.



హకీంపేట విమానాశ్రయంలో ప్రేక్షకులు.



ఫలక్‌నుమా పబ్లిక్ స్కూల్ వద్ద ఎన్. సి. సి. శిబిరంలో
విద్యాశాఖ కార్యదర్శి.

# పరీక్షాసుందరి

## (నక్షత్రమాల)

ప్రతివాదిభయంకర వేదాంతాచార్యులు

### ప్రథమరంగము

శా. శ్రీ సర్వేశ్వరపాదపంకజములన్ సేవించుచున్ దేవభా
షాసారాంచిత మౌ తెనుంగునుడి నుత్సాహంబునన్ సత్యధా
రా సౌందర్యవిభావనాత్మక విమర్శాపూర్ణ విశ్వాసముల్
సేసల్ చల్లఁగ నిత్తు భారతికి నోలిన్ బద్యనక్షత్రముల్.

ఆ. కలుకుఁజదువులఁ దావి వక్కల నొసంగి
హెచ్చుమచ్చిక సున్నము నచ్చు వోసి
ఆస లూరించు సన్నని యాకుమడుపు
లందఁజేయఁగ వచ్చెను సుందరి అదె!

ఉ. ఆ రమణీలలామ హృది నారయలేక విమోహితాత్ములై
చేరెడు కన్నులున్ దళుకుఁజెక్కులు జీవనభోగభాగ్య వాం
ఛారజనీకరోదయనిసర్గము లంచు భ్రమించు చిత్తకా
సారులు నివ్వెఱం గనిరి సారవివేకము లేకపోవుటన్.

ఉ. రాతురులున్ బవళ్లు నవిరామముగాఁ గుతుక న్వెసంగి యు
ద్ధూతమనోంబుజాతులయి దుఃఖనివారణకారణమ్ముగా
లేఁతవయస్సువారలును లేచి గతాగతు లాచుఁ దన్ముఖో
ద్భూతవిలాసచంద్రికలఁ బొందును గోరి తపించి రెంతయున్.

మ. సరదాగా బరదాలఁ గట్టుకొని వేషాల్ భూషణా లిమ్ముగా
సరిసేయన్ గమకించు నాటకుల నిస్తంద్రత్వము న్మించు త
త్పరతన్ మాణవకప్రకాండముల నిర్వాచ్యప్రశంసాపుర
స్కారులై యాడిరి పాడి రా పరపరీక్షాసుందరీవృత్తులన్.

సీ. గిరగిరఁ దిరుగు బొంగరముల యురవడి
బిగిదప్పి తొరతొర ముగియుచుండె
కవి భావనాశక్తి గనుఁగొని యెదురొడ్డు
గాలిపటమ్ములలీల వ్రాలె
నరముల బలిమికి గరువతనం బిచ్చు
బహిరంగకేళికా ప్రభలు దఱఁగె
గేహాంతరమ్ములఁ గీలు వీలును జూచి
సలిపెడు క్రీడలు మలుపు దాఁటె
నిత్యయౌవనసంధాననిర్నిమిత్త
మానసోద్రేకకారణ మత్తకాశి
నీ పరీవృతప్రేరణ నేపు వీడి
సుఖము దొరయక వారలు సొమ్మసిలిరి.

శా. ఏవో ప్రశ్నలు వేయు నా యువతి ము న్వీక్షింపఁగాఁ దగ్గవో
కావో నూటికిఁ దొంబది న్వదలి యాకర్షించు రెండైదులన్
దా వైశద్యముతోడ నెంచుకొని ముస్తాబైన యభ్యర్థినిన్
ఈ విద్యాపరిపాకనిర్ణయము తావేలేని జూడం బగున్.

శా. ఆ లావణ్యవతీ దృగంచలములం దైక్యమ్ము గా శక్యమా
వేళావాసనచేఁ గృతార్థు లయిరే విద్యార్థిసూనమ్ము లో
లాలూచీవ్యవహారచాలనచణుల్ లక్ష్యావకాశంబులం
దేలాగో సమయానుకూల మగు సంతృప్తిన్ గనం జాలిరిన్.

క. ఆ నవలామణి యటు లడిగిన
కాననకోణమ్ములను బోని కాననితావుల్
దీనానను లై మూనిరి పో
అనఁగలేనట్టివార లందు ననేకుల్.

### ద్వితీయరంగము

సీ. అది పురాసంస్కృతీ వదనవికాసమ్మొ
నవనవ లాడెడు నవ్యపదమొ
అనుభవసిద్ధమా ననుభావదృశ్యమో
అనువాదఫలిత పూతామృతంబొ

అమరవాణీధురీణాడంబరత్వమో
తేటయౌ తననాటి నీటుఁదనమొ
విశ్వవిజ్ఞానసంవీక్షణాసక్తియో
దేశాభిమాన నిర్దిష్టరతియొ
విద్వదుత్సవహేతుభారోద్వహతయొ
జనత రంజించు చక్కని యనువుఁబలుకొ
తనవు పులకించు రూపసందర్భవిధియొ
ఆ పరీక్షాపయోధర ఆకళించె?

శా. ప్రాచీనాధునికప్రచండతరవాగ్వాదమ్ము సృష్ట్యాదిగా
ఱాచెన్ రేఁచిన దన్నిసంగతుల 'అట్లాంటిక్' మహావార్నిధిన్
వీచీసంధులఁ బోలె; పూర్వగుణగంభీరత్వము న్మాన క
ర్వాచీనానుసరప్రయోజనము నా వామాక్షి పాటించునే?

మ. 'అతి సర్వత్ర విసర్జయేత్' ఆనెడి వాక్యస్ఫూర్తి భావించి యు
న్నతసౌధాంతరవీథికి న్చలెనె నానానూనసోపానసం
గతచింతాశ్రమతోడ ముందుడుగు సాగన్బూను ధీరుల్ జగ
ద్ధితు లెట్లోర్తురు నాట్యకృత్రిమత నుద్దీపించు భామామణిన్?

చ. వలపులగ్రుమ్మ కమ్మనగు భావజునోజయు, ఱాల్ద్రవించు గా
థల యొలికింపు, మారణనిధానరణార్ణవవర్ణనంబు నే
కళయు, మతమ్ము, శాస్త్రము నఖండము లౌచు ననేకభంగులన్
వెలిఁగెను నాఁడు నేఁడును గణించునె యాననఁబోడి వానినిన్?

శా. వాగర్థంబులఁ గావ్యసీమ అవినాభావమ్ముతో నుండఁగా
బాగౌనం చలనాఁడె సూత్రము వచింపంబడ్డ దింకేటికో
రోగా ల్వెంచు విమర్శ లీయెడల? ఆరూఢస్థితిన్ లీనమౌ
యోగాభ్యాసము దేవతాస్మరణ యె ట్లొప్పించు నా యంగనన్?

శా. శబ్దోత్పాదిక, దీపకారణము స్పర్శాశక్తి విద్యుత్తునన్
అబ్దానేకకృషిప్రలబ్ధములు భూజావిష్కృతుల్ పెక్కులున్
అబ్దాధ్వోర్ధ్వగమౌ విమానములయూహల్, బాంబులున్ రాకెటుల్
శబ్దాలన్ వివరించు కైతను బరీక్షాతన్వి గుర్తించునే?

ఉ. పండితుఁ డీతఁ డంచుఁ గవివర్యుఁడు వేఱొక డంచు నెన్నఁగా
దండితనమ్ముగాదు; కవితా వనితా మధురోక్తియుక్తి యు
ద్దండముగా నెఱింగినఁ గదా బుజువండితుఁడౌ? అదుష్టమౌ
పాండితి గావలె న్గవికి; వారల నెవ్వరి నామె గోరునో?

ఉ. పద్యమునందు నున్నయది ప్రాభవమందునఁ బద్యకావ్యముల్
హృద్యము లౌ రచించిన; అదృష్టము గల్గినయట్టివారికిన్
గద్యములోనఁ బద్యగమనంబును బద్యములోన గద్యమున్
వేద్యము సేయఁగాఁబడు ప్రవీణత యా గజయాన చూచునే?

మ. ఎవరో వంటలవాఁడు నేర్పరియె సుమ్మీ వండెనం చాడినన్
చవిలేకుండిన పాక మేగతిని మెచ్చన్వచ్చు నెవ్వారికిన్?
అవుఁగా కెంత ప్రసిద్ధుఁడైనఁ గవి కావ్యానందముం డన్వలెన్
కవినా కావ్యమునా నుతించుట పరీక్షాకాంతకున్ యుక్తమౌ?

## తృతీయరంగము

మ. అవిగో! 'గేజుల' తేజము ల్గలవు, కండ్లార న్విలోకించి చే
రువలో నెక్కిన 'బ్రాడ్లు', 'మీటరులు', 'నేరోల్' గమ్యముం
జేర్చెడిన్
అవివేకం బగువానిఁ బీఁకుట, అవశ్యం బైనచో సాహితిన్
సవరింపందగు, 'నేలనున్ వదలు ఆ సాము' ఇష్టమా జాణకున్?

మ. అవునా వ్యాకరణమ్ము ఛందమును బెల్లాటంకముల్ భావజా
హ్నవికి? 'ఆడంగను లేక ఓటి దని యన్నన్ మద్దెలన్ జెల్లునా?
కవి కిచ్చున్ నియమాలతో సరిగ సౌకర్యాలు; చేకూర్చెడిన్
సవనోద్దిష్టము దివ్యమౌ అవబృథస్నానంబు ఆ చానతో.

శా. భాషాయోషను 'భేషు' గాఁగ నొనరింపన్ గర్జమే యైనచో
నీషన్నిమ్న మొనర్పనౌఁ గవికిఁ దానే చెందు భావస్థితిన్
భాషాజ్ఞానము గల్గువారు పయనింపంజాలు పైమెట్టుకున్
రోషావేశము లిందుఁ దాఁకెడునె యా రోలంబనీలాలకన్?

శా. స్వాతంత్ర్యంబు గడించి షోడశమహాసంవత్సరా లాయెగా!
ఏతద్భాషయె సుస్థిరం బనుట యేదీ భారతాంబాధృతిన్?
మూతిన్ వ్రాఁతను కొంచ మున్గినటు లేమో పోరుచున్నారలే!
చేత న్పూఁదిన సంస్కృతంబునను పేచీ గల్గదా కల్కికిన్.

సీ. ఈనాఁటికిని జైళ్ళ నిడుములఁ బడువారు
ఘాతుకమృతులు నజ్ఞాతభటులు
'అన్నమో రామచంద్రా!' యని యనువారు
వ్యాధిబాధలచేత వగచువారు
ఏనాఁటికినిఁ దేలఁ గానని వెలలచే
ఋణములలో మున్గి వనరువారు

ముద్రితమ్ముల మించు పుస్తకమ్ములు వ్రాసి
గ్రామాలఁ ద్రొమెడు రచయితలును

ఉనికి దొరకని పలు నిరుద్యోగితతులు
కంటి కంటుట యెటుల నా కామినికిని
పంటచేలను మాఁగిన పండ్లతోడ
సంతసము గొల్పునట్టి హేమంతమునను ?

చ. లలితముగా వెలుంగు కమలప్రియుఁ డుజ్జ్వలకాంతి నింపు క
ల్వలచెలికాఁడు నూతనకళామిళితమ్ములు ప్రాణిదంపతుల్
ఫలభరితమ్ములౌ వనులు భాసురమానసకర్షకావళుల్
గలిగిన శారదాంత ఋతుకాలము డాసిన దా లతాంగికిన్.

సీ. సౌందర్యదృష్టిని సాపాటు సేయుక
విశ్వతత్త్వవిచార తత్వములును
పత్రికాదులలో దబాయించి చెలరేఁగు
భావాభ్యుదయ నభోభవనములును

కావ్యదోషము లెల్ల గడ్డకట్టియు నిక్క
న్యాయవిహీన రామాయణములు
ఎక్కడనో కాని అక్కఱలేనట్టి
లెక్కకు మీఱు మధ్యాక్కరలును

విశ్వవిద్యాలయప్రాంత వేదికలను
నవ్యసాహిత్య డోలికానౌకలందు
వృక్షములక్రిందఁ బెరిఁగెడి వింత మొక్క
లందున 'ఏకాడమీ'లలోఁ గ్రందుకొనియె.

ఉ. కామముఁ బ్రేమముం గలిపి కశ్మలము న్బొనరించునట్టి యు
ద్దామమనీషలైన రసధాములు కంటికి నింపు సొంపుగా
నే మృగశాబకాక్షిఁ దిలకింతురొ అంతటిదే అనంతమౌ
నేమము గాఁగ నెంత్రు, గమనింతురె యున్నతబాధ్యతావధిన్?

తే. రంభ నదిమిపట్టు సంభోగదంభుఁ డౌ
రావణాసురుని విరాళికరణి
భారతీపవిత్రబంధురాంగంబును
వాడువఱచు ఎదలు వీడవలయు.

# వేదములు

విద్యాశంకరభారతీస్వామి

వేదము అను శబ్దమునకు తెలియచేయునది అని అర్థము. తెలియచేయునది అని అంటే తెలియని దానినిన్ని తెలుసుకొనుటకు వీలులేని దానినిన్ని తెలియచేయునది అని అర్థమే కాని అన్యము కానేరదు. మనకు తెలిసిన దానిని తెలియచేయుటకు వేదము అవసరములేదు. మరియు మన బుద్ధితో తెలుసుకొనుటకు వీలయినదానిని తెలియచేయుటకు కూడ వేదము అవసరములేదు. ఆకలి అయితే అన్నము తిను అని వేదము చెప్పనక్కరలేదు. చలివేస్తే బట్ట కప్పుకో అని చెప్పుటకు వేదము అక్కరలేదు. అవి మనకే తెలుసునుగదా. ఇంకను మన బుద్ధిని ఉపయోగించి ప్రత్యక్షముగా కనపడని వస్తువులను తెలుసుకోవచ్చును. దూరంగా ఒక కొండ మీద పొగ కనబడితే ఆ కొండమీద నిప్పు ఉండి తీరవలెను అని మనకు ప్రత్యక్ష ప్రమాణంమీద కనపడని నిప్పును మనము తెలుసుకోవచ్చును. అట్టిదానినికూడ వేదము చెప్పనక్కరలేదు. అలా గైతే, ఎట్టిదానిని చెప్పేది వేదమంటే మనకు ప్రత్యక్ష ప్రమాణంచేత కానీ, బుద్ధిచేత ఊహించే అనుమాన ప్రమాణంచేత కానీ తెలుసుకొనేటందుకు ఎప్పుడూ ఏవిధంగానూ వీలులేని దానిని తెలియచెప్పేదే వేదము. వేదము అను శబ్దానికే ఇంత అర్థ మున్నది. ఇట్లు మనుష్య బుద్ధికిగాని ఇంద్రియములకుగానిఏవిధంగానూ గోచరించనిదానిని వేదము తెలియచేయుచున్నది అని అనుటవల్ల వేదము మనుష్యుడు రచించినది కాదు అని తేలుచున్నది. మనుష్య బుద్ధికి అందని విషయాలను మనుష్యుడు ఎట్లు వ్రాయగలుగును? అందుకనే వేదము అపౌరుషేయము అని వర్ణింప బడినది. అపౌరుషేయ మనగా పురుష కృతము కానిది అని అర్థము. కాళిదాసాదులు రఘువంశాది గ్రంథములను వ్రాసినట్లుగా ఎవరును వేదమును వ్రాయలేదు అని అర్థము.

మనుష్య బుద్ధికి అందనివిన్నీ వేదములో వర్ణింపబడినవిన్నీ విషయాలు ఏవి అంటే - భగవంతుడు ఉన్నాడా లేడా, అంటే భగవంతుని స్వరూప స్వభావము లేమి, సాకారమా నిరాకారమా, సగుణమా నిర్గుణమా, పరిచ్ఛిన్నమా అపరిచ్ఛిన్నమా ఇట్టివి మనకు తెలియనేరవు. ఇంకను ప్రతి మానవునిలోను 'ఆత్మ' అని ఒక చైతన్యం ఉన్నది. ఆ ఆత్మ స్వరూప స్వభావాలు కూడ మనకు తెలియనేరవు. ఆత్మను గురించిన సామాన్యాకారజ్ఞాన మున్నదే కాని విశేషాకార జ్ఞానము మనకు లేదుగదా. మరియు జగత్తు యొక్క స్వరూప స్వభావా లున్నూ మనకు తెలుసుకొనేటందుకు అవకాశం లేదు. ఈ జగత్తు అనేది ఉండి కనపడుచున్నదా, లేకుండా కనబడుచున్నదా; ఎవరైనా సృష్టించినారా, లేక, దానంతట అదే పుట్టిందా, పుట్టితే దేనిలోనుంచి పుట్టింది; ఇట్టి అనేక ప్రశ్నలకు జవాబులు మన బుద్ధికి అందనేరవు. ఇవన్నీ వేదములో వర్ణింపబడినవి. ఇంకను 14 భువనములు ఉన్నవనిన్నీ, ఒక్కొక్క భువనంలో వ్యవహారము ఫలాని విధంగా సాగుచున్న దనిన్నీ శ్రీమూర్తులు ఇంద్రాది దేవతలు ఉన్నారనిన్నీ వారి వారి అధికారాలు ఫలానివి అనిన్నీ, అగ్నికూడ ఒక దేవత అనిన్నీ, ఆ అగ్ని ఇంద్రాది దేవతలకు పురోహితుడు అనిన్నీ, పక్షులకు రాత్రి కాలంలో భూమి నిప్పుగా కనపడు ననిన్నీ, గర్భకోశములో ఉన్న పిండము తన మనస్సులో ఏమని భావించుకునేదిన్నీ, భూశయనం చేసిన తరువాత ప్రాణము పోక పూర్వం ఆ జీవుడు ఏమని భావించుకునేదిన్నీ, ఇట్టి అనేకమైన మన బుద్ధికి అందని విషయాలను వేదము చెప్పుచున్నది. కనుక దానికి వేదము అను పేరు సార్థకమైనదనిన్నీ, వేదము పురుషకృతము కాక అపౌరుషేయ మనిన్నీ స్పష్ట మగుచున్నది.

ఈ వేదమునకే శ్రుతి అని ఇంకొక పేరుఉన్నది. శ్రుతి అనగా వినబడినది అని అర్థము. ఇప్పుడు మన దేశములో వేదము వచ్చినవా రందరు తమ గురువులవద్ద వేదమును చెప్పుకున్నారు. వేదమును చెప్పుకొనుట అంటే గురువు తన నోటితో వేద వాక్యాలను చెప్పుచూఉంటే వాక్యాలను శిష్యుడు తనచెవులతో విని తననోటితో తిరిగి ఉచ్చరించుట. ఇట్లు శిష్యుడు ఆ వేదవాక్యాలను గురువు చెప్పుచుండగా విని గ్రహించినాడు కనుక దీనికి వినబడినది - అనగా శ్రుతి అని పేరు వచ్చినది. ఈ శిష్యునికి చెప్పిన గురువున్నూ తాను పూర్వము శిష్యుడుగా ఉండి విని గ్రహించి యున్నాడు. అటులనే అతని గురువు ఆ గురువుకో గురువు ఇట్లు వెనుకకు పోగాపోగా పూర్వపు మహర్షులవల్ల ఈ వేదము గురుశిష్య పరంపరలో ప్రచారములోనికి వచ్చినట్లు తెలియుచున్నది. ఆ మహర్షులు ఎవరివల్ల విన్నారంటే సృష్టిని చేసిన బ్రహ్మవల్ల విన్నారు. ఆ బ్రహ్మకు ఎవరు బోధించినారంటే పరమేశ్వరుడే బోధించినట్లు తెలియుచున్నది.

'యో బ్రహ్మాణం విదధాతిపూర్వం
యోవై వేదగంశ్చ ప్రహిణోతి తస్మై'

అను మంత్రమువల్ల పరమేశ్వరుడు బ్రహ్మను సృష్టించి ఆ బ్రహ్మకు వేదములను బోధించినాడని స్పష్టమగుచున్నది. అట్లు బ్రహ్మ వేదములను పరమేశ్వరునివల్ల విని ఆ వేదముల ననుసరించి సృష్టిని చేసినా డని వర్ణింపబడినది. దీనినిబట్టి వేదము రచింపబడిన ఒక గ్రంథముకాదని స్పష్ట మగుచున్నది. అది వినబడినదే కాని రచింపబడినది కాదు. ఇట్టి పరిస్థితులలో వేదము ఒక గ్రంథము అని భావించుట పొరబాటు. అది గ్రంథము అని భావించి, ఇతరగ్రంథములకు వలెనే దీనికిన్నీ గ్రంథకర్త ఉండవలె ననిన్ని దానికి ఒకకాలము ఉండవలె ననిన్ని అనుకొని, క్రీస్తుపూర్వం 3,000 సంవత్సరముల క్రిందట మహర్షులు ఈ వేదమును రచించి యుండవచ్చును అను ఆధునికుల వ్రాతలు నిరాధారమనిన్నీ తప్పు అనిన్నీ తేలుచున్నది.

వేదము అపౌరుషేయమనిన్నీ వేదము పరమేశ్వరునివల్ల బ్రహ్మకు ఆరంభములో బోధింపబడినదనిన్నీ పైన చెప్పబడిన విషయములవల్ల తేలుచున్నది. ఇక్కడ ఒక సంశయమునకు అవకాశ మున్నది. అదేమనగా – వేదమును పరమేశ్వరుడు బోధించినాడంటే పరమేశ్వరుడు కూడ ఉత్తముడైన పురుషుడేకనుక వేదము పురుష కృతము, అనగా పౌరుషేయము అనితేలుటచేత వేదము అపౌరుషేయము అను పై వాదమునకు విరుద్ధము కాదా అను సంశయము కలుగుచున్నది. పరమేశ్వరుని స్వరూపమును గురించి సరియైన జ్ఞానము లేనందువల్లను, పరమేశ్వరునికి వేదమునకు ఉన్న సంబంధము తెలియనందువల్లను ఇట్టి సంశయము కలుగుచున్నది. పరమేశ్వరుడుకూడ మనవలెనే కాళ్ళు చేతులు నోరు కండ్లు ముక్కు చెవులు మున్నగు అవయవములు కలవాడు అను భావంమీద పరమేశ్వరుడు కూడ ఒక పురుషుడే అను వాదమునకు అవకాశము కలిగినది. ఇంకను పరమేశ్వరుడు బ్రహ్మకు వేదమును బోధించినాడనుట వల్ల పరమేశ్వరుడు వేదమునకు కర్త అని భావించుటకున్ను అవకాశము కలిగినది. కాని ఈ రెండుభావములు సరియైనవికావు. పరమేశ్వరుడు బ్రహ్మకు వేదమును బోధించినాడనుటవల్ల పరమేశ్వరుడు వేదమునకు కర్త అయ్యుండవలెను అను నియమము లేదు. కర్త కాకుండానే బోధింపవచ్చును.

'అస్యమహతో భూతస్య నిశ్వసితమేతన్ ఋగ్వేదో యజుర్వేద స్సామవేదో థర్వవేదః' అను మంత్రము పరమేశ్వరునికి వేదము నిశ్వాసమువంటిది అని వర్ణించినది. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఎవరికైనను పుట్టుకతోపాటు ఉండేవే కాని పుట్టినతరువాత సంపాదింప బడినవి కాదు కదా. నిశ్వాస లేకుండా పుట్టితే చచ్చినట్లేకాని పుట్టినట్లు కానే కాదు. ఇట్లు మన పుట్టుకతోపాటు వచ్చిన ఉచ్ఛ్వాసనిశ్వాసలకు మనము ఎట్లు కర్తలము కామో, అటులనే పరమేశ్వరుని నిశ్వాసయైన వేదమునకుకూడ పరమేశ్వరుడు కర్త కానేరడు, అభివ్యక్తమాత్రమే. పరమేశ్వరుడు పుట్టుక లేనివాడుకనుక అనాదియైనట్లుగానే ఆయన నిశ్వాసయైన వేదమున్ను అనాదియే. పరమేశ్వరుడు నాశములేని నిత్యుడు కనుక ఆయన నిశ్వాసయైన వేదమున్ను నిత్యమే, దీనినిబట్టి పరమేశ్వరుడుకూడ వేదమునకు కర్త కాడనిన్నీ, అభివ్యక్త మాత్రమే అనిన్నీ స్పష్ట మగుచున్నది. కనుక పరమేశ్వరుడు బ్రహ్మకు వేదమును బోధించినా డని చెప్పినంతమాత్రాన పరమేశ్వరుడు వేదమునకు కర్త అయ్యుండవలెను అనువాదము సరియైనది కాదని తేలుచున్నది. అందుచేతనే వేదము అపౌరుషేయ మనిన్నీ అనాది అనిన్నీ, నిత్యమనిన్నీ వర్ణింపబడినది. 'నకశ్చి ద్వేదకర్తాచ' 'ఈశ్వరస్తస్య వ్యంజక :' ఇత్యాది ప్రమాణాలు పై విషయమును స్పష్టము చేయుచున్నవి. రేడియోలో మనము వినే సంగీతమును ఆ రేడియో పుట్టించలే దనిన్నీ అంతటా నిండియున్న సంగీతాన్నే ఆ రేడియో వ్యక్తం చేసిన దనిన్నీ అందరికీ విశదమే కదా. అలాగే భగవంతుని నిశ్వాసగా వేదము వ్యక్తము చేయబడినదే కాని భగవంతుడు కూడ దానికి కర్త కాడని స్పష్టమగుచున్నది.

వేదము భగవంతుని నిశ్వాస అని చెప్పుటవల్ల ఒకశంక కలుగవచ్చును. మనకు ముక్కు ఉన్నది కనుక మన నిశ్వాస ముక్కు ద్వారా వ్యక్తమగుచున్నది. అటులనే భగవంతునికి కూడ నిశ్వాస వచ్చుటకు ముక్కు మున్నగు అవయవాలు ఉన్నవా అను ప్రశ్నకు అవకాశ మున్నది. కాని భగవంతుని స్వరూపమును గురించి సరియైన జ్ఞానం ఉన్నయెడల ఇట్టి శంక కలుగనేరదు. భగవంతుడు నిరవయవుడు – అనగా అవయములు లేనివాడనిన్నీ అంతట నిండిన అనంత స్వరూపు డనిన్నీ వేదమే వర్ణించుచున్నది. 'ఇందు గల డందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు' అని ప్రహ్లాదుడు కూడా భగవంతుని సర్వవ్యాపకత్వాన్ని విశదీకరించినాడు. అట్టి సర్వవ్యాపకుడైన భగవంతునికి ప్రకృతి లేక మాయ అను ఒక అసాధారణమైన శక్తి ఉన్నది అని 'మాయాంతు ప్రకృతిం విద్వాన్ మాయాంతు మహేశ్వరీ' అను ప్రమాణము స్పష్టము చేయుచున్నది. సూర్యుని కంటె సూర్యుని వెలుతురు అన్యము కానట్లును, అగ్ని కంటె ఉష్ణత్వము అన్యము కానట్లును భగవంతుని కంటె ఆ శక్తి అన్యము కాదు. అందుచేత అద్వైత భావానికి భంగములేదు. ఆ శక్తియే అర్థరూపంగా ప్రపంచంగానూ, శబ్దరూపంగా వేదముగానూ వ్యక్తమైనది. దీనినిబట్టి భగవంతుడే తన శక్తిద్వారా వేదరూపమును ధరించినా డని తేలుచున్నది. అనగా శబ్దరూప భగవంతుడే వేదము అని స్పష్టము. భగవంతుడు సర్వవ్యాపకుడు కనుక వేదము కూడ సర్వవ్యాపక మనిన్నీ తేలుచున్నది. వేదము అంతటా నిండి ఉంటే మనకు వినబడదేమి అని ప్రశ్న పుట్టవచ్చును. సంగీతం అంతటా నిండి ఉన్ననూ రేడియో లేనిదే మనకు వినబడుచున్నదా! మనకు

వినబడనంత మాత్రాన సంగీతం గాలిలో అంతటా లేదంటామా ! అంతటా సంగీతం నిండిఉన్ననూ దానిని వ్యక్తం చేసే రేడియో ఉంటేనే అది వ్యక్తమైనట్లు వేదము అంతటా నిండియున్ననూ దానిని వ్యక్తంచేసే పనిముట్టు లేదుకనుక వ్యక్తం కావటం లేదు. అట్టి పనిముట్టు మన శిరస్సులోనే ఉన్నది. యోగాభ్యాసం చేతకాని తపస్సు చేతకాని మన శిరస్సులో ఉన్న ఆ పనిముట్టును అమలులోనికి పెట్టుకోవచ్చును. అది అమలులోనికి రాగానే వేదం వినబడుతుంది. మాహర్షులు అట్టి రేడియోను యోగతపస్సుల చేత తమ శిరస్సులో తయారు చేసికొన్నారు కనుక వారికి వేదము లన్నియు వినబడినవి. 'యుగాంతేంతర్హితాన్ వేదాన్ సీతిహాసాన్ మహర్షయః లేభిరే తపసా పూర్వం' అని వ్యాసభగవానుడు మహాభారతంలో ఈ భావమునే వ్యక్తం చేసినాడు. ఇంకను వేదము గాలిలో అంతటా నిండిఉన్నది కనుకనే జ్ఞానదేవుడు ఒక దున్నపోతు నెత్తిమీద తనచేతిని పెట్టి దాని శిరస్సులో తన యోగశక్తిపాతంచేత అట్టి రేడియోను తయారు చేయగా ఆ దున్నపోతు వేదమును చెప్పిన దని జ్ఞానదేవుని చరిత్రవల్ల తెలియుచున్నది. ఏ దేశపు సంగీతాన్ని వినాలంటే, ఆ దేశపు Wave length కు రేడియోలో tune up చేసినట్లు, వేదం యొక్క wave length కు మన మన మనస్సు యోగంచేతకాని తపస్సుచేతకాని tune up చేస్తే వేదము వినబడుతుంది. అలా చేసికోలేనివారు గురువుగారి వద్ద నేర్చుకోవలసి యున్నది.

ఇట్లు శ్రుతి ప్రమాణం చేతను, యుక్తి వల్లను, అనుభవం వల్లను కూడ వేదము అపౌరుషేయ మని, అనాది యని, నిత్యమని, అందుచేతనే స్వతః ప్రమాణ మని స్పష్టమగుచున్నది.

ఇంకను పాశ్చాత్య విమర్శనా పద్ధతుల ననుసరించి చూచినను వేదము అపౌరుషేయము, అనాది, నిత్యము అనియే తేలును. పాశ్చాత్య విమర్శనా పద్ధతుల ప్రకారము దేనికైనను కాలమును నిర్ణయించవలె ననిన, ఆ గ్రంథాంతర్గతమైన సాక్ష్యము (internal evidence) బట్టిన్ని ఆ గ్రంథ బహిర్భూతమైన గ్రంథముల సాక్ష్యము (external evidence) బట్టిన్ని నిర్ధారణ చేయవలెను. అట్లు చూచినను వేదములోని వాక్యములు వేదములు పరమేశ్వరుని నిశ్వాస అని పైన తెలియచేసిన ప్రకారం వర్ణించుట వల్లనూ వేదమునకు బహిర్భూతమైన మన్వాది స్మృతులు, సూత్రములు, పురాణములు 'అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా' 'నకశ్చిద్వేద కీర్తాచ' 'ఈశ్వరస్తస్యవ్యంజకః సకర్తా' అని ఈ విధముగా వర్ణించుట చేతనూ వేదము అపౌరుషేయము, అనాది, నిత్యము అని స్పష్టమగుచున్నది.

నిర్దుష్టమైన ఇట్టి అనేక ప్రమాణముల వల్ల వేదము అపౌరుషేయము అనాది అని నిర్ధారిత మగుచుండగాను, వ్యాస, శంకర, రామానుజ, మధ్వ, విద్యారణ్యాది ఆచార్య మహాపురుషు లందరు ఏకగ్రీవంగా వేదముయొక్క అనాదిత్వ అపౌరుషేయత్వములను ఉద్ఘోషించి యుండగను, దీని నంతను త్రోసిపుచ్చి, మన వైదిక విజ్ఞాన సాంప్రదాయములను ఎరుగని ఎవరో కొందరు పాశ్చాత్యులు వేదములు సుమారు 3000 బి. సి. లో మహర్షులవల్ల రచింపబడి యుండవచ్చును అను నిరాధారమైన ఊహాగానమును మన భారతీయులు కూడ విశ్వసించుట కడుంగడు శోచనీయము కాదా.

ఇంకను వేదములో మంత్ర భాగము, బ్రాహ్మణ భాగము అని ప్రధానముగా రెండు విభాగములు కలవు. 'మంత్ర బ్రాహ్మణ యోర్వేద నామధేయం' అని ప్రమాణము. బ్రాహ్మణ భాగములో ఆరణ్యకములు ఉపనిషత్తులు అను రెండు భాగములు కలవు. అవన్నియు కలసియే వేదము. ఆరంభములో ఋగ్యజుస్సామాధర్వములను నాలుగు వేదములును కలసి ఒకే వేదరాశిగా నున్నదనిన్ని అట్టి బ్రహ్మాండమైన వేదరాశిని కంఠస్థము చేయుట అంతకంతకు కష్టము కాగా, వ్యాసులవారు ఆ వేదరాశిని ఋగ్యజుస్సామాధర్వములుగా నాలుగు భాగములుగా విభజించినా రనిన్ని అట్టి విభజనను గావించినందున 'వేదవ్యాసః' (వ్యస్ to divide—వేదమును విభాగించినవారు) అను బిరుదము వారికి వచ్చిన దనిన్ని మన గ్రంథములు తెలియచేయుచున్నవి. ఇంకను వేదములను ఇట్లు నాలుగు విభాగములు చేసి వ్యాసులవారు తన పైల శైలిని వైశంపాయనాది నలుగురు శిష్యులకు నాలుగు వేదములను బోధచేయగా, ఆ పరంపరలో ఆ నాలుగు వేదముల ప్రచారము నేటికిని మన భరత ఖండములో విరాజిల్లుచున్నది.

ఇట్టి ప్రమాణ భూతమైన నిర్దుష్ట సాక్ష్యమును త్రోసిపుచ్చి పాశ్చాత్యుల ఊహాగానము ననుసరించి మన భారతీయులలో ప్రముఖ స్థానము నలంకరించుచున్నవారు కూడ నాలుగు వేదములు ఒకేసారి పుట్టలే దనిన్ని ముందు ఋగ్వేదము పుట్టిన దనిన్ని ఆ తరువాత కొంత కాలమునకు క్రమేణ మిగతా వేదములు పుట్టిన వనిన్ని, ఆ వేదములో కూడ ముందు మంత్రభాగము 3000 బి. సి. లో పుట్టిన దనిన్ని ఆ తరువాత కొంత కాలములకు బ్రాహ్మణభాగము, దానిలో ఆరణ్యకములు పుట్టినవనిన్ని ఆ తరువాత సుమారు 1500 బి. సి. లో ఉపనిషత్తులు పుట్టిన వనిన్ని, ఉపనిషత్తులు మిగతా భాగములమీద తిరుగుబాటుగా రచింపబడిన వనిన్ని ఈ మొదలగు వ్రాతలు కేవలం నిరాధారములగుటయే గాక నిర్దుష్టమైన గ్రంథ ప్రమాణములకు విరుద్ధములున్నూ, అసత్యములున్నూ అని స్పష్ట మగుచున్నది. కనుక అట్టివారి వ్రాతలను బుద్ధిమంతులైనవారు విశ్వసింపకూడదు అని వేరుగ చెప్పనక్కర లేదు.



# మహాసతి సుకన్య

— పురాణపండ రాధాకృష్ణమూర్తి

శర్యాతిమహారాజు మృగయా వినోదార్థం అరణ్యానికి వచ్చి విహరిస్తూ చ్యవనమహర్షి ఆశ్రమానికి విచ్చేశాడు. అక్కడే గుడారాలు వేయించాడు. మునిచంద్రులను దర్శించి రాజధానికి మరలి పోవాలని భావించాడు. కాని అకస్మాత్తుగా సైనికు లందరి ఉదరాలలోనూ చెప్పలేని బాధ బయలుదేరింది. వారు తమకు సంభవించిన బాధను మహారాజుకు విన్నవించుకొన్నారు. ఆ బాధను ఆలకించే మహారాజుకుకూడా అదే బాధ ఆరంభమయింది. వారందరితోబాటు అశ్వాలు కూడా నేలమీదపడి విలవిలలాడసాగాయి. ఇలా హఠాత్తుగా అందరికీ సంభవించిన బాధకు కారణ మేమిటో తెలుసుకోవాలని మహారాజు బయలుదేరాడు.

నాన్నగారూ! యీ అపరాధం నావల్ల జరిగినదో లేదో నేను ఎరుగను కాని నావల్ల ఒక పొరబాటు మాత్రం జరిగిపోయింది తండ్రీ! నా చెలికత్తెలతో నేను విహారార్థం అరణ్యంలోకి వెళ్ళాను. ఒక చెట్టుక్రింద ఎత్తైన మట్టిపుట్ట ఉంది. దానికి రెండేరెండు రంధ్రా లున్నాయి. వాటినుండి యేదో చక్కటి కాంతి వస్తూ ఉంది. ప్రకాశవంతములైన ఆ వస్తువులను బయటకు తీయాలని నాకు కోరిక కలిగింది. ఒక ముల్లుతో వాటిని పొడిచానో లేదో ఆ రంధ్రాలనుండి రెండు మూడు రక్తబిందువులు నేలమీద పడ్డాయి. నేను మరలి వచ్చేశాను. కాని నా హృదయం యేదో తెలియని బాధతో దడదడలాడుతునే ఉంది-అంటూ శర్యాతి మహారాజుయొక్క ఏకైక సుకుమారకుమారి సుకన్య పలికింది.

కొన్ని క్షణాలపాటు అందరూ స్తబ్ధులై పోయారు. "ఎంతపని జరిగిందీ?" అంటూ మహారాజు దీర్ఘంగా నిట్టూర్చాడు. మంత్రులు మహారాజు అడుగులో అడుగు వేశారు.

కఠోర తపస్సంలగ్నుడైన చ్యవన మహర్షి చుట్టూ చెదలు పుట్టలు వేశాయి. ఆ పుట్టమట్టి గట్టిపడిపోయింది. ఇప్పుడాయన మట్టిపుట్టలామాత్రం కనిపిస్తున్నాడు. ఆ స్థితిని అనుచరసమేతంగా మహారాజు అవలోకించాడు. తన కుమార్తె అజ్ఞానంవల్ల జరిగిన అపరాధాన్ని క్షమించమని అతిదీనుడై అర్థించాడు.

"రాజా! నీ కుమారి నన్ను అంధుణ్ణి చేసింది. కంటిమంట కారణంగా నా ధ్యానావస్థ భగ్నమయిపోయింది. నిత్య నైమిత్తిక కృత్యాలు చేసుకోవాలికదా! అన్యసహాయం లేకుండా అందుడు జీవయాత్ర సాగించడ మెలా ప్రభూ!" అని మహర్షి బాధతోనే ప్రశ్నించాడు. తాను సేవకు లెందరినో సహకారంగా నియమిస్తానని మహారాజు సహానుభూతిని ప్రకటించగా మునీశ్వరుడు పలికాడు—

"రాజా! 'సేవ' అనేది శ్రద్ధాభయలోభాదులవల్ల జరిగేదికాదు. ఆవేశం అంతరించిన అనతికాలానికే సేవ చేయడంలో బాధ కలుగుతుంది. అంధునికి జీవితాంతం సేవ చేయాలికదా! అట్టి స్థితిలో ఎవరి కయినాసరే ఉపేక్షాభావమూ, అసహ్యమూ కలుగక, మానవసేవ అనేది కేవలం మమత్వంవల్ల కలుగవలసింది. కనుక భూపాలా! నన్ను గ్రుడ్డివాణ్ణిగా చేసిన నీ పుత్రికను నా కర్పించు. ఆమెయే నాకు యోగ్యమయిన సేవ చేయగలుగుతుంది."

ఎంత దారుణం? క్రోధావతారమూర్తి యైన వృద్ధతపస్వికి శిరీషకుసుమ సదృశ కోమలాంగి యైన తన సుకుమార కుమారిని అర్పించడమా! మహారాజు అనిర్వచనీయమైన వేదనతో మౌనం వహించాడు. కాని సుకన్య తీవ్రంగా ఆలోచిస్తూఉంది. మిగిలిన పరివారమంతా ఏదో తెలియనిబాధతో భవిష్యత్తును ఊహించలేక వేదన చెందుతున్నారు. తాను చేసిన పాపానికి శిక్ష తానే అనుభవించడం మంచిదని సుకన్య నిశ్చయించుకుంది.

"తండ్రీ! మునీశ్వరులు నన్ను కోరారు. నేను ఆయన సేవకు సంసిద్ధంగా ఉన్నాను. ఆర్యనారి జీవితంలో ఒక్కసారి మాత్రమే ఆత్మదానం చేసుకోగలుగుతుంది" — అని

సుకన్య పలుకగా శర్యాతిరాజు శిలా మూర్తిలా నిలబడిపోయాడు. ఆ రాజ నందినిని అందరూ ప్రశంసించారు. ఇక మహారాజు మునీశ్వరులకు కన్యాదానం చేయడం మాత్రమే మిగిలిఉంది.

"మునిశేఖరా! మీ చరణదాసిగా ఉండ సంసిద్ధురాలయిన నా పుత్రిని ఆనందంగా స్వీకరించండి" — అంటూ మహారాజు మునిచంద్రుని అర్థించిన ఉత్తరక్షణంలో మహర్షి మహదానంద పరవశు డయ్యాడు. దానితో అందరి శారీరక బాధ మాయమై పోయింది.

శర్యాతి మహీపాలుడు మహర్షి దగ్గర శలవు తీసుకొన్నాడు. గద్గద కంఠంతో ప్రియపుత్రిని గాఢాలింగనం చేసుకొన్నాడు. ప్రాణసఖులు అశ్రుపూర్ణ నేత్రాలతో తమ సఖిని కౌగిలించుకున్నారు. కొన్ని క్షణాలలోనే అక్కడ నుంచి అందరూ వెళ్ళిపోయారు.

'నాకు యీ కౌశేయాంబర ఆభరణాలతో పనిలేదు. తాపసపత్నికి యివి శోభను కలుగజెయ్యజాలవు' అనుకుంటూ రాకుమారి సుకన్య సుందరాంబరాలనూ ఆభరణాలనూ పరిత్యజించి నారచీరలను ధరించింది. నిరాడంబర ప్రశాంత భావాలనూ ఆత్మసంతృప్తినీ కలుగజేసుకుంది. మహర్షి నున్న మట్టిని జాగ్రత్తగా తొలగించి దానినుండి ఆయనను బయటకు తీసింది. నదికిపోయి శుభ్రజలాలు తెచ్చి స్నానం చేయించింది. దర్భలూ, సమిధలూ, కందమూలాలూ పవిత్రజలాది ఆవశ్యకవస్తువులూ తీసుకురావడం, ఆశ్రమాన్ని పరిశుభ్రంగా ఉంచడం, అగ్నిని ప్రజ్వరిలజేసి హవిస్సును సిద్ధంచేయడం, పతిదేవుని సమస్త కార్యాలను దత్త చిత్తంతో నెరవేర్చడం ఆమెకు నిత్య కృత్యాలై పోయాయి. అనతికాలంలోనే తన గత జీవితాన్ని విస్మరించింది. శరీరం దుర్బల మయ్యే కొద్దీ శారీరక కాంతి ద్విగుణీ కృత మవుతూంది. సుందర సువిశాల కేశపాశం జట లల్లుకోసాగింది. కోమలకరాలు కాయలు కాసిపోయాయి. ఆ మహాసతి ఎట్టి పరిస్థితిలోనూకూడా తన ధర్మకర్తవ్యమయిన పతిసేవలో అసంతృప్తిని కానీ ప్రమాదాన్ని కానీ ప్రకటించలేదు.

* * *

"సుందరాంగీ! నువ్వు ఎవ్వరిదానవు? ఏకాకివై చరించుచుంటి వేల?" అంటూనే నదిలో స్నానం చేస్తూన్న సౌందర్యరాశి యగు సుకన్యను గగనవిహారం చేస్తూ చూసిన అమరవైద్యులు అశ్వినీకుమారులు ప్రశ్నిస్తూ క్రిందకు దిగారు.

సంయమత్వ, పతిసేవ తపస్సులు కారణంగా ఆమె సహజ సౌందర్య లావణ్యాలతో ద్విగుణీకృత కాంతిరేఖలు మంద స్మితం చేస్తున్నాయి.

అశ్వినీ దేవతలప్రశ్నకు సుకన్య లజ్జావనత వదనయై వారికి నమస్కరిస్తూ— "మహాపురుషులారా! నేను చ్యవన మునీంద్రుల ధర్మపత్నిని; స్నానకార్యం పూర్తి చేసుకొని పతిదేవులకు నదీజలాలు తీసుకొని పోవచ్చాను. దయచేసి మీరు మీ పరిచయాన్ని తెలియజేయండి. ఆశ్రమానికి విచ్చేసి మునీంద్రుల ఆతిథ్యాన్ని స్వీకరింతురుగాక!"

అనన్య కన్యా సామాన్య లావణ్య లహరియైన సుకన్య దివ్యసౌందర్యానికి ముగ్ధులై అశ్వినీకుమారులు పలికారు :— "సుందరీ! నీ యౌవ్వన సౌందర్యాలెక్కడ? నీవు ఆ ముదుసలికి భార్యవు కావడ మేమిటి? నారీమణీ! అమరవైద్యుల మయిన మేము అశ్వినీకుమారుల మని ప్రఖ్యాతి చెందాము."

పతినిందను వినలేక సుకన్య వారికి మరల నమస్కరిస్తూ చ్యవన మునీంద్రులు నాకు పూజ్యనీయులు, ప్రభువులు. దయ చేసి మీరు వారికి అగౌరవప్రద మయిన పలుకులు పలుకకుందురుగాక!" అని ప్రార్థించింది.

పొరబాటున ఏ మాటయినా వస్తే సాధ్వీ శాపంనుండి సంరక్షించేవారు లేరని అమరవైద్యులు భావిస్తూ- "మేము మహర్షి అతిథ్యాన్ని స్వీకరించాము" అన్నారు. అనంతరం సుకన్య ముందు నడువ అశ్వినీకుమారులు ఆమెను అనుసరించారు. కొన్ని క్షణాలలో వారు ఆశ్రమంలో అడుగు పెట్టారు. అడుగు పెడుతూనే అశ్వినేయులు చ్యవనమునీంద్రుల నుద్దేశించి "మునీంద్రోత్తమా! దేవభిషజుల మయిన మేము మీ తపస్సుకు పరమ ప్రసన్నుల మయాము. మీరు యిచ్చాను సారమయిన వరాన్ని కోరుకొందురుగాక! అన్నారు.

సుకన్య సేవలకు సంతృప్తు డయిన మహర్షి ఆమె ఆనందార్థం-"అమరవైద్యులారా! మీకు శుభం కలుగుగాక! యవ్వనాంగి హృదయాకర్షకమయిన సుందర మనోహర రూపాన్నీ, నేత్రదృష్టినీ ప్రసాదించెదరుగాక!" — అని వరాన్ని కోరగా "తథాస్తు!" అంటూనే అమరవైద్యులు మహర్షి హస్తాన్ని పట్టుకొని సమీపంలో ఉన్న సరోవరానికి తీసుకువెళ్లారు. వారి ఆలోచన ఏమిటో తెలియదు; సరోవరంలో దిగి మునితోసహా మునిగిలేచారు. ఆశ్చర్యం! ఆ జలాలనుండి ఒకే వయో రూపాలు కల ముగ్గురు పురుషులు పైకి లేచారు, అందులో తన భర్తను గుర్తించ

లేక సుకన్య గాబరా పడుతూంటే — సాధ్వీ ! మాలో ఒకరిని స్వీకరించు – అని వారు ఏకగ్రీవంగా పలికారు.

"చ్యవన మహాత్ముని ధర్మపత్నినైన నేను జన్మజన్మాలకూ ఆయనకే దాసిగా ఉండగోరుతున్నాను. నిర్మలాంతఃకరణంతో నేను పతిసేవ చేసినట్లయితే అశ్వినేయులు ప్రసన్నులై నా పతిని నాకు ప్రసాదించెదరుగాక !" అంటూ సుకన్య చేతులు జోడించి పలుకగా అశ్వినీకుమారు లానందించి "మహాసతీ! వారే నీ పతిదేవులు"- అంటూ దివ్య వినూత్న దేహకాంతులతో విరాజిల్లే చ్యవనమహర్షిని చూపారు.

"వైద్యులయిన కారణంగా ఇంతవరకూ సోమభాగాన్ని పొందలేని అశ్వినీకుమారులారా! మీరొనర్చిన ఉపకారానికి ప్రత్యుపకారంగా నేను మీకు కృతజ్ఞుడనై యజ్ఞంలో సోమభాగం యిప్పిస్తాను." అని చ్యవనమహర్షి పలుకగా పరమానందంతో అమరవైద్యులు అంతర్ధానమైపోయారు. సుకన్య నాటినుండి శతకోటి మన్మథాకారుడయిన పతిదేవునితో మహదానందంగా జీవయాత్ర గడుపుతూంది.

శర్యాతి రాజర్షికి అశ్వమేధయాగం చెయ్యాలని కోరిక కలుగగా అల్లుడయిన చ్యవన మహర్షిని ఆహ్వానించాడు. మహర్షి సతీసమేతంగా తపోవనంనుండి వచ్చాడు. వయోవృద్ధుడయిన మహర్షికి బదులుగా తన కుమార్తెతో నవయౌవన తేజోవిలాసుడయిన పురుషుడు ఉండడం చూసి తన కుమారి దుర్మార్గగామిని అయిందని భావించాడు. క్రోధంతో కంపించిపోయాడు. ఆదరంగా తండ్రికి నమస్కరించా లని సుకన్య ముందుకు వంగగా ఆమెను ఆశీర్వదించటానికి బదులు నిందిస్తూ "కులటా ! ఉత్తమ కులంలో జన్మించికూడా నీవు పతి పితృ కులాల్ని రెండింటినీ నరకంలో పడేశావు. అత్యంత పవిత్రంగా ఉంచవలసిన బుద్ధిని చలింపజేసి సిగ్గులేకుండా లోకపూజ్యుడై వయోవృద్ధుడైన మునీశ్వరుని త్యజించి యీ జారునితో సుఖభోగ్యాల ననుభవిస్తున్నావా!" అన్నాడు.

జరిగిన వృత్తాంతాన్ని చెప్పవలసిందని సుకన్య మందస్మితం చేస్తూ మహర్షికేసి చూసింది. మహర్షి చిరునవ్వు నవ్వాడు. అపార యోగప్రభావం గల మహర్షుల ప్రభావాన్ని యెరిగిన మహీపాలుడు మరుక్షణంలో తన పొరబాటును గుర్తించి మునీంద్రులకు వందన మాచరించాడు. ఈ పరిణామానికి కారణం తెలియజెప్ప మని అర్థించాడు. ఆ మునిచంద్రుడు యావద్వృత్తాంతాన్నీ వినిపించగా మహారాజు ఆనందం అపార పారావారసదృశ్యమయింది. పుత్రిని ఒడిలో కూర్చోబెట్టుకుని ప్రియమార ఆమె శిరస్సు నిమురుతూ ఆనంద బాష్పాలు రాల్చాడు.

చ్యవన మునిచంద్రుల ఆధ్వర్యాన యాగ మారంభమయింది. సోమభాగాన్ని స్వీకరించ మహర్షి అశ్వినీకుమారులను ఆహ్వానించాడు. అది తెలిసిన మహేంద్రుడు క్రోధంతో మహర్షిని సంహరించాలని వజ్రం ఎత్తాడు. "వజ్రంతో నీ హస్తం స్థంభించి పోవుగాక !" అంటూ మహర్షి బాహుస్తంభన మంత్రాన్ని పఠించాడు. దేవేంద్రుడు తన హస్తాన్ని ఉపయోగించుకోలేకపోయాడు. వివశుడై అశ్వినేయులను సోమభాగ స్వీకారులనుగా అంగీకరించాడు. అందరూ ఆనందించారు.




# ఏటా నూరు కోట్ల సిగరెట్ ప్యాకెట్లు — అంతకు పది రెట్ల ఆనందం...

ప్రతి నెలా తొంబై కోట్ల చార్మినార్ సిగరెట్లు కాలుస్తున్నారు—అమ్మిన ప్రతి నాలుగు సిగరెట్లలోనూ ఒక చార్మినార్ వుంటూ వుంది. ఇండియాలో బహుజనాదరణ పొందిన సిగరెట్ చార్మినార్! ఇతర సిగరెట్లలో లేని విశేషం చార్మినార్లో యేముందంటే— ప్రత్యేకమైన పదార్థముల నుండి, ప్రత్యేకమైన పద్ధతుల వలన కల్గిన అధికమైన సువాసన, అసమానమైన రుచిన్నీ— వజీరు సుల్తాను టుబాకో కంపెనీలో తయారవుతున్నది.

చార్మినార్ కోసం ప్రత్యేకంగా పండించిన మేలురకమైన పొగాకును నిపుణులు యెంచుకొనెదరు. ముమ్మారు శుద్ధి చేయుదురు. అతినైపుణ్యముతో మిశ్రమం చేసెదరు. తరువాత మళ్లీ చార్మినార్‌కి ప్రత్యేకమైన యింకొక వడపోత. ఆగ్నేయాసియాలో చాలా పెద్దదైన సిగరెట్ ఫేక్టరీలో ఆటోమేటిక్ యంత్రాలు ఆ పొగాకును తీసుకొని లక్షల కొలది సిగరెట్లను తయారు జేయును. నూరు కోట్ల ప్యాకెట్లు—వీటి వలన మనకు లభించేదేమి? మంచి సిగరెట్లు త్రాగేమన్న ఆనందమే!
చార్మినార్‌తో సమానమైన సిగరెట్ వేరొకటి లేదు—ఇండియాలో గొప్ప సిగరెట్ చార్మినార్.




ది వజీరు సుల్తాను టుబాకో కంపెనీ లిమిటెడ్

భారత దేశమందు ఘనత వహించిన సిగరెట్ నిర్మాతలు!

CAS/VS-1-TEL

# మమ్మటుని కావ్యప్రకాశము

జూలూరి హనుమంతరావు

కావ్య సౌందర్య పరీక్షచేయు శాస్త్రమునకు , కావ్యశాస్త్ర మనిపేరు. కావ్యశాస్త్రమునకు సంబంధించిన ప్రారంభిక కాలమందు కావ్యాలంకార మనియే ఆచార్యు లందఱు తమ గ్రంథములకు నామకరణము చేసినారు. భామహుని కావ్యాలంకారము, ఉద్భటుని కావ్యాలంకార సారసంగ్రహము, రుద్రటుని కావ్యాలంకారము, వామనుని కావ్యాలంకార సూత్రము మున్నగునవి ఇందుల కుదాహరణములు. ఇందలి అలంకార శబ్దమునకు సౌందర్యార్థమే బోధక మగుచున్నది. వామనుడు "సౌందర్య అలంకారః" అను సూత్రమును రచించి అలంకార శబ్దమునకు సౌందర్యార్థమును ప్రతిపాదించినాడు. కొందఱు ఆచార్యులు "కావ్యశోభాకరాన్ ధర్మాన్ అలంకారాన్ ప్రచక్షతే" అని కావ్యసౌందర్యాధాయక మగు ధర్మములు అలంకారములని ప్రవచించినారు. ఈ కావ్యాలంకారములందు అలంకారవర్ణనమాత్రమే కాక కావ్య సౌందర్యాపాదకములగు గుణములు, దోషములు, రీతులుకూడ ప్రతిపాదింపబడినవి. ఈ విధముగా కావ్యసౌందర్య ప్రతిపాదనము సేయు శాస్త్రమును 'కావ్యాలంకార' మనుట ఉచితముగనే యున్నది.

కాలము గడచినకొలది 'కావ్యాలంకారము'నకు బదులు 'అలంకారశాస్త్రము' అనియే ప్రయోగము కానవచ్చుచున్నది. "యద్యపి రసాలంకారాద్యనేకవిషయమిదం శాస్త్రం తథాపి ఛత్రిన్యాయేన అలంకారశాస్త్ర ముచ్యతే" అని ప్రతాపరుద్రీయమునకు శ్రీ కుమారస్వామి సోమపథీ విరచిత రత్నాపణ టీకయందు చెప్పబడినది. అనగా ఈ శాస్త్రము రసములు, గుణములు, దోషములు, అలంకారములు మున్నగు అనేక విషయములను వివేచనచేయుచున్నను ఛత్రిన్యాయముచే కేవలము అలంకారశాస్త్ర మనియే చెప్పబడుచున్నదని దీని తాత్పర్యము.

మొదట ఈ శాస్త్రము 'కావ్యాలంకార' మనియే ప్రయోగింప బడినదికాని 'కావ్యశాస్త్ర' మని ప్రయోగింపబడలేదు. ఈ శాస్త్రముయొక్క వికాసము హెచ్చుచున్నకొలది, దీని మహత్త్వము వృద్ధి యగుచున్నకొలది, కావ్యశబ్దమునకు తోడుగా శాస్త్రశబ్దము ప్రయోగింపబడి కావ్యశాస్త్ర మైనది. పదియొకటవ శతాబ్దమందు సరస్వతీకంఠాభరణ కర్తయగు భోజదేవుడు మొదటిసారిగా కావ్యశాస్త్ర పద ప్రయోగమొనర్చినాడు. "కావ్యం శాస్త్రేతిహాసీచ కావ్యశాస్త్రం తథైవచ కావ్యేతిహాసః శాస్త్రేతి హాస స్తదపి షడ్విధం" అని 'శాసనాత్ శాస్త్రం' – శాసించుటవలన శాస్త్రమైనది. వేద స్మృత్యాదులు మానవులకు సత్కర్మలయందు ప్రవృత్తులగుటకు, అసత్కారములందు నివృత్తులగుటకు ఆదేశించుచున్నవి. అనగా ప్రవృత్తి నివృత్తులుగా నొనరించు గ్రంథములు శాస్త్రము లనబడుచున్నవి. కాని కావ్యముయొక్క ముఖ్యప్రయోజనము ప్రవృత్తి నివృత్తులుకాదు రసాస్వాదనము లేక 'సద్యః పరనిర్వృతి' మాత్రమే యగును. 'కాంతాసమ్మితతయోపదేశయుజే' – ఏది కర్తవ్యమో, ఏది కర్తవ్యముకాదో దానిని ఉపదేశించుటయే కావ్యముయొక్క గౌణ ప్రయోజన మగుచున్నది. కావునకావ్యశాస్త్రమందలి శాస్త్రశబ్దము 'శాసనాత్ శాస్త్రం' అను వ్యుత్పత్తిచే చెప్పబడలేదు.

కావ్యాలంకారము, కావ్య శాస్త్రములకు తోడుగా మఱియొక్క శబ్దము వినవచ్చుచున్నది. అది 'సాహిత్య' శబ్దము. ఈ సాహిత్యశబ్దము నవీన కాలమునందును ఎక్కువగా ప్రచలిత మగుచున్నది. ఈ సాహిత్యశబ్ద ప్రయోక్త 'సాహిత్యదర్పణ' కర్తయగు విశ్వనాథుడని చెప్పుదురు. కాని అతనికన్న ముందువాడగు భామహుడు తన కావ్యాలంకారమందు "శబ్దార్థౌ సహితౌ కావ్యం" అనినాడుకదా. అనగా 'శబ్దముయొక్కయు, అర్థముయొక్కయు 'సాహిత్యమే కావ్య మగుచున్నది' – అని. శబ్దార్థముల సాహిత్యమును విశదపఱచుచు వక్రోక్తి జీవితకారుడగు కుంతకుడు "సాహిత్య మనయోః శోభాశాలితాం ప్రతి కావ్యసీ అన్యూనానతిరిక్తత్వ మనోహారిణ్యవస్థితిః" అని చెప్పినాడు. కావ్యమునందు ఎంతటి సుందరమగు అర్థము వర్ణిత మగుచున్నదో, అంతటి సుందరములగు శబ్దముల సన్నివేశ ముండవలెను. ఇట్టి శబ్దార్థముల రెంటియొక్క ఐక్యతతో కలిగిన మనోహర మగు స్థితి సాహిత్య మనబడును' అని దీని భావము. ఇట్లు భామహుడు, కుంతకుడు, శబ్దార్థముల సాహిత్యము నాధారముగా గొని తమ కావ్యలక్షణముల నొనర్చినారు. దీని యాధారముచేతనే కావ్యశాస్త్రమునకు సాహిత్యశాస్త్ర మను ప్రయోగము కలిగినది.

కావ్యశాస్త్ర పరిణామదశకు ఈ క్రింది విధముగా కాలవిభాగము చేయవచ్చును.

(క) ప్రారంభకాలము : అజ్ఞాత కాలము నుండి భామహునివఱకు.

(ఖ) రచనాత్మకకాలము. భామహునినుండి ఆనందవర్ధనాచార్యుల వఱకు.

(గ) నిర్ణయాత్మకకాలము : ఆనందవర్ధనాచార్యులనుండి మమ్మటునివఱకు.

(ఘ) వ్యాఖ్యాకాలము : మమ్మటుని నుండి విశ్వేశ్వరభట్టు వఱకు.

ప్రారంభకాలమునందలివారిలో మొదటివాడు భరతుడు. ఈతని 'నాట్యశాస్త్రమే' మొదటి సాహిత్యశాస్త్రగ్రంథ మని చెప్పవచ్చును. ఇందు పదునారవ అధ్యాయమందు అలంకార గుణదోషముల వివేచనము సేయబడినది. అలంకారశాస్త్ర దృష్టియందు ఈ వివేచనము అత్యంత స్వల్పమే యగుచున్నది. భరతుని తర్వాత మేధావి, రుద్రుడు మున్నగువా రున్నట్లు తెలియుచున్నది కాని వారిగ్రంథము లుపలబ్ధము లగుటలేదు. తదుపరి కావ్యాలంకార గ్రంథకర్తయగు భామహుడుముఖ్యుడు. భరతుడు చెప్పిన నాలుగు అలంకారముల స్థానములో నీతడు ముప్పదియెనిమిది స్వతంత్రములగు అలంకారములను వివేచనము సేసినాడు.

రచనాత్మక కాలమందు సాహిత్యశాస్త్రమునందు నాలుగు సంప్రదాయము లేర్పడినవి. అవి అలంకార సంప్రదాయము, రీతి సంప్రదాయము, రససంప్రదాయము, ధ్వని సంప్రదాయము. అలంకార సంప్రదాయమునకు మొదటి ప్రవర్తకుడు భామహుడు. కావ్యమునకు ప్రాణభూతము, జీవనాధాయకము నగునది అలంకారమే యనియు, అలంకార రహితమగు కావ్యకల్పనము ఉష్ణతా రహితమగు అగ్నికల్పనము వంటి దనియు అలంకార సంప్రదాయము. ఈ సంప్రదాయానుసారులలో ఉద్భటుడు, రుద్రటుడు ప్రతీహారేందురాజు, జయదేవుడు మున్నగువారిని చెప్పవచ్చును. "కావ్యమునకు రీతి ఆత్మ" యని రీతి సంప్రదాయమునకు ప్రముఖ సిద్ధాంతము. రీతి యనగా విశిష్టపద రచనయే యనియు మాధుర్యాది గుణముల సమావేశమే విశిష్టత యనియు క్రమముగా వివేచనము చేయబడినది. ఇట్లు గుణము, రీతి — ఈ రెండింటికి అత్యంత సంబంధ ముండుటవలన ఈ సంప్రదాయమును 'గుణసంప్రదాయ' మనియు పిలుతురు. ఈ రీతి సంప్రదాయ సంస్థాపకుడు వామనుడు. ఈ సంప్రదాయమందు కావ్యములో అలంకారమునకు గల ప్రధానతా స్థానమునందు రీతియొక్క ప్రధానత ప్రతిపాదింపబడినది. దండ్యాచార్యుడు రీతిమతము ననుసరించినవాడే. మమ్మటాచార్యాదులీ రీతియొక్క ఉపయోగితను స్వీకరించినప్పటికిని, కావ్యమునకు ఆత్మగా స్వీకరింపలేదు. వారి దృష్టితో ఈ రీతులు, గుణములు కావ్యమునకు అవయవ ప్రాయములు మాత్రమే. రస సిద్ధాంతమునకు "విభావానుభావవ్యభిచారి సంయోగా ద్రస నిష్పత్తిః" అను భరతుని రస సూత్రమే ప్రాణభూతమై యున్నది. భరతుని నాట్య శాస్త్రములోని రససిద్ధాంతమును వ్యాఖ్యానించినవారిలో భట్టనాయకుడు, భట్ట లొల్లటుడు, శ్రీ శంకుకుడు, అభినవగుప్తుడు ముఖ్యులు. ధ్వని సంప్రదాయ ప్రవర్తకుడు ఆనందవర్ధనాచార్యుడు. ఈతని మతమున కావ్యమునకు ఆత్మధ్వని. ఈ ధ్వని సిద్ధాంతము అనేకుల (నైయాయిక, వైయాకారణ, మీమాంసక, వేదాంతికాదుల) విమర్శనలకు గురియైనప్పటికి, దాని మహత్త్వము వృద్ధి యగుచునే వచ్చినది. మమ్మటాచార్యుడు ఈ విమర్శల నన్నింటిని యుక్తియుక్తముగ ఖండించుచు ధ్వని సిద్ధాంతమును పునః స్థాపించినాడు.

కావ్యశాస్త్ర నిర్ణయాత్మక కాలమందు ప్రసిద్ధు లగువారు అభినవగుప్తుడు, కుంతకుడు, మహిమభట్టు; అభినవగుప్తుడు ధ్వన్యాలోకమునకు లోచనటీకయు, నాట్యశాస్త్రమునకు, అభినవభారతీ టీకయు రచించినాడు. కుంతకుడు వక్రోక్తిజీవితము, మహిమభట్టు వ్యక్తివివేకమును రచించినారు.

వ్యాఖ్యాకాలమందు ధ్వని సంప్రదాయమనుసరించినవారిలో మమ్మటుడు, రుయ్యకుడు, విశ్వనాథుడు, హేమచంద్రుడు, విద్యాధరుడు, విద్యానాథుడు, జయదేవుడు, అప్పయ్య దీక్షితులుమున్నగువారు ముఖ్యులు. రస సంప్రదాయమందు శారదాతనయుడు, సింగభూపాలుడు, భానుదత్తుడు, రూపగోస్వామి మున్నగువారు ముఖ్యులు. రీతి సంప్రదాయమున రాజశేఖర క్షేమేంద్రాదులు ముఖ్యులు. అలంకార సంప్రదాయమున పండితరాజ జగన్నాథుడు, విశ్వేశ్వర భట్టాదులు ముఖ్యులు.

ఇట్లు కావ్యతత్త్వమును గూర్చి, కావ్యాత్మను గూర్చి అనేక వివిధ అభిప్రాయములు మతములు చెలరేగి అన్నియు గజిబిజిగా సాగినవి. ఈ వివిధాభిప్రాయములను, మతములను స్వీకరించి తగిన రీతిన ఖండించి, సమర్థించి, మమ్మటాచార్యుడు తన కావ్య ప్రకాశమందు ధ్వని సిద్ధాంతమునే పునః స్థాపించినాడు.

మమ్మటుని వ్యక్తిగత విశేషముల గూర్చి అనేకులలో అనేకాభిప్రాయములు కలిగినవి. కొందరి వాదమున ఈతడు జైయటుని తనయుడు. కొందరి వాదమున వజ్రటుని తనయుడు. మహాభాష్యటీకాకారు డగు కైయటుడు, ఋక్ప్రాతి శాఖ్యమునకు భాష్యమును రచించిన ఉవ్వటుడు ఈతనికి సహోదరురు. కాశ్మీర పండితుల యొక్క పరంపరాగతమగు ప్రసిద్ధి ననుసరించి మమ్మటుడు నైషధీయచరితను రచించిన శ్రీ హర్షునకు మేనమామ. ఈ విషయమును వివాదగ్రస్తమైనది. మమ్మటుడు కాశ్మీరమునందు జన్మించినను, వారణాశియందు విద్యాభ్యాస మొనర్చి పండితుడై కావ్య ప్రకాశమును రచించెను. మమ్మటుడు అసామాన్యమైన పాండిత్యము కలవాడు ఈతడన్నిశాస్త్రముల హృదయములను అవగత మొనర్చుకొనినప్పటికి ముఖ్యముగా వైయాకరణుడు. ఈవిషయము కావ్యప్రకాశములోని "బుధై ర్వైయాకరణైః" అని వైయాకరణులకు బుధత్వ మారోపించి పలుకుటయు, సంకేతి తశ్చతుర్భేదో జాత్యాది

ర్జాతి రేవవా" అను సూత్రముచే వైయాకరణ సమ్మత మగు 'జాత్యాది' పక్షమును స్వాభిమానముచే ప్రథమముగా చెప్పికొనుటయు, మహాభాష్యమును, వాక్యపదీయమును కావ్యప్రకాశమున నుదాహరించుటయు, మఱియు ఉపమాలంకారమునందలి అంతర్భేదములను వ్యాకరణ సిద్ధాంతముల ననుసరించే చెప్పుటయు, క్రియను హేతుభావమున గ్రహించుటయు మున్నగు విషయములచే తెలియవచ్చును. వ్యాకరణ సంబంధమగు 'శబ్దవ్యాపార విచార' మను గ్రంథమును మమ్మటుడు రచించినాడు. ఈ గ్రంథమున మమ్మటుడు కావ్యప్రకాశములోని రెండవ యుల్లాసమునం దున్న విషయమును (అభిధ, లక్షణ, వ్యంజన శబ్దములు) కూలంకషముగ చర్చించినాడు. పూర్వాచార్యుల భిన్నాభిప్రాయములను స్వీకరించి వానిని ధ్వనిమతమునకు సమన్వయించి యుక్తిమంతముగా సూత్రప్రాయముగ, సంగ్రహరూపముగ కారికావృత్తులను రచించి ధ్వనిమతమును పునః స్థాపించిన కారణమున మమ్మటాచార్యుడు వాగ్దేవతావతారుడని ప్రసిద్ధి వహించుటయే కాక, ఆతని కావ్యప్రకాశము దేశమునందు మిక్కిలి ప్రాచుర్యమును పొందినది. కావ్యప్రకాశమునకు డెబ్బదియైదునకు మించిన సంస్కృత వ్యాఖ్యానములు వెలువడిన వనుటచే ఆ గ్రంథ ప్రాశస్త్యమును వేఱుగ చెప్ప నవసరములేదు.

పైన జెప్పినటులుగా ధ్వని సిద్ధాంతమును పునర్వ్యవస్థీకరించి కావ్యశాస్త్రమునందు నవీన మార్గమును చూపించిన మహత్తర గ్రంథము కావ్యప్రకాశము. అలంకారశాస్త్ర గ్రంథములలో ఇది అత్యుత్తమ స్థాన మందికొనియున్న దనుటలో సందేహములేదు. అలంకారసాహిత్యమునందు వెనుకటి శతాబ్దములందు జరిగిన విషయ పరిణామములన్నిటిని సంగ్రహించుకొని తనకు తానై ఉన్నత సిద్ధాంతములను పొంది క్రొత్త సిద్ధాంతములు జనింపజేయుట కాస్పదమై యున్నది. కావ్య శాస్త్రమునకు సంబంధించిన సమస్త విషయములకు స్థానమై సంగ్రహరూపముగా ఉండుటయే కావ్యప్రకాశము యొక్క గొప్పతనము. ఇది కారిక, వృత్తి, ఉదాహరణములను మూడు భాగములుగా నున్నది. ఇందు గల 142 కారికలందు నిబంధింపబడిన సూత్రములు 212. 600 లకు పైగా ఉదాహరణములు వివిధ గ్రంథకర్తల గ్రంథములనుండి చూపబడినవి. ఈ గ్రంథమునందు పేర్కొనబడిన నామము లివ్వి :- అభినవ గుప్తాచార్యుడు, కాళిదాసు, కామశాస్త్రము, ధ్వనికారుడు, ఉద్భటుడు, భట్టనాయకుడు, భరతుడు, బాణుడు మహాభాష్యకారుడు, మయూరుడు, లొల్లటుడు, రుద్రటుడు, శ్రీశంకుకుడు, శ్రీహర్షుడు, వాక్యపదీయము.- ఉదాహరణములు గ్రహించి చెప్పబడని పేర్లివి: కాళిదాసుని రచనలు, భవభూతి రచనలు, అమరు శతకము, కర్పూర మంజరి, కుట్టినీమతము, చండీశతకము, నవసాహసాంక చరితము, నాగానందము, భామహుడు, భాసుడు, భల్లటుడు, భర్తృహరి, భట్టికావ్యము, రత్నావళి, రాఘవానందము, విద్ధశాలి భంజిక, విష్ణుపురాణము, వేణీసంహారము, హయగ్రీవవధ, హరవిజయము, విజ్జికా, బాలరామాయణము.

కావ్య ప్రకాశమునందలి ఉల్లాసములు పది. "తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునఃక్వాపి" అని కావ్య లక్షణమును జెప్పి తదనుగుణముగా పది యుల్లాసములును చెప్పబడినవి.

1. ప్రథమోల్లాసము :- మంగళాచరణమైన పిమ్మట క్రమముగా కావ్యఫలము కావ్య కారణము, 'తదదోషౌ శబ్దార్థౌ' అని కావ్య స్వరూపము నిరూపింపబడినవి. తదుపరి కావ్యముయొక్క ఉత్తమ, మధ్యమ, అధమ భేదములు నిరూపింపబడినవి.
2. ద్వితీయోల్లాసము :- 'శబ్దార్థౌ కావ్య,' మని చెప్పుటచేత శబ్దముయొక్క వాచక, లాక్షణిక, వ్యంజకము లను, అటులనే అర్థముయొక్క వాచ్య, లక్ష్య, వ్యంగ్యము లను మూడుభాగములు. నాల్గవదియగు తాత్పర్యార్థము చెప్పబడి యీ శబ్దార్థముల లక్షణములు, వాని యందలి అంతర్భాగములు (లక్షణా, వ్యంజనా) నిరూపితము లైనవి.
3. తృతీయోల్లాసము :- ఏ విధముగా అర్థములన్నియు వ్యంజికములు కావచ్చునో, అట్లగుటచే వ్యంజికత ఎట్లు కలుగునో నిరూపితములైనవి.
4. చతుర్థోల్లాసము :- ఇందు ఉత్తమ కావ్య నిరూపణము (ధ్వని స్వరూపము) రసములు, స్థాయిభావములు, వ్యభిచారి భావములు, 10455 ధ్వని కావ్యభేదములు, రసభావాదులు నిరూపింపబడినవి.
5. పంచమోల్లాసము :- మధ్యమ కావ్య భేదములు, 451574 గుణీభూత వ్యంగ్య కావ్యభేదములు నిరూపితము లైనవి.
6. షష్ఠోల్లాసము :- అధమకావ్యములగు చిత్రకావ్యభేదములు నిరూపింపబడినవి.
7. సప్తమోల్లాసము :- కావ్యదోషములు- 16 పదదోషములు, 21 వాక్యదోషములు, 23 అర్థదోషములు, 10 రసదోషములు నిరూపింపబడినవి. ఏయే సందర్భములందు అవి దోషములు కావో ఆ విషయమును చెప్పబడినది.
8. అష్టమోల్లాసము:- ఇందు గుణలక్షణము, అలంకారలక్షణము, మాధుర్యము, ఓజస్సు, ప్రసాదగుణములు, వామనుడు చెప్పిన దశవిధ గుణములకు స్వోక్తములగు (మాధుర్యాదులు), మూడు గుణములందలి యంతర్భావము నిరూపితము లైనవి.
9 నవమోల్లాసము :- కావ్యలక్షణమందు 'అనలంకృతీ' అను విశేషణము చెప్పుటవలన ఈ యుల్లాసమున శబ్ద ప్రాధాన్యతవలన కలుగు వక్రోక్త్యాదులు, రీతిసహితములగు ఆరు శబ్దాలంకారములు నిరూపితము లైనవి.
10. దశమోల్లాసము :- ఇందు ఉపమాద్యలంకారము లగు 61 అర్థాలంకారములు నిరూపింపబడినవి. వామనుడు చెప్పిన

అలంకారదోషములకు కావ్య ప్రకాశ మున నిరూపితములైనదోషములయందు అంతర్భావము నిరూపిత మైనది.

ఈ విధముగా కావ్యప్రకాశమందు ఒక నాటక లక్షణముతప్ప తక్కిన కావ్య లక్షణము లన్నియు చక్కగ నిరూపింప బడినవి.

సాధారణముగా కావ్యప్రకాశమును చెప్పి నప్పు డిది మమ్మటునిచే రచింపబడినదని చెప్పుదురు. కాని ఇది ఒక్క మమ్మటుని చేతనే రచింపబడినది కాదనియు, మఱి యొకని రచనాభాగమును దీనియందున్న దనియు వాదములు గలవు. ఈ వాదములలో రెండు ప్రధానములైనవి. అవి —

1. కావ్య ప్రకాశమందలి కారికలను రచించినవాడు భరతుడు. మమ్మటుడు ఆ కారికలకు వృత్తినిమాత్రమే రచించెను.
2. మమ్మటుడు కావ్య ప్రకాశమును కారికా వృత్తిసహితముగా పరికరాలంకారము వరకే రచించెను. శేషించిన భాగమును అల్లటుడు పూరించెను,

మెదటివాదమునకు మూలకారకులు సాహిత్యకౌముదీ రచయిత యగు విద్యాభూషణుడు, కావ్య ప్రకాశమునకు ఆదర్శటీక వ్రాసిన మహేశ్వరుడు. విద్యాభూషణుడు తన సాహిత్య కౌముదియందు "సూత్రాణాం భరత మునీశ వర్ణితానాం వృత్తీనాం మిత వపుషాం కృతౌ మమాస్యామ్" అనియు, గ్రంథాంతమున "మమ్మటాద్యుక్తి మాశ్రిత్య మితాం సాహిత్య కౌముదీం వృత్తిం భరత సూత్రాణాం శ్రీ విద్యాభూషణో వ్యధత్" అనియు చెప్పినాడు. అటులనే మహేశ్వరుడును కావ్యప్రకాశములోని కారికా కర్తృత్వము భరతునిదే యనినాడు. తిలక వ్యాఖ్య రచించిన జయరాముడు తన వ్యాఖ్య యందీ మతమును ఖండించినాడు. మొదటి కారికా కర్తృత్వము భరతునిదే యను నభి ప్రాయమును చూపించినను చివరకు కారికా వృత్తుల కర్తృత్వము మమ్మటునిదే యని చెప్పినాడు. ఈ వాదమునకు ప్రబలకారణ ములు మూడు :

(క) "శృంగార హాస్య కరుణ రౌద్ర భయానకాః," "రతి ర్హాసశ్చశోకశ్చ" "నిర్వేదగ్లాని శంకాఖ్యాః" ఇత్యాది సూత్రములు కావ్య ప్రకాశమందు చెప్ప బడినను అవి భరతముని ప్రణీత నాట్య శాస్త్రము లోనివే.

(చ) కావ్య ప్రకాశమున మొదటి కారికకు చెప్పబడినవృత్తియందు "గ్రంథారంభే విఘ్న విఘాతాయ సముచితేష్ట దేవతాం గ్రంథ కృత్పరామృశతి" అని చెప్పుటలో 'గ్రంథకృత్' అను ప్రథమ పురుష ప్రయోగము కానవచ్చుచున్నది. ఈ ప్రథమపురుష ప్రయోగము చేతనే కారికా రచయిత మమ్మటు డగుటకు వీలు లేదు. మమ్మటుడే కారికలు వ్రాసిన ఉత్తమపురుషయందే చెప్పెడివాడు.

(ట) "సమస్త వస్తు విషయం శ్రౌతా ఆరోపితా యదా" అను కారికయందు 'ఆరోపితా' అను బహువచనము ప్రయోగించుట చేతను, దీని వృత్తియందు "బహువచన మవివక్షితం" అని చెప్పుటచేతను, కారికాకర్తయు వృత్తికర్తయు నొకడే యైనచో వృత్తి యందు 'శ్రౌతా వారోపి తౌయది' అని రచించియుండెడివాడు. కాన, కారికా కర్త వేరు, వృత్తికర్త వేరు.

ఆలోచించి చూచినచో పై మూడు కారణములును నిలచునవి కావు. కావ్య ప్రకాశ మందున్న 142 కారికలలోను కొలది కారికలు (6) మాత్రమే భరతముని నాట్యశాస్త్ర మందున్నవి. మమ్మటుని కాలమునాటికి నాట్య శాస్త్రము రససంబంధమయి ప్రబల ప్రచార మందుండుటవలనను, రస విభావాదులకు సంబంధించిన కారికలను, వాని యర్థాదుల నంతకన్నను సులభముగా, సంక్షిప్తముగా చెప్ప వీలు లేమియు యథాతథముగా తన కావ్యప్రకాశమునందు చేకొనినాడు. ఇటులనే ఆయా సందర్భములందు తనకన్న పూర్వీకులగు వారి గ్రంథములందలి కొన్ని భాగములను యథాతథముగ తన కావ్యప్రకాశమందు చేకొనినాడు. "కర్ణావతం సాదిపదే కర్ణాది ధ్వని నిర్మితిః సన్నిధానాది బోధార్థమ్" అను ఏడవ యుల్లాసములోని కారిక వామనుని" కర్ణావతంస శ్రవణకుండల శిరః శేఖరేషు కర్ణాది నిర్దేశః సన్నిధేః" అను సూత్రమున కనుకరణమే కదా! అటులనే గుణ లక్షణమును చెప్పు నవసరమున "తమర్థ మవలంబంతే యేంగినంతే గుణాః స్మృతాః అంగాశ్రితా స్త్వలంకారా మంతవ్యాః కటకాదివత్" అనుట ఆనందవర్ధనుని కారికల కనుసరణమే కదా! ఇట్లు అనేకములు చూపవచ్చును. అందుచే కావ్యప్రకాశము భరత, వామన, ఆనందవర్ధనాచార్యాదులచే రచింపబడిన దని చెప్పదగునా?

అటులనే 'గ్రంథకృత్ పరామృశతి' అను ప్రథమ పురుష ప్రయోగముచేత కావ్య ప్రకాశము మమ్మట విరచితము కాదని చెప్పవలనుపడదు. ప్రాచీనులగు సంస్కృత గ్రంథకర్త లందఱు సాధారణముగా తమను గుఱించి తమ గ్రంథములందు చెప్పుకొను నవసరమున ప్రథమపురుషయందే చెప్పికొనుట ఆచారమను విషయ మందఱకును తెలిసినదే. విశ్వనాథుడు తన సాహిత్యదర్పణమందు "వాగ్దేవతాయాః సా మ్మ ఖ్యమాధత్తే" అని ప్రథమ పురుషయందే చెప్పికొనలేదా? ఇట్లు చెప్పికొనుట నిరభిమానతా సూచకమే యగునుగాని వేఱగునా? అటులనే మమ్మటుడును చెప్పికొనుటలో తప్పేమి యున్నది?

"సమస్త వస్తు విషయం" అను కారికచే సమస్త వస్తువిషయరూపకమందు సాధారణముగాఅనేక ఆరోప్యమాణములుండవచ్చును. అందుచే కారికయందు "ఆరోపితాః" అను బహువచనము సాధారణ ధర్మమున చెప్ప బడినది. ఈ కారికా వృత్తియు దీనిని వివరించుచు "ఆరోపవిషయా ఇవ ఆరోప్యమాణాః యదా శబోపాత్తాః తదా సమస్తాని

వస్తూని విషయోఽస్యేతి సమస్త వస్తు విషయం'' అని అదే విధముగనే రచింపబడినది. కాని "బహువచన మవివక్షితం" అను వృత్తి మఱియొక ప్రత్యేకవియమునకు దృష్టిని మరల్చుచున్నది. ఆరోప్యమాణములు రెండు ఉన్నను సమస్త వస్తువిషయ రూపకము కాగలదు. అప్పుడు కారికయందు బహువచనమునకు బదులు ద్వివచనమే వాడవలసి యుండును. ఈ విధముగా కారికయందీ విషయము సూటిగా చెప్పబడలేదు కావున వృత్తియు కారిక ననుసరించి వ్రాయవలసి వచ్చుటచే మమ్మటు డీ విషయమును వృత్త్యంతమున చెప్పినాడు.

కారికావృత్తుల రెంటిని మమ్మటుడే వ్రాసినాడనుటకు తగిన ఆధారములు లేకపోలేదు.

1. మమ్మటుడు వృత్తియందెచ్చటను తాను భరతముని కారికలను వ్యాఖ్యానించుచున్నట్లు చెప్పలేదు. కారికలు భరతమునివే యైనచో వృత్త్యారంభముననే ఆ విషయమును చెప్పెడివాడు.

2, మమ్మటుడు తన వృత్త్యారంభమున ప్రత్యేక మంగళాచరణ శ్లోకమును చెప్పలేదు. కారిక లొకరివై వృత్తి మఱియొకరిదైనచో వృత్తికారుడు ప్రత్యేకముగా మంగళశ్లోకము చెప్పుట సంప్రదాయము.

3. "కారణాన్యథ కార్యాణి'' అను నాల్గవ యుల్లాసమందలి కారికకు వృత్తి "తదుక్తం భరతేన విభావానుభావ..." అనియే చెప్పబడినది. భరతుడే కారికాకర్తయగుచో ఇట్లు చెప్పియుండెడివాడు కాదు. ''తదుక్తమనేనైవాన్యత్ర" అనియో, లేక "తదుక్తం కారికాకృతాన్యత్ర'' అనియో చెప్పబడి యుండెడిది.

4. భరతుని ప్రకారము రసములు ఎనిమిది. రసములను చెప్పుచు మమ్మటుడు భరతుని కారికను గ్రహించినప్పటికి "శాంతోపి నవమోరసః" అని తొమ్మిదవ రసమగు శాంతమునుగూడ చెప్పినాడు. కారికారచయిత భరతుడే యగుచో కావ్యప్రకాశమందును, నాట్యశాస్త్రమందువలె ఎనిమిది రసములనే చెప్పెడివాడు కదా!

5. "సంగమే తన్నిరంగంతు శుద్ధం మాలాతు పూర్వవత్" అన్న కారికయందు 'మాలా' శబ్దము మాలారూపకమును చెప్పుచున్నది. ఇది 'పూర్వవత్' శబ్దముచే 'మాలోపమనును' ఉదాహరించుచున్నది. ఈ 'మాలోపమ' వృత్తియందే చెప్పబడినది. కాన వృత్తికారుడు, కారికాకారు డొకడే యనుటకు సందేహములేదు.

6. నాట్యశాస్త్రమందు 3 అర్థాలంకారములు, 1 శబ్దాలంకారమును గూర్చియే చెప్పబడినది. కావ్యప్రకాశమందు 62 అర్థాలంకారములు, 6 శబ్దాలంకారములు చెప్పబడినవి. ఈ విషయమును కారికలు భరతమునిచే రచింపబడలేదని చెప్పుచున్నది.

7. మమ్మటుని తర్వాతి వ్యాఖ్యాకారులగు మాణిక్యచంద్రుడు, జయంతుడు, సరస్వతీ తీర్థులు, సోమేశ్వరుడు మున్నగువారు కారికావృత్తి కర్తలు వేరను అభిప్రాయమును చెప్పనేలేదు. కాగా కారికావృత్తికర్త ఒకడే అని చెప్పినారు. — అటులనే హేమచంద్ర, జయరథ, విద్యాధర, విద్యానాథ, అప్పయ్యదీక్షిత, జగన్నాథ, పండితరాయాదులు కావ్యప్రకాశమందలి కారికలు, వృత్తి ఒకేకర్తచే రచింపబడినవని తలచినారు. ఇట్లెన్నియేనియు మమ్మటుడే కారికావృత్తుల రెంటిని రచించెనని చెప్పవచ్చును. ఇక రెండవ వాదము :—

కావ్యప్రకాశ గ్రంథాంతమందు ''ఇత్యేష మార్గో విదుషాం విభిన్నోఽప్యభిన్న రూపః ప్రతిభాసతే యత్ న తద్విచిత్రం యదముత్ర సమ్యగ్వినిర్మితా సంఘటనైవ హేతుః" అను శ్లోకమున్నది. ప్రాచీన టీకాకారుడగు మాణిక్యచంద్రుడు ఈ శ్లోకమును గూర్చి "అథచాయం గ్రన్థోఽన్యేనారబ్ధోఽపరేణ చ సమాపిత ఇతి ద్విఖండోపి సంఘటనావశాదఖండాయతే" అనియు, సంకేత టీకాకారుడగు రుచకుడును "ఏతేన మహామతీనాం ప్రసరణహేతు రేష గ్రన్థో గ్రన్థకృతానేన కథమప్యసమాప్తత్వాదపరేణ చ పూరితావశేషత్వాత్ ద్విఖండోపి'' అనియు చెప్పినారు. అనగా ఈ గ్రంథము ఒకరిచే నారంభింపబడి అసమాప్తంగా రచింపబడుటచే మఱియొకరు దానిని పూరించుటచేతను, ద్విఖండమైనను సంఘటనా విశేషముచేత అఖండముగా విలసిల్లుచున్నదని భావము. వీ రిరువురును కావ్యప్రకాశ మెవరిచే ప్రారంభింపబడి ఎవరిచే పూరింపబడినదో చెప్పలేదు. కాని యీ విషయమును కావ్యప్రకాశ నిదర్శనాటీకను రచించిన రాజానకానందుడు ''కృతః శ్రీ మమ్మటాచార్యవర్యైః పరికరావధిః, ప్రబన్ధపూరితః శేషోవిధాయాల్లట సూరిణా'' అని చెప్పినాడు. అనగా కావ్యప్రకాశమందు పరికరాలంకారము వఱకు మమ్మటునిచే రచింపబడి, శేషము అల్లటసూరిచే పూరింపబడినదని భావము. అమరు శతక వ్యాఖ్యయందు అర్జునవర్మదేవుడును మమ్మటుడు, అలకుడు (అల్లటుడు ?) ఇద్దఱు కావ్యప్రకాశ కర్తలని చెప్పినాడు. వీ రీ విధముగా చెప్పుచు దానిని సమర్థించు విషయము లేమియు తెలియచేయలేదు. పరికరాలంకారము వఱకు నున్నశైలి, రచనా విధానము పరికరాలంకారము తరువాత రచనయందును ఒకే విధమున నున్నట్లు కానవచ్చుచున్నది. వేరొకకర్త అట్లు పూరించి యుండినచో శైలియు, చెప్పెడి విధానము కొంచెమైనను మారి యుండెడిది కదా అను అనుమానమునకు తావు లేకపోలేదు. మఱియు, పరికరాలంకారమునకు తరువాతి భాగము పూరింపబడి యున్నచో ఆ విషయము చెప్పబడి యుండెడిదే కదా! మఱియు నాతడు మంగళాచరణ శ్లోకముతో తన రచనను ప్రారంభించి యుండెడివాడు కదా! అదేమియు కావ్యప్రకాశమున కాన

రాకుండుటచే అల్లటుడు కావ్యప్రకాశ భాగమును రచించెననుట సందేహాస్పదమగుచున్నది. మఱి, గ్రంథాంతమందు చెప్పబడిన 'ఇత్యేష మార్గో' అను శ్లోకమున కీ విధముగా భావమును గ్రహింపవచ్చును. మమ్మటునకు ముందున్న అలంకారికు లందఱు నొక్కొక్క రొక్కొక్క పద్ధతిన తమ గ్రంథములను రచించిరి. (ఇంతకుముందు చెప్పబడిన రస, రీతి, అలంకార, ధ్వని సంప్రదాయముల ననుసరించి.) ఇవి యన్నియు విభిన్న మార్గములే. ఈ విభిన్న మార్గముల ననుసరించిన ఆలంకారికుల భావముల నన్నిటిని సంగ్రహించి, సంఘటించి సంగ్రహ రూపముగా చర్చించి, విమర్శించి, అఖండమగు రీతిన మమ్మటాచార్యుడు కావ్యప్రకాశమును రచించెను.

భరతముని కాలమునుండి యున్న అలంకారసంప్రదాయములను సంగ్రహించుకొని వానిని వివేచనముచేసి కావ్యమునకు ధ్వని ఆత్మవంటిదని, ధ్వని సంప్రదాయమును కావ్యప్రకాశము ద్వారా మమ్మటుడు తిరిగి లోకమునకు చాటినాడు. ఈయన కావ్యస్వరూపము మొదలు అలంకార లక్షణ లక్ష్యముల వఱకు నన్ని విషయములను చెప్పినను, నాటక ప్రకరణమును కావ్యప్రకాశమందు చేర్చలేదు. ఈ నాటక లక్షణాదులను మమ్మటుని తర్వాతి అలంకారికులు తమ తమ గ్రంథములందు చేర్చికొనిరి. కావ్య ప్రకాశము మమ్మటుని తర్వాత ఆలంకారికులకు కల్పవృక్షము వంటి దయిన దని చెప్పుటలో సందేహము లేదు. మమ్మటుని కావ్యలక్షణము కావ్య ప్రకాశమందు ప్రకాశమాన మౌచున్నది. ఈయన కావ్యమున శబ్దధ్వనినే కాక రస ధ్వనినికూడ శిరసావహించినాడు. అయినను ప్రాచీన మత ప్రధానాంశములైన శబ్దార్థములను, గుణదోషాలంకారములనుగూడ చేకొనినాడు "దోషరహితము, గుణసహితము, కొన్ని సమయములందు అలంకార దూర మైనను, శబ్దార్థ సముపేత మైనది కావ్యము" అని మమ్మటుడు కావ్యలక్షణమును చెప్పినాడు. ఈ లక్షణములో రస ప్రసంగముకాని, ధ్వని పేరుగానీ వాచ్యరూపములో లేకున్నను అవి ప్రతీతిని పొందియే యున్నవి. రస స్వరూపము వర్ణించుచు ఆ యవసరమున భట్టలొల్లట, శ్రీశంకుక, భట్టనాయకు లొనర్చిన వివిధ వాదముల సారమును పేర్కొని వానిని విమర్శించనాడు. చివఱకు అభినవగుప్తుని వ్యక్తి వాదమునే మమ్మటుడు ఆదరించినాడు. భరతుని ఎనిమిది రసములను వచించి కావ్యౌచిత్యమును గణుతించి శాంతమునుగూడ తొమ్మిదవ రసముగా గ్రహించినాడు. గుణదోష విచారము చేయుచు మమ్మటు డీ విచారణమును కావ్యసామాన్యమునకు వర్తింపజేయకయే విశేషముగా రస ధర్మమునకే ప్రవర్తింప జేసెను. ఈతని మతమున గుణములు కేవలము రసాశ్రయములై యుండును. మాధుర్యాది గుణములు శబ్దార్థ మూలమున ప్రకాశింపవనియు, శబ్దార్థముల గుణ వ్యవహారము గౌణమే యనియు, ఈ వ్యవహారము రసోపకారముగనే విలసిల్లు ననియు, కనుక గుణములు కేవలము రసమునకే చెంది వాని నాశ్రయించి కావ్యసౌందర్యమును పెంపొందించునని యీతడు చెప్పినాడు. అటులనే అలంకారములుకూడ శబ్దార్థముల ద్వారా కావ్యమందలి రసమునను పరిస్ఫూర్తి కలిగించునని చెప్పినాడు. అట్లు అలంకారములు రసోపస్కారములు కాని యెడల అవి వాగ్వైచిత్ర్యములుగనే ఉండునని తెలిపినాడు. ఈతడు మూడు గుణములను మాత్రమే సమ్మతించినాడు. ఉద్భటుని వృత్తిత్రయము, వామనుని రీతిత్రయము, మమ్మటుని గుణత్రయముగా రూపొందిన వనుటలో సందేహము లేదు. కావ్యప్రకాశమందు మమ్మటుడు వివరించిన పద దోషములు, అర్థదోషములు, వాక్యదోషములు, రసదోషములు ఆతని తరువాతి ఆలంకారికు లందఱు అవలంబించిరి. కావ్య ప్రాశస్త్యమునకు అలంకారములు ప్రధానములు కావని తలచినను, పదియవ ఉల్లాసమందు మమ్మటుడు శాస్త్ర సంప్రదాయము ననుసరించి అలంకార వివేచనము చేసినాడు.

మమ్మటు డొనరించిన కావ్య లక్షణము నవీనాలంకారికుల ఖండనమునకు గురియైనను, స్థూలముగా పరిశీలించిన యెడల ప్రాచీన మతములందు లోపములవలె కానవచ్చు బాహ్య విభేదముల కన్నిటికిని ఈతని కావ్యలక్షణమందు సమన్వయము కుదురుచున్నది. ఇట్టిసామాన్యమగు సమన్వయము కావ్యప్రకాశమందుండుటచే ఈ గ్రంథ ప్రాశస్త్యము నానాటికి అభివృద్ధి చెందుచు నవీనాలంకారికులకు మార్గదర్శకమై అలరారుటలో వింత యేమున్నది?

"శబ్ద బ్రహ్మ సనాతనం న విదితం
శాస్త్రైః క్వచిత్ కేనచిత్
తద్దేవీ హి సరస్వతీ స్వయ మభూత్
కాశ్మీరదేశే పుమాన్
శ్రీమజ్జైయట గేహినీ సుజఠరా
జ్జన్మాప్య యుగ్మానుజః
శ్రీమన్మమ్మట సంజ్ఞయా శ్రిత తనుం
సారస్వతీం సూచయన్''

మఱియు,

''కావ్యప్రకాశస్య కృతా గృహే గృహే టీకాః" అని చెప్పుటచే మమ్మటుని అసాధారణ పాండిత్య ప్రతిభయు, కావ్యప్రకాశమునకు గల ప్రచార ప్రాశస్త్యములు, ఇంత అని చెప్పవలెనా?

[ఈ వ్యాసరచనమునకు తోడ్పడిన గ్రంధములు :

1. మహామహోపాధ్యాయ పి. వి. కాణే రచించిన History of Sanskrit Poetics.

2. భట్ట వామనాచార్యకృత బాలబోధినీ టీకా సహిత కావ్యప్రకాశము.

3. ఆచార్యవిశ్వేశ్వరసిద్ధాంతశిరోమణివిరచిత హిందీవ్యాఖ్యాత సహిత కావ్యప్రకాశము.

4. Gajendragadkar Edition of Mammata's Kavyaprakasa

5. శే. వేం. రాఘవఅయ్యంగారికావ్యాత్మ.]

# హాలునిలో తెలుగు పదాలు

## పి. ఎస్. శాస్త్రి

హాలశాతవాహనుడు ఆంధ్ర శాతవాహన రాజులలో ఒకడు. ఈయన రచించిన గాథాసప్తశతి అను 700 శ్లోకములుగల ప్రాకృత కావ్యమొకటి లభించుచున్నది. ఇది మహారాష్ట్రి ప్రాకృతంలో వ్రాయబడినదనీ, శాతవాహనుల భాష ఇదే ననీ వాదాలు ఉన్నవి. కాని ఈ గాథలను శ్రద్ధగా పరిశీలిస్తే చక్కని తెలుగు పదాలు చాలా కన్పిస్తవి. మన పరిశోధకులు శాసనాలకు ముందున్న తెలుగుభాష యొక్క రూపాన్ని సరిగా గమనించినట్లు లేదు. హాలుని గాథలలో ఈ ప్రాచీన స్వరూపము కొంత బోధపడగలదు. అనేక ప్రాచీనకవుల గాథలను ఒకచో సమకూర్చుచు, తన రచనలను వాటితో కలిపి ఈ సప్తశతి నిచ్చిన హాలుడు ఆంధ్రుడు. వోడిస, చుల్లోహ, మకరందసేన, అమరరాజ, కుమారిల, శ్రీరాజ, భీమస్వామి మొదలగువారి గాథలు ఇందులో ఉన్నవి.

హాలుడు సింహళరాజ పుత్రితో సప్తగోదావరంలో విహరించిట్లుచెప్పే ప్రాకృత కావ్య మొకటి వున్నది. సప్తగోదావరం అనే ప్రయోగము ఆంధ్రదేశానికి చెందినదే గాని, మహారాష్ట్రి దేశానికి సంబంధించినది కాజాలదుగదా. హాల శాతవాహనుడు ఆంధ్రుడు అని ఎంచటంలో ప్రమాద మేమీలేదు. ఆంధ్ర దేశంలో ఆనాడు వ్యవహారంలో ఉన్న భాష ఒకవిధమైన ప్రాకృతమనీ, ఆనాటి భాషలోని శబ్దాలు చాలావరకు స్వల్పమైన మార్పులతో నేటికీ నిలచిఉన్నవనీ చెప్పటానికి మనకు ఆధారాలు చాలా కన్పిస్తున్నవి. కాని ద్రావిడభాషలు వేరు, ఆర్యభాషలు వేరు అని పాశ్చాత్యులు కల్పించిన శాస్త్రానికి తలవొగ్గిన విద్వాంసులకు ఇది రుచింపక పోవచ్చును. పరిశోధన చేసేటప్పుడు ఒక వాదాన్ని బలపరచాలి అని ప్రారంభిస్తే సరియైన వాతావరణము లభించదు. ఏ వాదానికి మొగ్గకుండా పరిశోధనలో ఏది లభిస్తే దానినే బయటపెట్టడానికి ధైర్యము అవసరము. ఇలాంటి పరిస్థితుల్లో హాలుని గాథాసప్తశతి అమూల్యమైన గ్రంథము. ఇందులో అనేక వర్ణనలు ఉన్నవి. వింధ్య నర్మదాదుల వర్ణనలు పుష్కలంగా ఉన్నా గోదావరీప్రశంస చాలా ఎక్కువగా కన్పిస్తున్నది.

స్త్రీల రథికలను ప్రస్తావించుతూ (7-20) ఆంధ్రదేశపు ఆచారాన్ని చెప్పినాడు. బెల్లమును తయారుచేసే యంత్రము (6-54), పొలాలను తడిపే సందర్భంలో రహట్టఅనే సాధనము(5-90) చెప్పబడినవి. ఎడ్లకు మెడలో వేసే పట్టె, ముక్కులోనుంచి దూర్చే తాడులను వరుసగా జోత్త అని, అవహాసిణీ అని (7-92) పిలచినాడు. పునః సంధానమునకు వధువు ధరించే వస్త్రము ఆనందపటము (5-57). ఇలాంటి విశేషాలే కాక గ్రామాలలో ప్రజలు పూరిండ్లలో నివసించే సంప్రదాయాన్ని చెప్పినాడు (6-35). గ్రామంలో గల అధిపతికి పూర్ణ స్వాతంత్ర్య ముండేది(1-31, 7-28, 31).

గాథా సప్తశతిలోని కొన్ని తెలుగు పదాలనుగూర్చి తెలిసికోవటం అవసరము. మొదటి శ్లోకంలోనే "ముహఅందం" అని ఉన్నది. ఇది "ముఖచంద్రం" కాదు. చంద్రశబ్దం చందగా చాలాచోట్ల కన్పిస్తుంది. ఇచట ముఖముయొక్క అందము అనే అర్థము. 1-10 లోకూడాగల అందం అనే శబ్దము హాలునినాటికే ప్రసిద్ధి. అంద చందాలు అనే ప్రయోగంలో అంద, చంద్ర శబ్దములు గాక వేరే ఉన్నవని దీని వలన తెలుస్తుంది. 1-8 లోను, ఇతరత్ర అత్త అనే శబ్దం నేటి అర్థంలోనే ఉన్నది. దీనికి సంస్కృతరూపం లేనేలేదు. మషీ అని సంస్కృతరూపం గల మసి (1-13) వస్తుతః తెనుగునుంచే సంస్కృతంలోకి పోయి ఉండవచ్చు. (1-13), వచ్చ (1-21) అనే పదాన్ని వ్రజ అని అనువదించారు కాని, ఇది వచ్చు ధాతువుయొక్క రూపము. 1-27 లో మానం గల ఇల్లాలు అనటానికి 'మాన ఇల్లా' అని కలదు. ఇల్లాలు శబ్దం ఇక్కడ వచ్చినది. మైల అనేపదం మఇల (1-34)గా కన్పిస్తుంది. గోడకు పూర్వరూపము కుడ్డ (1-35). అప్పాశబ్దము (1-39) సర్వ సాధారణము.

గుత్తి అనేది గుత్థ (1-63)గాకన్పిస్తుంది.

మత్తపాడి (1-65) అంటే మత్త మహిషి అన్నారుగాని పాడి శబ్దానికి పాడిగేదె అనే అర్థం సరిపోతుంది. ఇక్కడగల 'పాడి' శబ్దము అచ్చ తెనుగు. సురసుర మనటం (1-74) విస్మరింపబడలేదు. సవతి శబ్దము సవత్తి (1-79) గా కన్పిస్తుంది. పీటి అన్నింటికన్న ముఖ్యమైనది (3-85. 1-83) లలో గల పొట్ట అనే పదము. ఇది తెలుగు లోనే ఉన్నది కాని ఇతర భాషలలో లేదు. మాపు, మామి శబ్దాలు సామాన్యంగా కన్పిస్తున్నవి.

"ఓ హి అఅ" (2-5, 5-37) అంటే 'ఓ హృదయమా'. ఈ సంబోధన తెలుగు నాటిది. నిబ్బరమును ణిబ్బర అని (2-28) వాడినాడు. వంక, వంకర అనే అర్థాలతో వంక (2.74) అని శబ్దమున్నది. విదియ అనే పదం పీ అది (3-9) అని ఉన్నది. దీనికి వర్ణ వ్యత్యయం కలగగా విదియగా మారినది. సంబోధనలో ఆశ్చర్యముగాని, బాధగాని తెలియజేస్తూ 'అబ్బో' అంటాము. 5-75 లో ఇది ఉన్నది. అబ్బో అనే మాటతో 3-73 ఆరంభము. నేతికి తుప్ప (3-89). పడిపోవు అనే అర్థంతో 'పడి పహిం' (4-8) అని కలదు. 4-42 లో కన్పించే 'ఎక్కక్కం' పదము 'ఒక్కొక్క' కు సరిపోతుంది. 4-92 లో గల 'పోడహిాఓ' పదానికి బిడ్డలు అని అర్థము. పంది అనే శబ్దానికి మూల రూపం 5-2 లో గల భోండీ. 'చాలా చోద్యమే' అనే ప్రయోగంలో గల చోద్యం హాలునిలో చోజ్జం (5-6) అని కన్పిస్తుంది. తదియకు పూర్వ రూపం తఇఅ (5-11).

లెక్కకు తొలి వేషము లక్ఖ (5-64). సొగసు అనే పదము, సొహగ్గం (6-81) అని కన్పిస్తుంది. ఈ రెంటికి మూలము సౌభాగ్యం కావచ్చు. 6-89 లో చివర కన్పించు "వచ్చామో" అనే పదాన్ని "వచ్చాము" అని స్వల్పంగా మారిస్తే అర్థం చెడదు. క్రియాంతాల మూలరూపాలకు ఇది ప్రధానమైన ఆధారం కాగలదు. కొట్టు అనే అర్థంగల గొట్టం (7-9) కన్పిస్తుంది. పల్లెపడుచు అనే అర్థంతో పల్లి (7-28) అని వాడినాడు. పల్లెదాని మొగుడు పల్లివఈ (7-31). వఈ అనేది వాడుగా మారిందేమో అనే అనుమానం కలగకపోదు.

ఈవిధంగా ప్రాకృత కావ్యాలను చక్కగా పరిశీలిస్తే తెలుగు మాటలు చాలా కన్పించగలవు.

# వనితాలోకం




# అలక


వాసిరెడ్డి సీతాదేవి


అలక అనగానే ఆడవాళ్ళు గుర్తొస్తారు.

అలక, కన్నీరు, ఆడవాళ్ళ ఆయుధాలంటారు మగవాళ్ళు. ఇందులో కొంత సత్యంలేకపోలేదు. అలగటంకూడా ఒక కళే. అందరి ఆడవాళ్ళకూ అలగటం రాదు అనటంలో అతిశయోక్తిలేదు.

అలక ముదిరితే హఠము, అంటే మొండిపట్టు అయి కూర్చుంటుంది. మొండిపట్టువల్ల ఎందరిజీవితాలో పెడమార్గాలు పట్టటం మనం చూస్తూనేఉన్నాం. అలక ముదిరితే ఎన్నో అనర్థాలకు దారితీస్తుంది. అలక్కూ, మొండిపట్టుకూ మధ్యనుండే అతిసూక్ష్మమైన ఆవరణను తెలుసుకోలేక పోతే జీవితంలో, ముఖ్యంగా దాంపత్య జీవితంలో అశాంతి రేకెత్తే అవకాశం ఉంది.

ఆ మధ్య నా స్నేహితురాలు హేమ చెప్పినకథ చెబుతాను: హేమవాళ్ళఅమ్మ కలిగినవారి ఇంటి ఆడపడుచు. ఆమెకు కోపం ముక్కుమీదే ఉండేదట. ప్రతిచిన్న విషయానికీ అలిగి అన్నం తినకుండా పడుకొనేదట. తల్లిదండ్రులకు ఒకే కూతురు కావటంవల్ల గారాలపట్టిగా పెరిగింది. పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళింది. ఆ అత్తగారికి ఆడపిల్లలులేక ఆమెను ఎంతో ప్రేమగా చూసేదట. కాని ఆమెభర్త చాలా పట్టుదలగలవ్యక్తి. భార్య చీటికీ మాటికీ అలగటం ఇష్టం ఉండేదికాదు. పది సంవత్సరాలు ఎలాగో గడిచింది. అత్తగారు బతికున్నంతకాలం కొడుకునూ కోడల్నీ సమర్థించుకుంటూ వచ్చింది. వచ్చిన చిక్కల్లా ఆమె పోయినతరవాతే. ఇద్దరూ మొండిపట్టుదల కలవారే. ఒకనాడు మాటా మాటావచ్చి అయిదేళ్ళ కూతుర్ని చంకనేసుకొని చక్కాపోయింది పుట్టింటికి. 'ఎంతకాలం తనులేకుండా ఉండగలడో చూస్తానుగా' అనుకుంది ఆమె. 'ఎంతకాలం అలిగి పుట్టింట్లో కూర్చుంటుందో చూస్తాగా!' అనుకున్నాడుభర్త.

నెలలు గడిచాయి. నెలలు సంవత్సరాలు అయాయి. ఇద్దరికీ బాధగానేఉంది. కాని కాలంగడిచినకొద్దీ పట్టుదల ఎక్కువయింది. ఐదేళ్ళహేమ ఇరవయ్‌రెండు ఏళ్ళదయింది. అసలుసంగతి తెలియని హేమ తండ్రిని అసహ్యించుకోసాగింది తల్లిని వదిలేశాడనుకొని.

భార్యాభర్త లిద్దరూ అనుకోకుండా ఓ బంధువు ఇంట్లో పెళ్ళిలో కలుసుకున్నారు. ఒకర్ని చూసి ఒకరు తెల్లబోయారు. యౌవనంలో ఉన్నప్పుడు విడిపోయిన ఇదరూ ఇప్పుడు నడివయస్సులో పడ్డారు. నిట్టూర్చారు. కాని అదేప్రశ్న ఎవరు ముందుమాట్లాడాలి!

ఆరాత్రి భోజనాలు జరుగుతున్నాయి. భర్త ఆపంక్తిలో భోజనం చెయ్యటం చూసిన ఆమె గబగబా వంకాయచట్నీ ఉన్నగిన్నె తీసుకొని వడ్డన ప్రారంభించింది. తనభర్తకు వంకాయపచ్చడంటే చాలా ఇష్టమని తెలిసిన ఆమె భర్త విస్తట్లో మరికాస్తవేసింది. మళ్ళీ వెయ్యబోయింది. చెయ్యి అడ్డంపెడుతూ 'ఊఁ' అన్నాడు. ఇకనేం భర్త మాట్లాడాడని పొంగిపోయింది. రెండోసారి నెయ్యి తెచ్చింది. పోస్తూనేఉంది. 'చాలు' అన్నాడు అతను. 'ఇంకొంచెం వడ్డించుకోండి' అంది ఆమె.

తెల్లవారేప్పటికి పెళ్ళింట్లోనుంచి ఇద్దరూ మాయం అయారు. ఆ కథ విన్నప్పుడు పొట్ట చెక్కలయేలా నవ్వాను. కాని అంతలోనే అనుకున్నాను మొండిపట్టుదలవల్ల జీవితంలో ముఖ్యమైన కాలాన్ని వ్యర్థం చేసుకున్నారుగదా అని. అలక ముదిరితే ఇలాంటి అనర్థాలే ఎదురవుతాయి.

జీవితంలో ప్రేమకు ఉన్నస్థానమే అలకకుకూడా ఉంది. అలకను ఆశ్రయించినప్రేమ ప్రకాశిస్తుంది, వికసిస్తుంది.

అలక ప్రేమలో, స్నేహంలో మాధుర్యాన్నీ, కొత్తదనాన్నీ కలిగిస్తుంది. దీనివల్ల జీవితంలో తాత్కాలిక ఆవేదన, ఆ ఆవేదనలో ఆనందం కలుగుతాయి. అవిరామప్రయాణంలో విసుగుచెంది అలసిపోయిన బాటసారి ఏ చెట్టునీడనో విశ్రాంతి తీసుకుంటాడు. అలాగేదాంపత్య జీవితంలోకూడా అలక ఒక విశ్రాంతి గృహము. వైవిధ్యంలేని దాంపత్య జీవితం పెద్దకొండచిలవలా బరువుగా భారంగా కాలమార్గంమీద పాకుతూ ఉంటుంది.

అలకలో ఒకవైపు అశాంతి, ఆవేదన, అసంతృప్తి ఉంటే రెండోవైపు అభిమానంతోకూడిన తియ్యని తలపులు ఉంటాయి. ప్రేమా, అధికారమూ, రెండూ ఉన్నచోటనే అలకఉంటుంది. ఎవరిమీద మనకు ప్రేమ, అధికారం ఉందనుకుంటామో వారిమీదనే అలుగుతాము. మాటలురాని పసిపిల్లలుకూడా అలగటంచూస్తాము. వృద్ధులుకూడా అలుగుతుంటారు. పిల్లలు అలిగితే ముద్దొస్తారు, వృద్ధులు అలిగితే కోపంవస్తుంది.

అలకతీర్చేవారున్నంతవరకే ఆ అలకకు ఓ అందం, అర్థంఅంటూ ఉంటాయి. తన అలకను లక్ష్యపెట్టని వారిముందూ, అలక తీర్చేవారు లేనప్పుడూ అలిగినంత తెలివితక్కువపని ప్రపంచంలో మరోటి ఉండదు. కళ్ళనీరు తుడిచేవారిముందే ఆ కన్నీళ్ళకు విలువఉంటుంది. అలాగే అలక తీర్చేవారున్నప్పుడూ, ఆ అలక తీరేంతవరకూ అశాంతితో అటూ ఇటూ అయేవారు ఉన్నప్పుడే ఆ అలకకు, విలువ ఉంది.

లోతుగా పరిశీలిస్తే అలకలుకూడా ఎన్నో రకాలుగా ఉంటాయి. కొందరు ఎవరిమీద అలుగుతారో వారితో మాట్లాడటం మానివేస్తారు. కొందరు ఎవరిమీద అలుగుతారో వారిని కన్నెత్తికూడా చూడరు. కొంతమంది వారినుంచిదూరం వెళ్ళిపోతారు. కొందరు అంతకుముందు కానుకగా తీసుకున్న వస్తువులను తిరిగి ఇచ్చేసి తమ అలుకను తెలియపరుస్తారు. ఇంకా కొందరు నగలు తీసేసి, పాత వస్త్రాలుధరించి, ఇంట్లోని వస్తువులను చిందర వందరగా పడేస్తూ అలకను వ్యక్తపరుస్తారు. అయితే ఇలాంటి అలక సాధారణంగా ప్రబంధాలలోని నాయికల్లోనే కనిపిస్తుంది.

తెలివైనవారు ఈ ఆయుధాన్ని ఎప్పుడు, ఎక్కడ, ఎలా ఉపయోగించాలో ఆలోచించి మరీ ఉపయోగిస్తారు. చీటికీ మాటికీ అలిగేవారి అలకకు అర్థంఉండదు.

అలకలో విరోధభావం ఉన్నా అహంకారంఉండదు. అహంకారంతో కూడిన అలక ద్వేషానికీ, అవిశ్వాసానికీ, మన స్పర్ధలకూ దారితీస్తుంది. రెండు హృదయాలమధ్య ఉండేబంధం చాలా సున్నితంగా పట్టుదారంలా ఉంటుంది. అందువల్లనే ఆ బంధాన్ని తెగేంతవరకూ లాగకూడదు. తీరా తెగినతరవాత జీవితంలో మిగిలేది ఇంకేమీ ఉండదు. అందువల్ల అలిగినవారు సరసం విరసంగా మారకుండా జాగ్రత్తపడాలి.

జీవితాన్నీ, ప్రేమనూ, రసవత్తరం చేయటానికి అలక అవసరం. తనమాటను జవదాటకుండా, అతిశ్రద్ధాభక్తులతో పూజించేభార్యను పురుషుడు ఎక్కువ కాలం భరించలేడు. ఆమెలో వైవిధ్యం చూడగోరుతాడు. ఒకనాడు ఏడ్చి, మరోనాడు ఏడిపించి, ఒకనాడుప్రేమించి రెండోనాడు కోపగించగల భార్య భర్తను తనచుట్టూ తిప్పుకోగలదు.

శ్రీకృష్ణుడు పదహారువేల గోపికల్లో ఏడుగురు భార్యల్లో, రాధలాంటి ప్రేమమూర్తిలో చూడలేని ఏఆకర్షణచూశాడో సత్యభామలో ! చాలామంది సత్య అపురూప సౌందర్యవతి కావటమే ఇందుకు కారణం అని భ్రమపడతారు. కాని సత్యభామ అలకనేర్చిన అతివ కావటమే శ్రీకృష్ణుని ఆకర్షణకు కారణం.

ఎంతోమంది ప్రియురాండ్ర హృదయాలనుంచి అవిరామంగా ప్రవహించే ఆ ప్రేమవాహినిలో ఊపిరి సలపని శ్రీకృష్ణునకు సత్యభామ అలక విశ్రాంతి నిచ్చేది. అందరూ ప్రేమించేవారే; పూజించేవారే; శ్రీకృష్ణుని ప్రేమకోసం ఆత్మసమర్పణ చేసుకొనేవారే. అందులో ఏ ఒక్కరూ శ్రీకృష్ణునిమీద తమకు ఉన్న అధికారాన్ని గురించి ఆలోచించలేదు. కాని సత్యప్రేమలో వైవిధ్యంఉంది. తను శ్రీకృష్ణుని మనసారా ప్రేమిస్తుంది. కృష్ణుడుకూడా తనను ఒక్కదాన్నే ప్రేమించాలని ఆమెకోరిక. ఆమెలో ఈర్ష్య ఉంది. ఇలాటి ఈర్ష్య స్త్రీ సహజమైనగుణం. అందులోనే కృష్ణునికీ నిజమైన ఆనందం లభించేది. రుక్మిణి పూజలో, రాధఆత్మ సమర్పణలో అందని ఆనందం శ్రీకృష్ణునికి సత్యకాలితో తన్నులుతిన్నప్పుడు లభించింది. ఈ రహస్యాన్ని తెలుసుకున్న సత్యభామ కృష్ణుణ్ణి తన బానిసగా చేసుకుంది.

అలాగే అలకనేర్చిన కైకేయికి దశరథుడు దాసుడు అయాడు. సుమిత్ర దశరథుని భార్యలలోచిన్నది. న్యాయంగా ఆమెమీద ఎక్కువప్రేమ ఉండవలసింది. కాని అలా జరగలేదు. కారణం కైక స్వభావంలో వైవిధ్యం ఉంది. ఆమెకు

అలగటం తెలుసును. అనాడు కైకేయి గృహంలో పాదంపెట్టగానే పరిస్థితిని అర్థంచేసుకున్న దశరథుని హృదయం ఒకవైపు ఏదో అజ్ఞాతభయంతో, రెండో వైపు తియ్యని ఆలోచనలతో (ఆమె అలక ఎలా తీర్చాలా అనే ఆలోచనతో నిండిపోయింది) కాని ఆనాటి కైకేయి అలక హద్దులుదాటింది. మొండిపట్టుగా మారింది. చివరికి అది ఎన్ని అనర్థాలకు దారితీసిందో అందరికీ తెలిసినవిషయమే.

అలకద్వారా ఒక్కొక్కప్పుడు గడ్డు సమస్యలుకూడా ఒకదారికి వస్తాయి. ఒక్కోసారి అకారణంగానే ఏ యిద్దరు స్నేహితుల మధ్యో లేక ప్రియుల మధ్యో మనఃస్పర్ధలు బయలుదేరి, ఒకరినొకరు విమర్శించుకొనేంత వరకూ, శత్రుత్వం వహించేంతవరకుకూడ పోతాయి. అలాటి వారికి అలగటం అనే కళ తెలియదనే చెప్పాలి. అలాటి సమయాల్లో ఒకరు అలిగి పలక్కుండా కొంతకాలం దూరంగా వెళ్ళిపోవటం మంచిది. ఈ విధంగా ఇద్దరకూ ఆలోచించుకోవటానికి అవకాశం దొరుకుతుంది. ఎవరి తప్పును వారు తెలుసుకోగలరు. తమ తమ లోపాలను అర్థంచేసుకొని పశ్చాత్తాపపడే అవకాశం లభిస్తుంది. మళ్ళీ ఒకర్ని ఒకరు కలుసుకొని క్షమాపణ చెప్పుకోవటానికి తహతహలాడిపోతారు. ఈ విధంగా, ఒకరినొకరు శత్రువులుగా భావించుకోవటంవరకూ పోయిన వాళ్లుకూడ మరల నూతనోత్సాహంతో, ఉద్వేగంతో కలుసుకొనే అవకాశం ఉంటుంది.

అలకకు జీవితంలో ప్రాముఖ్యం, ముఖ్యంగా మనదేశంలో ఆదికాలంనుంచీ ఇస్తూనే వచ్చారు. అలకగృహాలుకూడా ఉండేవని మనకు పురాణాల ద్వారా తెలుస్తూనే ఉంది.

చీటికీమాటికీ అలిగే మగవాళ్ళంటే అసహ్యం వేస్తుంది. కాని మగవాళ్ళు ముఖ్యంగా తెలివైన వాళ్ళు అలకద్వారా ఆడవాళ్ళను లొంగదీసుకోగలరు. ప్రేమతోకూడిన అధికారానికి లొంగని మానవ హృదయం అరుదుగా ఉంటుంది.

దూరంగా ఉన్నంతవరకూ ప్రేమగానీ స్నేహంగానీ సురక్షితంగానే ఉంటుంది. కాని దగ్గరకు వచ్చినప్పుడే కొద్దిరోజుల్లోనే పరస్పరాకర్షణ తగ్గటం, ఒకరిని చూస్తే ఒకరికిచిరాకు కలగటం ప్రారంభమవుతాయి. "టాల్‌స్టాయ్". రచించిన 'అన్నా' చదివినవారికి అన్నా ఏ కారణంగా మానసిక బాధకు గురి అయిందో చివరకు ఆమెజీవితం విషాదాంతంగా ఎందుకయిందో తెలిసే ఉంటుంది. దానికి కారణం అన్నాకు అలగటం తెలియక పోవటమే.

కొందరిజీవితంలో అలిగే అవకాశమే రానివారు ఉంటారు. కొందరు అలగటం అంటే ఏమిటో తెలియనివా రుంటారు. ఈ రెండుతెగలకు చెందినవారూ దురదృష్టవంతులనే చెప్పాలి.

మైత్రినీ, దాంపత్య జీవితాన్నీ, ప్రేమనూ దృఢంగా, పదిలంగా, సరసంగా కాపాడుకోవాలంటే సరసంగా అలగటం నేర్చుకోవాలి.



# సుభాషితములు

శ్లో॥ ''యత్సుభ్రువాం ఘుసృణలేపకవోష్ణమంగం
యద్యౌవనోష్మమధురాణి కుచస్థలాని
కామస్య తత్ సకలకాముకయామికస్య
శ్యామాసు జీవితమజాయత శైశిరీషు.''
"శుభ్రేషు రాంకవపటేషు వాసంతికాసు
లీలాహసన్మలయజేంధనపావకాసు
కృష్ణాగురుజ్వలనధూమశిఖాసు చాసీత్
త్రైలోక్యకాముకజయీ మదనప్రతాపః"
"అంగారహాసిషు విలాసగృహోదరేషు
విస్తీర్ణతూలపటకల్పితవేష్టనేషు
ఉష్ణేషు చ ప్రణయినీకుచమండలేషు
శాంతిం జగామ శిశిరస్య తుషారవర్గః." — బిల్హణకవి.

సకల కాముకులను ఒకకంట కనిపెట్టుచున్న మన్మథునికి శిశిరఋతువురాత్రులయందు ప్రపంచములో ఎక్కడకూడ నిలువ చోటులేకపోయెను. అప్పుడతని జీవితమును నిలుపుకొనుటకు ఆ చలిరాత్రులయందు కుంకుముపూవు పూతచేత, నులివెచ్చనైన స్త్రీల శరీరములు, తారుణ్యపు వేడిమిచేత మధురములైన, స్తనమండలములు మాత్రమే ఆశ్రయము లయ్యెను. మరియు ముల్లోకములందలి కాముకులను జయించు మన్మథప్రతాపము, తెల్లని ఉన్నివస్త్రములయందు, మండుచున్న శ్రీగంధపుచెక్కల అగ్ని గల కుంపట్లయందు, అగరు ధూమములయందున్ను ఆ శిశిరాత్రులందు నిలువగలిగెను. అప్పటి శిశిరపుమంచు ప్రపంచ మంతయు వీరవిహారము సలుపుచున్నను, చలిమంటలు గల విలాస గృహములందు, చిక్కగా దూది నింపిన దుప్పట్లయందు, ఉష్ణములైన ప్రణయినీకుచమండలము లందున్ను శక్తి కోల్పోయి, దాని చలువదనము శాంతిల్లెను.

## గణరాజ్య తంత్రము

శ్లో॥ "ప్రాజ్ఞాన్ శూరాన్ మహోత్సాహాన్ కర్మసుస్థిరపౌరుషాన్
మానయంతః సదాయుక్తాన్ వివర్ధంతే గణా నృప!"
"ద్రవ్యవంతశ్చ శూరాశ్చ శస్త్రజ్ఞాః శాస్త్రపారగాః
కృచ్ఛ్రాస్వాపత్సు సమ్మూఢాన్ గణాన్ సంతారయంతి యే.'' — మహాభారతము.

వ్యక్తి పరిపాలనకంటె గణతంత్రరాజ్యము శ్రేష్ఠమనియు, గణరాజ్యమును నడుపువారి గుణములు, సామర్థ్యము ఈ విధముగా నుండవలె నని మహాభారతములో చెప్పబడినది :—

గణములు (జనతంత్ర నాయకులు), ప్రాజ్ఞులను, శూరులను, ఉత్సాహవంతులను, స్థిరమైన పౌరుషముతో కార్యములను సాధించగలవారలను, విశ్వాసపాత్రులను గౌరవించవలెను. మరియు దేశమునకు కఠినములైన ఆపదలు వచ్చినప్పుడు కర్తవ్యజ్ఞానములేక మూఢులుగా నున్న నాయకులను ఆపదలోనుండి ఉద్ధరించగల ధనవంతులు, శూరులు, శస్త్రాస్త్రకోవిదులు, శాస్త్రజ్ఞానము కలవారు నైన పెద్దలను గౌరవించి ఆదరించినయెడల అభివృద్ధిని పొందుదురు.

## రామ రాజ్యము

శ్లో॥ "ధర్మేణ శాసత స్తస్య హృష్టపుష్టజనాకులా
బభూవ పృథివీ సర్వా ధనధాన్య సమృద్ధినీ.''

"నిర్దస్యురభవ ల్లోకో నానర్థః కశ్చిదస్పృశత్
నచాపి వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే."
"రామో రామో రామ ఇతి ప్రజానామభవన్ కథాః."

—వాల్మీకి.

రాముడు ధర్మమార్గములో రాజ్యమును పాలించుచున్నప్పుడు సమస్త భూమండలము ధనధాన్యములతో పరిపూర్ణమై యుండెను. ప్రపంచములో దొంగలు లేకుండిరి. ప్రజలకు ఏవిధమైన అనర్థములు కలుగకుండెను. వృద్ధులు బాలురకు ప్రేతకార్యములు చేయకుండిరి. ప్రజలు "రాముడు – రాముడు – రాముడు" అని సర్వదా రామనామస్మరణ పూర్వకముగా రామకథలనే చెప్పుకొనుచుండిరి.

క॥ తెలియనిమనుజుని సుఖముగఁ
దెలుపం దగు; సుఖతరముగఁ దెలుపఁగ వచ్చున్
దెలిసినమనుజునిఁ; దెలిసియుఁ
దెలియనినరుఁ దెలుప బ్రహ్మదేవునివశమే ?

—భర్తృహరి.

తే. గీ॥ మొయిళు లనుసానకండ్ల నమ్ములు మరుండు
వాడిసేయఁగ నా జూలవలన రగులు
నింగలపుమిణ్గురులభాతి నెనసి మించు
మించుఁదీవియఁ గాంచుమ ! మించుఁబోఁడి !

—ఆంధ్ర బిల్హణ.

మ॥ "తమముం బాసినరోహిణీవిభుక్రియం దర్పించి, సంసారదుః
ఖము వీడ్కొన్నవిరక్తచిత్తునిగతిన్ గ్రాహంబు పట్టూడ్చి, పా
దము లల్లార్చి, కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం
భ్రమదాశాకరణీకరోజ్ఝితసుధాంభస్స్నాన విశ్రాంతుఁ డై"

— పోతనామాత్యుఁడు.

చ॥ "జగముల నెల్లెడం దురితసంతమసంబు జయింపఁ గోరి పా
ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు; లట్టివారికిన్
దగవు ఘటింప సత్పురుషదత్తము లై చను జీవనంబు లెం
త గుమతు లైన మార్తురె? పదంపడి యాయువు శ్రీయు నొల్లరే ?"

—తిక్కన సోమయాజి.

ఉ॥ ఉన్నది పుష్టి మానవుల కోయదుభూషణ ! అలజాతికిన్
తిన్నది పుష్టి; నీ వరుగుదెంచి రథంబున నున్నఁ జాలు; నే
సున్నముఁ జేసెదన్ రిపులఁ జూపరు లద్భుత మంద; సర్వలో
కోన్నత ! నాకుఁ బే రొసఁగు; మూరక చూచుచునుండు మచ్యుతా !"

—తిరుపతి వెంకటకవులు.

మ॥ మృదురీతిన్ బ్రతివాసరంబు గమి కర్మిభూతనానానదీ
నదకాంతాంపురీశిలోచ్చయుఁడ నై నైకాద్భుతశ్రీజిత
త్రిదివం బైన విదర్భదేశమున నారీరత్నమున్ గాంచితిన్
సదసత్సంశయగోచరోదరి శరత్సంపూర్ణచంద్రాననన్.

— శ్రీనాథమహాకవి.

---

కథానిక:

తెల్లవారింది రోజూలాగే. కాని నరకచతుర్దశి కావడంవల్ల రోజూలాగా కాకుండా ఊరంతా టపాకాయల చప్పుళ్ళతో కోలాహలంగా ఉంది. కాని, ప్రభాకర్ కు మాత్రం రోజూకంటె ఆ రోజు బాధాకరంగా ఉంది. నిద్ర లేచింది మొదలు ఎదురుగా గోడకు ఉన్న ఫోటోవైపుచూస్తూ కళ్ళు తుడుచుకొంటున్నాడు. గాజుల గలగల విని వెనక్కితిరిగి చూశాడు. కాని అతని దృష్టి అక్కడలేదు.

భర్త వాలకాన్ని చూసి శాంత గుమ్మంలోనే నిల్చుండి పోయింది. వెంటనే తమాయించుకొని "అదేమి టండీ! నిద్రలేచింది మొదలు ఆ బొమ్మముందు నిల్చుని విచారించకపోతే, కనీసం ఈ ఒక్క పండుగ రోజన్నా సరదాగా ఉండకూడదూ?" .

ఈ మాటల్లో చివరి వాక్యం మాత్రం వినగలిగాడు ప్రభాకర్. అది విని బాధగా "ఇది పండుగకాదు శాంతా! నా హృదయంలో రగులుతోన్న అగ్నిమంట."

ఏంటో నండీ! మీ ప్రవర్తనను కాపురానికి వచ్చినప్పటి నుంచీ చూస్తూన్నాను నేను. ఇరవై నాలుగు గంటలూ ఆ ఫోటోను చూస్తూ ఏడుస్తూంటారు. దానికి ఇచ్చిన గౌరవంలో నాకు ఒకటవ వంతు ఇచ్చినా నేను సంతోష పడేదాన్ని. ఇది ఇక్కడ ఉంచటం వల్ల నాకు మనశ్శాంతి లభించడం లేదు. అధవా మీరు ఆమెను అంతగా ప్రేమించిఉంటే ఆ విణ్ణే కట్టుకోక పొయ్యారా? నన్ను ఈ విధంగా చిత్రహింస చేయడ మెందుకు? పండుగరోజన్నా మీతో సరదాగా గడుపుదా మన్న నా ఆశ మిమ్మల్ని చూడగానే అంతరించిపోయింది" అని అన్నిరోజులు మదిలోదాచుకొన్న అక్కసునంతా వెళ్ళబుచ్చింది శాంత.

"ఏంటి శాంతా ఆ మాటలు! నీ కేమన్నా మతి పోయిందా. ఈ రోజు నీవు ఇలా మాట్లాడుతున్నా వేంటి? ఆ దేవతనా ఇన్ని మాటలు......"

"ఆ, ఏముంది! అదిమీకు దేవతలాగా కనబడుతోంది. కాని నా పాలిటి రాక్షసి. నా సంసారంలో సుఖం లేకుండా చేస్తోంది." కసిగా అంది శాంత. శాంత మాటలు విన్న ప్రభాకర్ బాధతో కుప్పగా మంచం మీద కూలబడ్డాడు. దుఃఖంలో మాట పెగిలి రాలేదు. అంతలోనే నెమ్మదిగా "శాంతా! నీకు అసలు విషయం తెలుస్తే, తరువాత ఇన్ని మాటలు ఎందుకన్నానా? అని బాధ పడతావు. నీవు నన్ను అర్థం చేసికోగల వనుకొన్నాను. కాని ఆవిడకూ నాకూ సంబంధం అంటగడతా వని అనుకోలేదు."

"ఆ రోజు ఉరికంబం ఎక్కనున్న నన్ను (ఫోటోను చూపిస్తూ) ఈ దేవతే రక్షించకపోతే, ఈ రోజు నీవు పసుపు కుంకుమతో కళకళ్ళాడుతూ ఉండేదానివే కాదు. నీ మాంగల్యాన్ని కాపాడిన దేవతను అనరాని మాటలు అన్నావు. నీకు నిష్కృతి లేదు శాంతా నిష్కృతి లేదు" అంటూ తల బాదుకొన్నాడు ప్రభాకర్.

## కె. నిర్మలా కుమారి

బలవంతాన, వచ్చే ఏడ్పును ఆపుకొంటూ శాంత "అదికాదండీ! రోజూ మీరు పడుతున్న బాధనూ, కంటినీటినీ చూడలేక, భర్త అన్న విచక్షణాజ్ఞానం కోల్పోయి నోటికి వచ్చినట్టల్లా వాగాను. నన్ను క్షమించండి! మీరు క్షమించానని అనకపోతే నాకు ఈ కాస్త మనశ్శాంతి ఉండదు." అంటూ ఏకధాటిగా కారుతున్న కన్నీటిని తుడుచుకొంది.

ప్రభాకర్ శాంతను చూసి "ఛ! అదేంటి శాంతా!! పండుగ పూట ఆ కన్నీళ్ళు!!! అమ్మ ఏమనుకుంటుంది చూస్తే. ఇందులో నీ తప్పేమీలేదు ఏ విషయమూ చెప్పక నాలో నేను బాధపడుతూంటే ఎవరికయినా ఇదే ఊహ కలుగుతుంది. అంతా నాతప్పు. అది ఒక విషాదగాథ..."ఇంకా ఏదో చెబుతూంటే "అమ్మా శాంతా!" అన్న పిలుపు విని "అదుగో అమ్మ పిలుస్తోంది. వెళ్దాం పద" అని శాంత చేతిని పుచ్చుకొని మంచంమీద నుంచి లేచాడు.

"మీకు బాధ కల్గించకపోతే ఆ కథ ఏమిటో తెలియచేస్తారా?" గోడమీద ఉన్న ఫోటోవైపు చూస్తూ అంది శాంత.

"ఇప్పుడుకాదులే! ఎప్పుడైనా చెబుతాను" అంటూ పడకగదిలోనుంచి బయటపడ్డాడు ప్రభాకర్.

* * *

రామయ్యగారిది సంపన్న కుటుంబం. వారి ఇల్లు చూడ్డానికి చిన్నదిగా ఉన్నా ముచ్చటయినది. ఇంటిచుట్టూ పూలమొక్కలతో అందంగా ఉంది. వారికి ఇద్దరే సంతానము, సుధాకర్, భారతి. రామయ్యగారు డ్రాయింగు రూములో కూర్చొని ఏదో వ్రాసుకొంటున్నారు. అది సాయంకాలం.

ఇంతలో బ్రాహ్మడు సుబ్బయ్య ప్రవేశించి "నమస్కారమండీ రామయ్యగారూ!"

రామయ్య తల పైకెత్తి సుబ్బయ్యను చూస్తూ "ఓహో మీరా?... బహుకాల దర్శనం. రండి! రండి!! అలా కుర్చీలో కూర్చోండి" అని ఎదురుగా ఉన్న కుర్చీని చూపించాడు, "అంతా కుశలమా?."

కుర్చీలో కూర్చుంటూ "ఆ! అంతా కుశలమేనండి! ఈ మధ్య నేను ఊళ్లో లేను. పంచాగపు బ్రాహ్మలం కనుక మా అమ్మాయి పెళ్ళి చెయ్యదలచి ఏదో కొంత డబ్బు యాచించడానికి వెళ్ళాను. మీలాటి మహారాజులు కూడా కొంత ఇస్తే... మీకేమండీ! చిన్నతనంనుంచి స్వశక్తిపైనే ఆధారపడి ఈనాటికీ ఇతరులపై ఆధారపడకుండా భూమి మీద వచ్చే ఆదాయముతో దర్జాగా జరుపుకొంటున్నారు. అన్నట్టు! మాటల సందట్లో పడి అసలుసంగతి మరచాను. నేను కాకినాడ వెళ్ళినప్పుడు వకీలు వెంకట్రావు గారు వాళ్ళ అమ్మాయిని, మీ సుధాకరానికి ఇస్తామని మీకు జాబు వ్రాశారట. దానికి మీరు ఇంతవరకూ జవాబు వ్రాయలేదని వారు అన్నారు. ఎలాగైనా మీ సంబంధము చేసికోవాలని వారికి ఆతృతగా ఉందండీ!"

"చూడు సుబ్బయ్యా ! నే నేమి చెయ్యను. మా వాడు నామాట వినకుండా ఉన్నాడు. బి. ఏ. పాస్ అయ్యాడు. కాని ఏం లాభం? చెల్లె లంటే వాడికి ప్రాణం. దాన్ని ఆ విధంగా ఉంచినట్టయితే తానూ వివాహం చేసుకోనని వాడి గోల. నాకూ ఆ అమ్మాయినే కోడలుగా చేసుకోవాలని ఉంది. లక్షణమైన పిల్ల. పైగా చదువూ, సంస్కారమూ కలది కూడాను. ఈ విషయంలో ఏమి చేయాలో నాకు ఏమీ తోచడంలేదు." అంటూ వాపోయారు రామయ్యగారు.

"ఈ కాలపు కుర్రాళ్ళే అంత ! ఏవో ఆదర్శాలంటూ అందరినీ బాధపెడతారు. సంప్రదాయమైన కుటుంబం. చక్కటి పిల్ల. పాటకూడా బాగా పాడుతుంగి. అందుకని మీ అబ్బాయికి నచ్చచెప్పి దీన్ని స్థిరపరచుకోండి. బహుశా వారే మీకు ఇంకో రెండు మూడు రోజుల్లో ఉత్తరము వ్రాస్తూండవచ్చు. ఎంతైనా ఆడపిల్లలు కలవారు కదా? ..." అంటూ ఆగిపోయాడు సుబ్బయ్యశాస్త్రి.

"అది సరేగానీ ! మీ అమ్మాయి పెళ్ళి ముందు ఓమాటు కనబడు" అంటూ లేచాడు రామయ్యగారు.

"అమ్మయ్య ! ఎంతమాట అన్నారండీ ! మీకు తెలియకుండానే వివాహం చేస్తానా ?" అనేసి వెళ్ళిపోతూ సుధాకర్ భారతిలు లోపలికి రావటం చూసి ఆగాడు. వాళ్ళిద్దరూ శాస్త్రిని చూసి, "ఓహో ! పెళ్ళిళ్ళ పేరిశాస్త్రి గారా ? బహుకాల దర్శనం. ఇవే మా నమస్కారములు." సుబ్బయ్యగారు వారిని "శీఘ్రమే వివాహ ప్రాప్తిరస్తు" అని దీవించాడు. లోపలినుండి వారి తల్లి జానకమ్మ "ఏమిటర్రా మీ మాటలు ! మితిమీరి పోతున్నాయి. శాస్త్రిగారిని అలా అనవచ్చా?"

ఆ మాటలు విన్న సుబ్బయ్యశాస్త్రి "చూడండి జానకమ్మగారు ! చిన్నపిల్లలు ఏదో సరదాగాఅన్నారు. ఇదిమాకు మామూలే. అయినా వారి ఇద్దరి పెళ్ళిళ్ళూ నా చేతిమీదేగా జరిగేది. నేను వస్తానమ్మా, నమస్కారం" అని వెళ్ళిపోయాడు.

* * *

రామయ్య లోపలినుండి బయటికి వస్తూ జానకమ్మను చూసి "జానకీ ! ఒకమాటిలా రా !" పూర్తి చేయకుండానే లోపలికి దారితీశాడు. "ఏమండీ ! పిలిచారా !" అంటూ అతన్ని అనుసరించింది జానకమ్మ. "చూడు జానకీ ! సుబ్బయ్యశాస్త్రి వచ్చి, వకీలు వెంకట్రావుగారు మనసంబంధము చేసుకోవాలని చాలా ఆతృత పడుతున్నా రని చెప్పాడు. ఇంతకుముందు వారు వ్రాసిన రెండు ఉత్తరాలకూ మనము జవాబు వ్రాయలేదు. ఈ రోజు ఇంకో ఉత్తరము వచ్చింది. దాంట్లో అతను తన కూతురు మన కోడలు కావటానికి చాలా వుబలాట పడుతున్నా నని వ్రాశారు. ఏ సంగతి తప్పకుండా జవాబు వ్రాయమని మరీ మరీ వ్రాశారు. ఏమని జవాబు వ్రాయాలో నా కేమీ తోచడంలేదు. అంతా అయోమయంగా ఉంది.

"మనం మాత్రం ఏంచేస్తామండీ ! వాళ్ళు అంతగా వ్రాస్తే ఏదో ఒకటి వ్రాయకతప్పదు. అబ్బాయి నడిగి ఏదో ఒకటి తేల్చుకోవాలి !"

"అది సరేగానీ ! అబ్బాయి ఇంట్లో ఉన్నాడా ! నేను ఒకసారి రమ్మన్నానని వాణ్ణిలా పిలు. ఆఁ ! భారతిని కూడా."

"ఇంట్లోనే ఉన్నారు. వాడి స్నేహితుడు ప్రభాకర్‌తో మాట్లాడుతున్నారు. పిలుస్తానుండండి."

"సుధాకర్ ! ఒకమాటిలారా ! నాన్నగారు పిలుస్తున్నారు." అంతవరకూ ప్రభాకర్‌తోటి మాట్లాడుతున్న సుధాకర్, భారతిలను చూసి ప్రభాకర్ "అదుగో ! మీ అమ్మగారు పిలుస్తున్నట్టున్నారు. మన మాటల కేంగాని ! మీరు వెళ్ళండి ! రేపు కలుసుకోవచ్చు. నేను వెళ్తున్నా 'గుడ్ నైట్.' వాళ్ళిద్దరూ 'గుడ్ నైట్' అంటూ లోపలికి దారి తీశారు.

"అమ్మా మమ్మల్ని పిలిచావా ?"

"ఆ ! మీ నాన్నగారు పిలువమంటే !"

"అబ్బాయీ ! ఒక్కమాటు ఈ ఉత్తరం చదువు" అంటూ ఉత్తరాన్ని కొడుక్కు అందించారు రామయ్యగారు.

ఉత్తరాన్ని స్వంతంగా చదివి దాన్ని భారతికి అందించాడు.

"ఒరేయ్ ! సుధాకరం ! సంగతులన్నీ తెలిశాయిగా ! ఈ మాటైనా వారికి జవాబు వ్రాయక తప్పదు. ఆ విషయం నీ సమాధానంపైనే ఆధారపడిఉంది. మనమీదనే వారు ఆశ పెట్టుకొని ఉన్నారు. ఇక నీ ఉద్దేశ్యము ఏమిటో చెబితే......"

"అమ్మా ! చెప్పటానికి ఏముంది ప్రత్యేకంగా. వివాహానికై నా మనస్సు అంగీకరించటంలేదు. వాళ్ళను వేరే సంబంధం చూసుకోమను. ఇంత కంటె ఏమీ చెప్పలేను."

రామయ్య విసుగ్గా "ఇష్టం లేకపోవడానికి కారణం ఏంటిరా? B. A. పూర్తికావాలంటివి. అదీ అయింది. ఏమైనా ఈ సంబంధాన్ని వదులుకోగూడదు."

తండ్రిమాటలకు భారతి కలుగచేసుకొని "అమ్మ నాన్నల మాటను కాదన కన్నయ్యా! నీవు ఒప్పుకోకపోతే వారి మనస్సు బాధపడుతుంది. అదీగాక వదిన వస్తే నాకూ సరదాగా కాలక్షేపము అవుతుంది."

"నీవు మాత్రం చెప్పిన మాట వింటున్నట్టు! అన్నెం, పున్నెం ఎరుగని వయస్సులో వివాహం చేసుకుని పెద్దల పట్టుదలవల్ల సంసార సుఖానికి దూరమైనావు. ఇప్పుడు నీకు 20 ఏళ్లు నిండుతున్నాయి. అయినా నీకు నీ భర్తను చూచుకునేయోగ్యత కలుగలేదు. ఇన్నేళ్ళుగా నీ భర్త జాడే తెలియదు. నీకు తిరిగి పెళ్ళి చేద్దామంటే బొమ్మలనాటి మాటలు చెబుతావు. ఇందులో తప్పుపని ఏమిటో నాకు బోధపడదు. అమ్మా నాన్నాకూడా సమ్మతించారు. నిన్నిలావదిలి నేను వివాహము చేసుకోలేను. నీ వివాహమైనతరువాతే నాదికూడాను" అంటూ అందరి ముఖాలూ చూశాడు సుధాకర్.

"అమ్మా ! భారతీ ! అన్నయ్య చెప్పిన మాటలు నిజం తల్లీ ! నీ మెళ్ళో మంగళసూత్రం చూసుకొని పెళ్ళయిందని అనుకుంటున్నావు. అది బొమ్మల పెళ్ళిలా జరిగింది.

ఎందువల్లంటే మీ బామ్మ తనకు పెద్దతనం వస్తోందని, నీ పెళ్ళి తనకళ్ళతో చూడాలని పట్టు పడితే ముందూ వెనుకలు ఆలోచించకుండా చేసేశాము. ఆమె మాట కాదనలేక. నీవు ఇంకో వివాహము చేసికోవడం వల్ల తప్పేమీ లేదమ్మా !"

మొన్న వచ్చిన సంబంధం అన్నివిధాలా సలక్షణమైనది. అబ్బాయి చదువూ, సంస్కారం కలవాడు; యోగ్యుడు. నీవు ఒప్పుకో తల్లీ ! ఒక్కగా నొక్కకూతురువి మాకూ ఎన్నో ఆశలుంటాయి. నీవు లక్ష్మిలా నట్టింట్లో తిరుగుతూండాలని, నీ విలాఉంటే అన్నయ్య కూడా వివాహము మానుకుంటాడు," అంటూ ఎన్నో విధాల నచ్చచెప్ప బోయారు, రామయ్యా జానకమ్మాను.

వాళ్ళ మాటలకు తలవంచుకుని "నాన్నా ! మీ అందరికీ మనశ్శాంతి లేకపోవడం నా వల్లనే నన్నమాట" బాధగా అంది భారతి.

"అంతమా టనకు తల్లీ. నీ వల్ల మా కేమీ బాధ లేదు." ఖంగారుగా అంది జానకమ్మ.

"అమ్మా ! ఇన్ని రోజులకు అవసరము వచ్చిందికనుక చెబుతున్నాను. సావధానంతో వినండి ! అసలు ఇప్పుడు నా కొచ్చిన లోటు ఏమిటి ? నాకు బాధ కలిగినట్లు మీ రెప్పుడైనా చూశారా ? మీరు చెప్పినట్లుగానే నేను అత్త వారింటిని, నా భర్తను చూడలేదు. ఆనాడు మీరు నాకు అగ్నిసాక్షిగా వివాహము చేసి నన్ను సుమంగళిగాను, ఆదర్శదాంపత్యంతో వర్థిల్లమని మనఃస్ఫూర్తిగా దీవించి వారికి నన్ను ధారపోశారు. దానికి చిహ్నంగా ఈ నాటికీ నా మెళ్ళో మంగళసూత్రా లున్నాయి. ఇప్పుడు ఇది బొమ్మల పెళ్ళే నంటారా ? పవిత్రమైన ఈ బంధాన్ని వివాహము కాదనటం అవమానపరచటం కాదూ ? భారతస్త్రీకి జన్మలో వివాహం, మరణం అన్నది ఒక్కమారే జరుగుతుంది. పెళ్లైన తరువాత భర్త ఎటువంటివాడయినా అతడే తన సర్వస్వమని ఎల్లప్పుడూ అతని ధ్యానములోనే తన జీవితాన్ని గడుపుకొంటుంది భారతనారి."

"అమ్మా ! నేను ఏ ఆశతో జీవితాన్ని సాగిస్తున్నానో నీకూ తెలుసు. చీకటి బంధురమైన నా జీవితంలో భర్త అనే వెలుగును ప్రసాదింప చేస్తాడని ఆ భగవంతుని నమ్మి ఉన్నాను. నా అవసానకాలమందైనా నా భర్తను కలుసుకొంటా ననే ఆశతో బ్రతుకుతున్నాను. దీనివల్లనే అన్నయ్యపెళ్ళి ఆగిపోతే, నావల్ల మీ అందరికీ బాధ కల్గుతూంటే, నేను అడ్డు తొలగుతాను; అంతే. కాని పవిత్రమైన నా మాంగల్యాన్ని మాత్రం అవహేళన చేయకండి" అంటూ బావురుమంది భారతి.

పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ "చెల్లీ ! భారతీ !! నీవు ఎట్టి అఘాయిత్యమూ చెయ్యకమ్మా ! నీ మీద ప్రేమతో ఈ మాటలు అన్నాము. నీవు ఇంకెప్పుడూ అలాటి మాట లనకు. నీ యిష్ట ప్రకారమే కానీయి. నీ సంతోషము కంటె మా కేమి కావాలి ? నేను తప్పకుండా పెళ్ళి చేసుకొంటాను. చూడు, అమ్మా నాన్న ఎంత బాధపడుతున్నారో" అన్నాడు సుధాకర్.

"నాన్నా !" అంటూ తండ్రి కాళ్ళపై బడి ఏడ్చింది భారతి.

కూతుర్ని పైకి లేవదీస్తూ రామయ్య "ఏడవకు తల్లీ! నీవు చిన్నదానివైనా విలువైన మాటలు చెప్పావు. నీలో ఇంత సహనము, ఓర్పు ఉందని తలచలేదమ్మా! నీ పట్టుదలా, శాంతమే నిన్ను నీ భర్త దగ్గరికి చేరుస్తుంది. పెద్దవారికి తగినబుద్ధి చెప్పావు. నీకు ఎప్పుడూ అడ్డు చెప్పను. నీవు సంతోషంగా ఉండు తల్లీ! అంతకంటె ఏమి కావాలి మాకు ?" ... అన్నాడు.

అప్పుడే గుమ్మంలో అడుగిడిన వ్యక్తిని చూసి "అరే వెంకట్రావుగారా ! ఎప్పుడొచ్చారు ఏమిటి ? ఆ కంట్లో నీ రేమిటి ? కంట్లో ఏమన్నా పడిందా ??" అంటూ ప్రశ్నించారు రామయ్యగారు. క్రొత్తవ్యక్తిని చూసి ఆడవాళ్ళిద్దరూ లోనికి వెళ్ళిపోయారు.

పనిమీద వూరికి వచ్చాను. పని తెమల్చుకొనేసరికి ప్రొద్దు పోయింది. దారే కదా - ఒకసారి మిమ్మల్ని చూసిపోదా మని వచ్చాను. ఇంట్లోంచి ఏవో మాటలు గట్టిగా వినబడుతోంటే గుమ్మంలోనే ఆగిపోయా మాటలు వింటూ. నిజంగా మీ అమ్మాయి మాటలు వింటూంటే నా హృదయం ఆనందంతో నిండిపోయిందంటే నమ్మండి ! మీరు చాలా అదృష్టవంతులు. రత్నంలాంటి అమ్మాయి. ఆమె పతిభక్తి ఎంతైనా కొనియాడతగింది. ఆ మాటలు విన్నతరువాత నా కళ్ళగుండా ఆనందబాష్పాలు ధారాపాతంగా ప్రవహించాయి. అన్నట్టు పనిలోపని అనుకొని మా అమ్మాయి వివాహ విషయమై మీతో ముచ్చటించడానికి వచ్చాను. మీ అబ్బాయి ఏమంటున్నాడు." అని అడిగారు వెంకట్రామయ్య.

"మీ ఎదురుగానే అడుగుతా నుండండి వాణ్ణి" అంటూ సుధాకర్‌ను ఏరా సుధాకర్ ! వీరి మాటల కేం జవాబు చెబుతావు ?" ప్రశ్నించారు రామయ్యగారు.

అంతక్రితమే చెల్లెలు చెప్పిన మాటలను మననం చేసుకొంటూన్న సుధాకర్ "మీ ఇష్టమే నా ఇష్టము నాన్నా" అంటూ వెళ్ళిపోయాడు. 'తథాస్తు' అనుకున్నారు వియ్యంకులిద్దరూ.

* * *

"ఏం వదినా ! గుడ్డలు సర్దుకొంటున్నావా ? లేదా ?"

"ఏమో భారతీ ! నాకు నిన్ను వదిలి పోవాలని లేదు ! ఎందు కింత బాధపడుతున్నానో నాకే తెలియదు. అంతా నీ మాహాత్మ్యమేమో ! ఏమయినా పెళ్ళయిన మొదటి సంవత్సరము, అందులోనూ దీపావళి, వెళ్ళకపోతే బాగుండదు ! పోనీ నీవూ రాకూడదూ?" అని అడిగింది భారతి వదిన గిరిజ, పెట్టెమీద కూర్చుంటూ.

"అంత బెంగ దేనికమ్మా ? వదినా ! పండుగరోజు నీవూ అన్నయ్యా మీ పుట్టింట్లో సరదాగా గడపాలిగాని ! నేనుకూడా మీ వెంటవస్తే ఈ ఇంట్లో అమ్మా నాన్నా ఒంటరిగా ఉంటారు. అయినా ఎక్కువ రోజు

లేమీ అక్కడ ఉండబోవడంలేదుగా మీరు ! పండుగ వెళ్ళగానే వచ్చేద్దురుగానిలే, లే ! బట్టలుసర్దు !" అని వదినను చెయ్యిపట్టుకొని లేపింది. "నీలాంటి ఆడపడుచును నాకు ఇచ్చినందుకు ఆ భగవంతునికి కృతజ్ఞతలు అర్పించుకొంటున్నాను,'' అంది గిరిజ ఆడబడుచు చెకిళ్ళు పుణుకుతూ.

భారతి వదిన మాటలకు నవ్వుతూ "నీ పొగడ్తల కేమిగాని అన్నీ సక్రమంగా సర్దుకో, నే పోతున్నా'' వెళ్ళిపోయింది.

తెల్లవారుఝామునే లేచి తలారా స్నానము చేసి మామూలు కటావ్ చీర ధరించి దానిపై తెల్లని బ్లౌజు వేసుకొన్న భారతి ఆభరణాలు ఏమీ లేకుండానే అందంగా ఉంది. పచ్చటి శరీరచ్ఛాయ, వాలుజడలో ఇమిడిన ఎర్రని గులాబీలు తమ జన్మ సార్థకమైనట్టుగా విచ్చుకున్నాయి. కండ్లకు కాటుకా, నుదుట గుండ్రటి ఎర్ర బొట్టూ ఆమె మనోనైర్మల్యాన్ని చాటుతున్నాయి.

"ఏమిటే ! వసుంధరా ? నీ పని ఇంకా తెమలలేదా ?" అంటూ ప్రక్కవీధిలో ఉన్న తన స్నేహితురాలి ఇంట్లో అడుగు పెట్టింది భారతి.

"ఓ ! నీవా భారతీ !! అమ్మకు జ్వరంగా ఉంటే, చెల్లీ అమ్మా హాస్పిటలుకు వెళ్ళారు," అన్నాడు అప్పటిదాకా చదువుతూన్న పేపరును మడుస్తూ వసుంధర అన్నయ్య ప్రభాకర్. "అన్నట్టు ! మీ అన్నయ్య, వదిన ఊరికి వెళ్ళారా ?"

"ఆ ! వెళ్ళారు నిన్న ? మీరు వెళ్ళలేదే మండీ మీ అత్తారింటికి ? అడిగానని ఏమీ అనుకోకండి ! సరే నేను వెళ్తున్నాను ప్రభాకర్ గారూ ! వసుంధర వచ్చాక మా యింటికి ఒకసారి రమ్మన్నానని చెప్పండి. అన్నట్టు ! అమ్మగారికి ఒంట్లో బాగాలేదన్నారు. పండుగ రోజుకదా ! మీ రందరూ మా ఇంటికి ''టీ''కి రండి. సరదాగా ఉంటుంది; వస్తా" అంటూ వెళ్తున్న భారతిని ఆపి ''అంత సరదా కలదానివి దాన్ని పూర్తిగా తీర్చుకోనిస్తావా ఏమన్నానా?" వెకిలిగా అన్నాడు ప్రభాకర్.

"మీ మాటలు నా కేమీ అర్థం కావడం లేదు. నేను తొందరగా వెళ్ళాళి అదేంటో విశదంగా చెప్పండి."

"అంత తొంద రెందుకు భారతీ ! నా మనసులోని మాట చెప్పమంటవా ?"

"మీ మాటలు చాలా వింతగా ఉన్నాయి ఈ రోజు. త్వరగా చెప్పండీ !" అదుర్దాగా అడిగింగి భారతి.

"భారతీ ! నీవు ఈ వయస్సులో ఎంతో సరదాగా కాలము గడపాల్సింది పోయి జీవిత మంతా అడవి గాచిన వెన్నెల చేస్తున్నావు. ఇప్పటికయినా మించిపోయింది ఏమీలేదు. నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను నేను వివాహం చేసుకొంటాను. దీనికి నీవు తప్పక అంగీకరిస్తా వనుకుంటాను. లేకపోతే జీవితాంతమూ ఒంటరిగా ఎలా గడపగలవు?"

"ఛీ ! ఛీ ! మీ కేమన్నా మతి పోతోందా ఏంటి ! మా అన్నయ్య ఫ్రెండువనీ, అన్నయ్యతో సమానమైన వాడవనీ మీకు చనువచ్చినందుకు తగిన ఫలితాన్నే అనుభవిస్తున్నాను. వసుంధరతో సమానంగా నన్నూ ఎంచుకుంటారని అనుకొన్నాను కానీ ఈ విధంగా మీ అంతర్యం కలుషిత మైనదని కల్లోకూడా అనుకోలేదు. వివాహితుడవైన మీకా ఈ పాడు బుద్ధి?" కోపంతో, బాధగా అంటూ వెళ్ళబోయింది.

ఒక్కఉదుటులో భారతి చెయ్యిని పట్టుకొని "భారతీ ! నిన్ను వదలి నేను జీవించలేను. నన్ను కాదనకు"

"ఛీ ! దుర్మార్గుడా !! ఒంటరిగా చిక్కానని మితిమీరుతున్నావు. నన్ను వదులుతా వా లేదా?" ఎంత పెనుగులాడినా చెయ్యి వదలక పోయేసరికి చేతిమీద గట్టిగా కొరికి చెయ్యి వదిలించుకొని పారిపోయింది.

"అబ్బా ! అని రక్తం కారుతూన్న చేతిని చూసుకొంటూ కుర్చీలో కూలబడ్డాడు ప్రభాకరు. ఏదో తీవ్రమైన నిర్ణయానికి వచ్చినట్టు అతని మొహం వికృతంగా మారిపోయింది. "హు ! పతివ్రతట !!" కసిగా అనుకొన్నాడు.

* * *

ఎంత సేపటికీ కూతురు రాకపోయేసరికి వాకిట్లో ఎదురుచూస్తూ నిల్చుంది జానకమ్మ. అప్పుడే వచ్చిన భారతిని చూసి "ఇంత సేపూ ఎక్కడికి వెళ్ళావే ? పండగపూట ! నాన్నగారు భోంచేయకుండా నీ కోసం ఎదురు చూస్తున్నారు. త్వరగా కాళ్ళు కడుక్కొనిరా ! వడ్డిస్తాను అందరికీ !"

"ఆ ! వసుంధరావాళ్ళఇంటి కెళ్ళానమ్మా ! నా కిప్పుడు ఆకలిగా లేదు !" తల్లినుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూ అంది.

అదేమిటే ! పండుగపూట ఆకలిగా లేదంటావూ? అయ్యో ! కళ్ళెందుకంత ఎర్రబడ్డాయి...?"

"తలకాయ నొప్పిగా ఉందమ్మా. అంతే; ఇంకేమి లేదు" సమాధానం ఇచ్చింది భారతి.

"నే చెప్పిందివిన్నావా? ముగ్గులుపెట్టడం, ఇల్లు సర్దడం అన్నీ నీవే చేస్తివి. పనివాళ్ళు చేస్తారంటే ఒప్పుకోకపోతివి? శరీరం అలసిపోయింది. చూడమ్మా ! పండగపూట నీకు బాధగా ఉంటే మాకు మాత్రం ఏం తోస్తుంది చెప్పు ?"

"గట్టిగా అరవకమ్మా ! నాన్నగారు వింటారు. అయినా నా కేమీ ఎక్కువ బాధగా లేదులే ! పద భోంచేద్దాం" అంటూ లోపలికి దారి తీసింది అయిష్టంగానే.

* * *

అస్తవ్యస్తంగా ఉన్న మనస్సుతో, దేవాలయంలో భగవంతుని దర్శనం చేసుకొంటేనన్నా మనఃశాంతి కలుగుతుందనే ఉద్దేశంతో, సాయంకాలం గుడికి బయలుదేరింది భారతి.

ఆభరణాలన్నీ అలంకరించుకోమని పోరు చేస్తున్న తల్లి మాటను కాదనలేక సాధారణంగా అలంకరించుకొని టెరిలిన్ చీర, పట్టు జాకెట్టూ తొడుక్కుంది. వాలు జడలో మల్లెపూలు.

సాధారణంగా అందమైన భారతిని అలంకారంలో చూసి జానకమ్మ "ఇంత అందమైన, సుగుణాలరాశికి భర్తతో ఎడబాటు కలిగించావా భగవాన్" అనుకొంటూ కళ్ళు తుడుచుకొంది.

"అమ్మా ! నేను గుడికి వెళ్లొస్తాను" తల్లితో అంది భారతి.

"ఇప్పు డేమి గుడే ? ఏడు కావస్తోంది. అందులో అమావాస్యచీకటి. ఆకాశం కూడా మబ్బులతో నిండి వర్షం పడేట్టుంది ! రేపు వెళ్ళవుగానిలే !"

"అదేమిటమ్మా ? దైవదర్శనానికి ఒక వేళంటూ ఉంటుందా ? అయినా నాలుగు ఫర్లాంగులే కదా ! తొందరగా తిరిగి వచ్చేస్తాలే !"

"నీ యిష్టం ! నే చెబితే వింటావా ? ఏమన్నానా ? సరేకాని పనిమనిషి వెంకిని తీసుకెళ్ళి త్వరగా రా !"

"అలాగేమ్మా !" వెళ్ళిపోయింది భారతి.

దేవాలయానికి వెళ్ళాలంటే మామిడి తోపు దాటి వెళ్ళాలి. ఆ ప్రదేశం సామాన్యంగా నిర్మానుష్యంగా ఉంటుంది. అప్పుడప్పుడు మనుష్యులు వెడుతూంటారు.

తోటలోవెంకిని వెంటపెట్టుకొని దేవదర్శనం చేసుకుని తిరిగివస్తోంది భారతి. ఆమె మనస్సు పరిపరి విధాల ఆలోచిస్తోంది. ఇంతలో భారతి అబ్బా ! అంటూ క్రిందికి ఒరిగిపోయింది. వర్షంకూడా ఆరంభమైంది. కటిక చీకటి. ఆమె కేకవిని పక్కగా నడుస్తున్న వెంకి తిరిగిచూసింది.

"అయ్యో ! అదేమిటమ్మా పడిపోయారు ? కాలు జారిందా ? అమ్మో ! ఇదేంటి వీపులో గట్టిగా తగులుతోంది. బాబోయ్ ! కత్తి ! ఎవ్వరో దుర్మార్గులు ఈ పని చేశారు. "ఇప్పుడేమి చెయ్యడం ?" ఏడుస్తూ కూలబడింది వెంకి.

బాధ భరించలేక "అబ్బా" అని మూల్గుతూ "వెంకీ, నాకు కళ్ళు తిరిగిపోతూన్నాయి, ఏడుస్తూ ఎందుకు కాలయాపన చేస్తావు ? వెంటనే వెళ్ళి ఇంటినుంచి ఎవ్వరినయినా పిల్చుకొనిరా, వెళ్ళు త్వరగా."

ఏడ్చుకుంటూ వెంకి పరిగెత్తింది ఇంటి వైపుగా.

మామిడిచెట్ల చాటునుంచి బయటికి వచ్చి మూల్గుతూన్న భారతిప్రక్కన "భారతీ" అని అరుస్తూ కుప్పలా కూలాడు ఒక వ్యక్తి. మెల్లిగా కన్నులు తెరచి "ఎవరూ ? ఓ ! మీరా ప్రభాకర్‌గారూ ! ఆ భగవంతుడే మిమ్మల్ని పంపించాడు." ఉదయపు సంఘటనను జ్ఞాపకం చేసుకొంటూ "నన్ను క్షమించన్నయ్యా ! ప్రొద్దున నేను చేసిన అపరాధానికి !"

"చెల్లీ ! నేను నీ పాదాలను తాకేందుకు కూడా అర్హుణ్ణికాను. మనిషినై యుండికూడా రాక్షసునివలె ప్రవర్తించాను. ఈ దారుణానికి కారణం నేనేనమ్మా ! నేనే" తల బాదుకొన్నాడు ప్రభాకర్.

"ఏం టన్నయ్యా ! ఆ మాటలు ! నీకేమైనా పిచ్చెక్కిందా ఏంటి ? నీవు నా బాధను చూడలేక ఇలా మాట్లాడుతూన్నావా ?" ఆయాసంగా అంది భారతి.

"భారతీ !" భోరుమని విలపిస్తూ ప్రభాకర్. "లేదమ్మా ! నీవు సుగుణాలరాశివి. అందుకనే ఎప్పటికైనా నీ భర్తను చూసుకోగలవనే ఆశతో జీవిస్తున్నావు. అటువంటి నిన్ను, నీ కోమల శరీరాన్ని నేను నా కత్తిపాలు చేశాను. నీ వేమో నన్నింకా మంచివాడుగా భావిస్తున్నావు. నా యీ పాపానికి నిష్కృతి లేదమ్మా ! నిష్కృతి లేదు" అన్నాడు.

అంతలోనే ఏదో చటుక్కున జ్ఞాపకం వచ్చి "చెల్లీ ! నేను చేసిన ఈ దారుణాన్ని పోలీసులవద్ద ఒప్పుకొని శిక్ష అనుభవిస్తాను. అప్పుడుకాని నాకు మనశ్శాంతి కలుగదు" గంభీరంగా అన్నాడు.

అంత బాధలోనూ ఉలిక్కిపడి "అన్నయ్యా, ఈ అవసానదశలో ఒక్క కోరిక కోరుతాను. కాదనవుకదూ ! అలాగని చేతిలో చెయ్యి వెయ్యి."

"కోరుకోమ్మా ! నీ మాట తప్పక శిరసావహిస్తాను." అంటూ భారతి చేతిలో చెయ్యి వేశాడు.

సమయము గడచినకొద్దీ బాధ ఎక్కువవుతోంది భారతికి. ఇంటినుంచి ఇంకా ఎవ్వరూ రాలేదు. వెంకి ఏమని చెప్పిందో ఏమో ? ఇవన్నీ ఆలోచిస్తూ త్వరత్వరగా "అన్నయ్యా ! నీ వివాహమై ఆరునెల్లు కూడా కాలేదు. నీవు ఉండబట్టే నీ భార్య జీవితం సుఖంగా ఉంది. ఏనాడు చేసుకొన్న పాపమో, నన్ను నా భర్తనుండి దూరం చేసింది. వారిని ఇక కలుసుకొంటా నన్న ఆశలేదు. నేను ఎలాగూ జీవించను." పోటు అధికంగా ఉన్నా, ఓర్చుకొంటూ "నా కొరకైనా భర్తృవియోగము ఎలాంటిదో తెలిసీ, సాటిస్త్రీ ఆ బాధకు లోనవ్వడం నేను సహించలేను. నీవు నీ భార్యకొరకైనా ఇతరులకు నా మీద ఏలాంటి అనుమానమూ కలుగకుండా ప్రవర్తించమని నీ సోదరిగా కోరుతున్నాను." ఏదో పాదాల చప్పుడు విని మరికాస్త నెమ్మదిగా "మాట్లాడవేం ? అన్నయ్యా ! చేతిలో చెయ్యికూడా వేశావు, మరువకు. ఇదే నీకు నేను విధించే శిక్ష." ఆయాసం ఎక్కువవుతోంది.

భారతి తల్లీ, తండ్రీ, ఇంకో ఆగంతకుడు ప్రసాద్ గబగబా భారతి పడిఉన్న చోటికి వచ్చారు. టార్చ్‌లైటు భారతిమీద వేసి "అమ్మ బాబోయ్ ! రక్తము ధారలుగా ప్రవహిస్తోంది. చూడలేకుండా ఉన్నాను" అంటూ విలపించారు రామయ్యగారు. అందరూ ఆ దృశ్యాన్ని చూసి నోరు వెళ్ళబెట్టారు.

వీరందరినీ టార్చ్‌లైట్లోనే గుర్తించిన ప్రభాకర్ "త్వరగా ఇంటికి తీసుకొని వెళదాము రండి" అన్నాడు దుఃఖంగా.

అంతదాకా ప్రభాకర్ ఉనికే తెలియని వారు "ఎవరు నీవు ?" అని అడిగారు.

"నేనండీ ! ప్రభాకర్‌ను. గుడినుంచి వస్తూంటే ఏదో మూలుగు వినబడి, వచ్చి

చూస్తే భారతి. ఏ విధంగా ఇంటికి తీసుకుపోవాలా అని బాధపడ్తున్నాను."

ఇంకా ఎక్కువ ఆలస్యం చేయకుండా భారతిని, తాము వచ్చిన కారులో పడుకోబెట్టి ఇంటికితీసుకొచ్చారు.

"కత్తి ఎడమవైపులో బలంగా గ్రుచ్చుకొంది. రక్తము చాలా పోయింది" అని అన్నాడు డాక్టర్ భారతికి ఇంజక్షన్ ఇస్తూ. భారతి మంచంమీద ఉదాసీనంగా పడుకొని ఉంది. గాయం తగిలినచోట బాండేజ్ కట్టారు. అంతా భారతి చుట్టూ చేరారు. ఆగంతకుడు ప్రసాద్ భారతి తలవైపుగా కూర్చొని భారతి తల నిమురుతున్నాడు. స్పృహలేదు భారతికి.

అప్పుడే డాక్టర్ఇచ్చిన ఇంజక్షన్వల్ల భారతికి కొద్దిగా స్పృహ వచ్చింది కళ్ళు విప్పి ఒక్కసారి అందరినీ చూసింది. తన తలవద్ద కూర్చున్న ఆగంతకునివైపు "ఎవరన్న"ట్టుగా ప్రశ్నార్ధకంగా చూసి కళ్ళు బరువెక్కడంతో మూసుకొంది. "పండుగ రోజు ఎవర్నీ బాధపెట్టకూడదని అయిష్టంగానైనా అలంకరించుకొని, దేవాలయానికి వెళ్ళినందుకు ఇదా ఫలితం? అమ్మా! భారతీ!! ఒక్కపెట్టున ఏడ్చింది జానకమ్మ, కన్నకూతురు బాధచూడలేక!!

ష్! నువ్వూరుకోజానకీ! ఏడుస్తోన్న జానకమ్మను వారించి భారతితో నెమ్మదిగా "అమ్మా! చీమకైనా హాని తలపెట్టని నీకు ఇంత దారుణాన్ని తలపెట్టిన ఆదుర్మార్గుడెవరు? చెబితే వాణ్ణి నిన్నీ విధంగా చేసినందుకు చిత్రవధ చేయిస్తాను! అన్నట్టు! అదుగోనమ్మా నీ భర్త" ప్రసాద్వైపు చూపిస్తూ "నిన్ను తనతో తీసుకువెళదామని వచ్చాడు. రాకరాకవచ్చి నిన్నీ స్థితిలోచూస్తూ ఎంత బాధపడ్తున్నాడో చూడమ్మా! అడుగో నీ తలవైపు కూర్చుని!" అంతవరకూ కళ్లు మూసుకుని అందరిమాటలు వింటున్నభారతి భర్తపేరు వినగానే చటుక్కున కళ్ళుతెరచి భర్తవైపు ఆనందంగా చూసింది.

"ఎన్నో ఆశలు పెట్టుకొని వచ్చాను! నన్ను విడిచివెళ్ళకు భారతీ!" భారతి తల మీద తలపెట్టి బావురుమన్నాడు ప్రసాద్.

భారతి గట్టిగా శ్వాస వదలి "హే భగవాన్! నా చివరికోరిక తీర్చావు! నా కళ్ళతో నా భర్తను చూసుకొన్నాను. అదే పదివేలు" అంటూ మనస్సులోనే భగవంతునికి నమస్కరించింది.

దగ్గరగా ఉండి భారతి మాటలు విన్న డాక్టర్. "అలా అనకమ్మా! ఇంతకూ నీపై కత్తి విసిరిందెవరు? చాలాబలంగా విసిరారెవరోగాని! రక్తం చాలా నష్టమయింది. అయినా నా శాయశక్తులా ట్రీట్ చేస్తాను" అన్నాడు.

"డాక్టరుగారు! మీరు నాపై అభిమానంతో అలా అంటున్నారు! మీరు ఇలాటివి ఎన్ని చూడలేదు చెప్పండి. ఈపని చేసిందెవరో నాకు తెలియదు. అంతా కారుచీకటి. నాకేమీ కనబడలేదు. అయినా పుట్టినవారు గిట్టక మానరు. ఇక నేనుకూడా బ్రతికి బయటపడేది లేదు. అనవసరంగా నిరపరాధులను శిక్షించి నాకు మనఃశ్శాంతి లేకుండా ఎందుకు చేస్తారు? ఇలా చెయ్యవద్దని నాకోరిక" అన్న భారతి మాటలకు అడ్డొచ్చాడు ప్రసాద్.

"భారతీ! నీ మాటలు వినలేకుండా ఉన్నాను. నేను ఎన్నో ఆశలతో వచ్చాను. భగవంతుడు నన్ను అన్ని విధాలా నిరాశపరుస్తున్నాడు. లేకపోతే ఒకసారి నిన్ను వివాహము చేసుకొన్న తరువాత, కట్నానికి ఆశపడి యవ్వనంలో మరొక వివాహం చేసుకొమ్మని నన్ను బాధపెట్టడమేంటి? నిన్ను తీసుకొచ్చుకొందామా అంటే నన్ను పోషించుకోలేని నేను, నిన్నూ బాధపెట్టడమెందుకని ఇంట్లోంచి పారిపోయి సైన్యంలో చేరాను. మొన్న చైనా యుద్ధంలో ప్రాణాలను లెఖ్ఖచెయ్యక పోరాడిన నా సాహసాన్నీ, ధైర్యాన్నీ చూసి మెచ్చుకొని ప్రభుత్వంవారు నాకు ఒక ఉద్యోగం ఇప్పించారు. యుద్ధంలో బాగా గాయపడ్డంవల్ల అవన్నీ తగ్గేదాకా రావడానికి వీలుపడలేదు. కొండంత ఆశతో నీకు ఈ శుభవార్త తెలియచేద్దామని వచ్చిన నన్ను నీ యీ పరిస్థితి దుఃఖంలో ముంచివేసింది." కన్నీళ్ళను తుడుచుకొంటూ "నాకు తెలుసు భారతీ! నీవు నా తప్పిదాన్ని క్షమించవని! అయినా మిమ్మల్నందరినీ క్షమాపణ అడుగుదామనే వచ్చాను కాని..." దుఃఖంలో మాటరాక ఊరుకుండిపోయాడు ప్రసాద్, భారతి భర్త.

బలవంతంగా వస్తున్న కన్నీళ్ళను ఆపుకొంటూ "భర్తనోటిని తనచేత్తో మూస్తూ "అలా అనకండి! ఇంతవరకూ మిమ్మల్ని చూడలేదు నేను. ఏమీ కోరలేదు. బాధ అధికంగా ఉంది. ఇక ఎంతకాలమో జీవించను. జీవితంలో మిమల్ని ఒక్కసారి చూడాలని మనసారా కోరుకొన్నాను. అదీతీరిపోయింది. పోతే భార్యగా నా కడసారి కోర్కెగా మిమ్మల్ని ఒకటి కోరుతాను. తప్పక తీరుస్తానని నా చేతిలో చెయ్యి వెయ్యండి." నెమ్మదిగా చేతినిచాపింది, భర్తవైపుకు బాధగా భారతి. చేతిలో చేయివేసి "నీకోరిక ఏమిటో నాకు తెలుసు భారతీ! నన్ను తిరిగి వివాహం చేసుకోమంటావు! అంతేనా? నా హృదయంలో వివాహమయిననాటినుండీ నీ పవిత్రమూర్తినే దాచుకొన్నాను. ఆ స్థానాన్ని వేరొకరు ఆక్రమించరు! ఆక్రమించలేరు!! పేరుకు పెళ్ళిచేసుకొన్నాము. కాని, కలసి జీవించేదేమీలేదు. పవిత్రభారతదేశానికి సేవ చేయడమే నాకోరిక. అయినా నీవు ఇలాంటి అశుభాలు పలుకకు భారతీ!" అన్నాడు ప్రభాకర్.

ఇంతలో భారతి అన్నావదినలు గాభరాగా గదిలోకి ప్రవేశించి, ఒక్కఉదుటులో భారతి దగ్గరకు చేరారు. "అమ్మా! నిన్నీస్థితిలో చూడవలసివచ్చిందా! డాక్టరుగారూ! మా భారతిని ఎలాగైనా బ్రతికించలేరా! వారిలో దుఃఖం కట్టలు తెంచుకు ప్రవహించింది. టెలిగ్రాం చూసినప్పటినుండి వాళ్ళకు మనసులో మనసు లేదు. ఉన్నపళంగా బయలుదేరి వచ్చినట్టు వాళ్ళ మొహాలే చెబుతున్నాయి.

డాక్టరు మౌనంగా కళ్లుతుడుచుకున్నాడు.

క్షణ క్షణానికీ క్షీణిస్తున్న భారతిగుండె చలనాన్ని గమనిస్తూ. ''అబ్బా! బాధ!! భరించలేను! దీనకంఠంతో భారతి అన్నా వదినలను చూసి "ఎందు కన్నయ్యా అలా విలపిస్తారు? అలా ఒకమాటు అమ్మనూ నాన్ననూ చూడండి. వాళ్ళు ఈకాస్తకే ఎలా అయిపోయారో! వదినా యిక నీవేనమ్మా వాళ్ళకు కోడలైనా, కూతురైనా. అయినా నేను కూతురుగావాళ్ళని సుఖపెట్టిందేమీలేదు. మరింత మనశ్శాంతి లేకుండా చేశానేకాని. భారతిమాటలకు అడ్డువస్తూ అన్నయ్య సుధాకర్ ''అలా అనకమ్మా! నిన్నీస్థితికి తెచ్చిన ఆ దుర్మార్గుడెవరు? వాణ్ణి ఉరి కంబానికి ఎక్కిస్తేగాని నాకు మనశ్శాంతి ఉండదు." ఆవేశంగా అన్నాడు.

భారతి పేలవంగా నవ్వి...ఆవేశపడకు అన్నయ్యా! నాకు కాలము సమీపిస్తోంది. ఎక్కువగా మాట్లాడలేను. భారత దేశానికి అవతార పురుషుడై జన్మించిన మన బాపూజీ దేశసేవకై కంకణము కట్టుకొన్నాడు. అంతటి వీరపుషుడూ ఒక దుర్మార్గుని తుపాకీకి బలియైనాడు. బానిసత్వాన్ని రూపు మాపేందుకై జన్మించిన కెనడీ తన మరణం ఎప్పుడు సంభవిస్తుందో తలచలేక పోయాడు. అట్టివారికే బాధలు తప్పనప్పుడు ఇక మన మెంత? అంతా విధివిలాసం. భర్త ఎడబాటుతో నాజీవితమంతా గడచిపోయింది. భగవంతునిదయవల్ల వారిని నా చివరిదశలో కలుసుకొన్నాను. నాకోరికతీరింది. మీఅందరి సమక్షంలో శాంతిగా వెళ్ళిపోతున్నాను. అబ్బా!" గుండెను చేత్తో పట్టుకొని ప్రక్కకు ఒరిగింది—'భారతీ'! అంతా గొల్లుమన్నారు.

ఆకాశంలో ఒకతార రాలిపోయింది. పంజరంలోని పక్షి ఎగిరిపోయింది, పంజ రాన్ని వదిలి.

* * *

ఇదీ శాంతా! అసలుకథ! కన్నీళ్ళు తుడుచుకొంటూ ''ఈమె త్యాగమూర్తి కాదంటావా?" అంతదాకాశిలాప్రతిమవలె నిల్చుండిపోయిన శాంత బలవంతంగా చైతన్యం తెచ్చుకొంటూ "ఇంతటి పుణ్యమూర్తిని బలిగొన్న ఆ కిరాతకు డెవరండీ! అయినా వాడికి చేతులెలా వచ్చాయి? ఒక కోమల కుసుమాన్ని త్రుంచేందుకు!" అంది.

"నీ భర్త రూపంలో ఎదురుగా నించున్న నేనే ఆ హంతకుణ్ణి! ఆ ప్రభాకరే ఈ ప్రభాకరూనూ. నీవు ఏ శిక్ష విధించినా సిద్ధంగా ఉన్నాను భరించడాన్కి! అందుకే దీపావళి అందరికీ ఆనందాన్నిస్తుంది. కాని నాకు ఆ బాణాలు భగభగ మంటలను రేపుతుంటాయి హృదయంలో."

"ఆఁ! మీరా!?" ఆశ్చర్యంగా అంది.

''అవును శాంతా! నేనే! ఈ ఫోటోలోని ఆమె చిరునవ్వు మోము చూసినప్పుడల్లా నాకు పాత జ్ఞాపకాలు వచ్చి బాధపెడుతోంటాయి. అదే మనఃశాంతిగా ఉంటుంది."

తమాయించుకొని నెమ్మదిగా భర్త దగ్గరకు వచ్చి "బాధపడి లాభంలేదు. పశ్చాత్తాపమే పాప పరిహారము. మీరు ఎటువంటి వారయినా మీ అడుగుజాడల్లోనే నడవడం సతి అయిన నా ధర్మం'' ఫొటో వైపు చూస్తూ ''అమ్మా భారతీ! నీవు ఇంతటి త్యాగమూర్తి వనుకోలేదు. నీ విలువ తెలీక ఇష్టమొచ్చినట్లు వాగాను; నన్ను క్షమించవూ! పరలోకంలో ఉన్న నీ మనశ్శాంతికొరకై నేను నిన్ను అనుక్షణం తల్చుకొంటూంటాను'' గద్గద కంఠంతో అంది శాంత.

''శాంతా!" అక్కున చేర్చుకొన్నాడు ప్రభాకర్ నీ ''వెంత మంచిదానివి?"




"మీరే కదూ—మాష్టారూ...ఇండియామీద వ్యాసం వ్రాయమన్నారు...

# మహాభారతములో అంబ విచిత్రపాత్ర

మృత్యుంజయ

మన ప్రాచీన నాగరికత కునికిపట్టులైన పురాణములలో కొందఱు స్త్రీలు ఉత్తమమైన కీలకపాత్రలు వహించి ఉన్నారు. వారిచరిత్రలు పునశ్చరణ చేసుకుంటే ఆ కాలములో వారికి ఉన్న విలువ, శక్తిసామర్థ్యాలు వారి ప్రత్యేకత. కార్యశూరత్వము మనకు ముదము, ఆశ్చర్యము కలిగించకమానవు. అప్పటి సాంఘిక వ్యవస్థలో స్త్రీ ఎంతటి కీలక స్థాన మాక్రమించగలిగినదో అవగాహన మవుతుంది. అటువంటివారి చరిత్రలు యనేక యుద్గుణాలను చాటుతూ, ఒక విధమైన నీతిబోధతో నిత్యనూతనముగా ఉంట వనుటలో రవంతైనా సందేహములేదు.

పంచమవేదమని ప్రశస్తిగాంచిన మహాభారతములో 'అంబ' అనే స్త్రీ లేకుంటే ఆ భారతము ప్రస్తుతము మనము చెప్పుకునేట్లు ఉండేదికాదు. మరి ఏ విధముగా అంతమై ఉండేదోకూడ యిప్పు డూహించలేని విషయము. మహాభారతము గతినే నిర్దేశింపగలిగిన అంబ చరిత్ర నిజముగా విచిత్ర మైనదే.

అంబ, అంబిక, అంబాలికలనే సోదరి త్రయము భీష్ముని కాలములో గల కాశీ రాజు కుమార్తెలు. అంబమనోరీత్యా సాళ్వుడనే రాజుకు భార్య కాగోరింది. అయితే ఆమె మనోనిశ్చయము గ్రహించని తండ్రి ఏర్పరచిన ఇచ్ఛాస్వయంవరమునకు చెల్లెండ్రతో పాటు హాజరయింది. ఆ స్వయంవరానికి వచ్చిన సాళ్వుని వరించా లని ఆమె యిచ్ఛ. అది యిచ్ఛాస్వయంవరము కాబట్టి ఆమె ఆశ సహజమైనదే.

కాని మహావీరుడైన భీష్ముడు తన సవతితమ్ముడైన విచిత్రవీర్యునకు వరాన్వేషణలో అక్కడికి రావడముతో యిచ్ఛాస్వయంవరము కాస్తా వీర్యశుల్కముగా మారిపోయింది. సాళ్వాది సమస్త రాజులను అనాయాసముగా జయించి భీష్ముడు ఆముప్పురను తనవెంట తీసుకెళ్లాడు. అంబ ఊహించని సంఘటన జరిగినప్పటికి వెంటనే భీష్మునితో తన మనస్సు విప్పిచెప్పడానికి అవకాశము లభించక, అదను చిక్కిన తరువాత తన కోరిక తెలియజేసింది. భీష్మునంతటి ధర్మవేత్త ఎవరు? అన్యుని కాంక్షించిన స్త్రీని తన సోదరునికి ఎట్లా వివాహము చేస్తాడు? వెంటనే బ్రాహ్మణులతో సగౌరవముగా ఆమెను సాళ్వునొద్దకు పంపేశాడు. అయితే లోగడ భీష్మునిచే పరాభవము పొందిన సాళ్వుడు అంబను చేకొనుటకు నిరాకరించడముతో ఆమె గతి అధోగతి అయింది.

ఆమె యిటు పుట్టినింటికి కాక పోయింది. మెట్టేందుకు యిల్లే లేక పోయింది. తను నమ్మిన ధర్మమునందు దృఢముగా నిలచి ఉండే భీష్ముడు ఆమెకు మార్గము చూపించలేదు. అంబ రెంటికి చెడిన రేవడి అయింది. ప్రేమించిన పురుషుని వివాహమాడే హక్కు స్త్రీకి గలదని, అన్యపురుషాసక్తిగల స్త్రీని వేరొకరి కియ్యరాదని గ్రహించిన భీష్ముడు యామెదృష్టిలో తన జీవితము భగ్నము చేసిన దోషి అయ్యాడు.

స్త్రీ సహజమైన ఆర్ద్రత పట్టుదలగాను, క్షమ కోపముగానూ, మార్దవము మూర్ఖతగాను ఆమెలో ప్రతిఫలించినవి. తను ఎట్లైనా భీష్ముని సాధించాలని నిశ్చయానికి వచ్చింది. అయితే తాను అబల. భీష్ముడానాటి రాజలోకములో ఏకైక అసహాయశూరుడు. అతన్ని జయించి తన పరాభవాన్ని బాపగలిగేవా రెవరూ లేరు. ఈ విషయంలో తానెవరిని అర్థించినా తన కోరిక నెరవేరదని గ్రహించింది అంబ. ఇక తనంతటతానే సాధించాలి. అందుకు వలసిన శక్తిసామర్థ్యాలు సాధించడానికి తపస్సు ఒకటే మార్గము.

తపోసాధనకాలవాలమైన ఒక ముని పల్లెజేరి యచ్చటి వారికి తన వృత్తాంత మంతా ఎరిగించి తపోదీక్ష కోరింది అంబ. అదే సమయమునకు ఆమె మాతామహుండైన 'హోత్రవాహనుడు' (వానప్రస్థాశ్రమములోనున్న రాజర్షి) వచ్చి, భీష్ముని గురువైన పరశురామునిద్వారా అతనికి శాస్తి చేయిస్తానని ఆమెకు భార్గవ రాముని ప్రాపకము కలిగించాడు.

పరశురాముడు భీష్ముని హెచ్చరించి గుర్వాజ్ఞగా అంబను విచిత్రవీర్యునకిచ్చి వివాహము చేయమని కోరాడు. అది ధర్మవిరుద్ధము కనుక తాను చేయజాలనని భీష్ముడు నిష్కర్షగా చెప్పడముతో గురుశిష్యుల వ్యవహారము బెడిసింది. గురువునాజ్ఞ శిష్యుడు చెల్లించాలి అనే తప్ప పరశురాముడు యన్యథా విచారించలేదు. అధర్మము చేయమంటే గురువునైనా దిక్కరించేంతటి ధర్మనిష్ఠ భీష్మునకుందని పరశురాముడు గ్రహించలేదు. తన దోషము ఏమీలేదని భావించిన భీష్ముడు గురువు కోరిన రెండవ కోరికకు మాత్రము సమ్మతించాడు. అదే యుద్ధము. విభిన్న ధర్మముల మధ్య సంభవించిన మహోగ్రసమరము.

అంబ కారణముగా గురుశిష్యులకు

అపూర్వమైన అమోఘమైన సమరము సంభవించింది. గెలుపోటములు లేక ఆ మహనీయు లిరువురు ఇరువది రెండు రోజులు ద్వంద్వయుద్ధము చేశారు. అది అసలు గురుశిష్యుల సంగ్రామ మనుట కంటె రెండు విభిన్న ధర్మముల సంఘర్షణనుటే ఉచితము. అయితే భీష్మునకు, సమ్మోహనాస్త్రము లభించడము వలన ముయ్యేడు మారులు భూప్రదక్షిణ చేసి రాజనామాంకితులందర్ని వధించి అపజయమనేదేమిటో ఎఱుగని భార్గవ రాముడు చివరికి తన ఓటమి అంగీకరించక తప్పలేదు.

పరశురాముని వలన కూడ తన కోరిక నెరవేరక పోయేసరికి అంబ స్వయంకృతముపై పూర్తిగా ఆధారపడింది. తనే భీష్ముని సాధించాలని నిశ్చయించింది. జన్మాంతరమున నైన భీష్ముని కడ తేర్చాలన్నదే ఆమె దృఢదీక్ష. ఆమెకు పరమశివుడే దృష్టిలో నిల్చాడు. మహా ఘోరమైన తపస్సు సల్పినది. అనేకఋష్యాశ్రయములు దిరిగినది. పలువిధములైన తపములు సల్పినది. తన సగము అంశతో నదీరూపముకూడా పొందింది. చివరికి మహాదేవుడు ప్రత్యక్షమయ్యాడు. మరుజన్మలో అంబకోరిక నెరవేరుతుందని వరప్రధానము జరిగింది. అంబ అగ్నిహోత్రములో తన భౌతిక కాయాన్ని దహించివేసింది.

పాంచాలదేశానికి రాజు ద్రుపదుడు ఒకసారి భీష్మునిచే పరాభవము పొందాడు. భీష్ముని సంహరించే కుమారుని సాధించాలని తపముచేశాడు. అతనికి శివునివరముగా అంబ కుమార్తె అయి పుట్టింది. ఆమె తరువాత పురుషునిగా పరివర్తన జెందునని శివుడు చెప్పుటచేత ఆమెను బాలునిగానే పెంచి కుమారోచిత విద్యలు చెప్పించి, దశార్ణ దేశరాజైన హేమవర్మ కుమార్తెతో వివాహము కూడ జరిపించాడు ద్రుపదుడు.

కాని అప్పటికీ ఆమె అతను కాలేదు. రాకుమారి తన భర్త కేవలము తనవంటి స్త్రీ అని గ్రహించి తండ్రికి కబురంపుట వలన హేయవర్మ కుపితుడై పాంచాలునిపై దండెత్తివచ్చాడు. తన కారణముగా దారుణమైన యుద్ధము జరుగబోవుట గ్రహించి 'శిఖండి' అర్ధరాత్రి సమీపారణ్యమునకువెళ్ళి ప్రాణత్యాగము కొరకు ప్రాయోపవేశము పూనినది. అరణ్యములో నివసిస్తున్న స్థూలకర్ణుడనే యక్షుడు ఆమె స్థితికి జాలిచెంది తాత్కాలికముగా తన పురుషత్వాన్ని ఆమెకిచ్చి, ఆమె స్త్రీత్వము తాను గైకొన్నాడు. కుబేరుడు స్థూలకర్ణుడికి యిచ్చిన శాపము వలన శిఖండి జీవితాంతమువరకు పురుషుడుగానే ఉన్నాడు.

భీష్ముడు మహావీరుడనుటలో ఎవరికి సందేహములేదు. అతనిచేతులో విల్లు ఆయత్తమైయుండగా మానవు లెవరూ అతనిముందు నిలువలేరన్న సత్యము పరమేశ్వరునికి తెలియనిది కాదు. అందువల్లనే అంబకోరిక యుక్తియుక్తముగా తీరేట్లు వరమిచ్చాడు శివుడు.

వ్రతనిష్టాపరుడైన భీష్ముడు స్త్రీలతోటి, స్త్రీపేరు గలవారితోటి, స్త్రీవేషము ధరించినవారితోటి, కొంతకాలము స్త్రీగాఉండి పురుషునిగా పరివర్తన పొందినవారితోటి యుద్ధము చెయ్యడు. పై నలువురిలో ఎవరైనా తనతో ప్రతిఘటిస్తే అస్త్రసన్యాసముచేసే నియమముకూడ అతనికి ఉంది. అదే పాండవుల పాలిటి పెన్నిధైనది.

ఏడక్షౌహిణుల పాండవసైన్యము నంతటిని ముప్పదిరోజులలో రూపుమాపు తానని ఒక సందర్భములో భీష్ముడు అన్నాడు. అల్లే భారతమహాయుద్ధము మొదటి తొమ్మిది రోజులలో పాండవ సేనలో మూడవవంతు స్వయముగా నాశనముచేసాడు. అర్జునుడుగాని, ఇతర పాండవ యోధులెవరూగాని అతని దాడిని వారించలేకపోయారు. పరంధాముడైన శ్రీ కృష్ణుడుకూడ అతని బాణపాతమునకు ఓర్చుకొనలేక నియమోల్లంఘన చేసాడు. అదేవిధముగా యుద్ధము జరిగితే చివరికి కౌరవులు గెలిచే అవకాశముంది. అయితే ధర్మాత్ముడైన భీష్మునకు అధర్మము జయించడము అభిలాషగాదు. తనే తన మరణ రహస్యము యుధిష్టిరునితో చెప్పుకున్నాడు.

తన బావరైన శిఖండిని తన రథ ముఖమున ఉంచుకొని భీష్ముని మార్కొన్నాడు అర్జునుడు. తక్షణమే భీష్ముడు అస్త్ర సన్యాసము చేశాడు. ఆ అదను కోసమే నిరీక్షిస్తున్న అర్జునుడు, శిఖండి అతన్ని శరవర్షములో ముంచివేత్తారు. వారి బారినుండి భీష్ముని ఎవరూ రక్షించలేకపోయారు. ఇచ్ఛామరణ వరప్రధానుడైన అపగేయుడు అంపశయ్యా పాలయ్యాడు. కౌరవుల గుండెలు ప్రీలిపోయినవి. అంబ లక్ష్యము నెరవేరింది. ధర్మావలంబులైన పాండవులు విజయ సౌధారోహణములో తొలి సోపానము అధిగమించగలిగారు. తరువాత శిఖండి అశ్వద్ధామ చేతిలో సౌప్తికమరణము పొందాడు.

నాటి సాంఘిక ధర్మాచరణకు తన జీవితమే బలిఅయిన అంబచర్య అందరు మెచ్చుకొనకపోవచ్చు. కొందరు గర్హించనూవచ్చు. కాని ఆమె కార్యదీక్ష అకుంఠితమైనది. నమ్మిన సత్యమునయెడల ఆమె విశ్వాసము అచంచలము. నాటి స్త్రీ జీవికలలో అంబ వృత్తాంతము మచ్చుతునక. ఆమె సాధించినది పుణ్యమా పాపమా? అన్న విమర్శ అప్రస్తుతము. ఒకటి మాత్రము యథార్థము. నాటి భారతములో అంబ లేనిపక్షమున నేటి భారత కధనము వేరొక విధముగా ఉండేదనుటలో ఏమి సందేహములేదు. ★

కథానిక:

అనుకోని ఊహలు అల్లిబిల్లిగా అలుము కుంటూన్న అరుణోదయ మౌతూంది.

బాగా కాగిన పాలమీది మీగడ తరగల్లా లేయెండ ప్రకృతికంతాని కెగబ్రాకుతూంది.

లేతమనసులో ముదురు భావాల్ని యిముడ్చు కోవడానికి తగనిశ్రమ పడుతూ లెక్కించరాని అడుగుల్లో అడుగుల్ని దాటి పోతూన్న చక్రపాణి కష్టపడుతూ చిలిపి చాపల్యంతో ముఖంమీదికి 'ఉష్ణా'ని బుగ్గలు పొంగించి ఊదుతున్నాయి...గాలిపిల్లలు...

'వేగం రావాలిసుమా!' అని హెచ్చరించింది తల్లి కామాక్షమ్మ స్నానానికి వెడుతూ...

'సరిఘ్ఘా ఎనిమిదింటికల్లా పూజకూర్చోవాలి... లేకపోతే వర్జ్యం — దాంతరవాత దుర్ముహూర్తం వస్తాయి...,యిహ మీయిష్టం..' అన్నాడు బ్రాహ్మడు రాత్రి...

'ఏమైనా యీ మెయిలుకే బయలుదేరి తీరాలి...' బావగారి ఆదేశవాక్కు...

దీపావళి వెళ్ళగానే నాగుల చవితినాడు అనంతపూజకూడా చేయించడం నాన్నగారికి మొదటినుంచి ఆచారమైపోయింది... అది తెమిల్తేనేకాని ఆ యింట్లో ఎవ్వరూ పచ్చి మంచినీళ్లయినా నోట ముట్ట రావేళ...

వేగం పెంచాడు చక్రపాణి...

వాళ్ళ తాతలనాటినుంచీ ప్రవర్ధమైన పూల తోట అది. ఇంటికి దూర మన్న మాటేకాని అది ఆ ఊరికే అలంకారమైన పూలవనం... ఆ పూలవనాన్నీ — రాఘవరావుగారి పూల వాత్సల్యాన్నీఎఱుగనివారుండరు లే డాఊళ్ళో...

ఉత్తప్పుడైతే తోటలో పనివాళ్ళే రెండు పూటలా యింటికి సరిపడ్డ పూల నన్నిటినీ తెచ్చియిస్తుంటారు... కాని పూజకి వాడే పూలనిమాత్రం వాళ్ళు తేవడానికి వీలులేదు. ఆ యింట్లో వారే స్నానం చేసి స్వయంగా కోసి తీసుకురావల్సిందే...

అందుకే ఆవేళ చక్రపాణి కాలినడకని బయలుదేరాడు పూలు తేవడానికి — తను రావడమే రాత్రి బాగా ప్రొద్దుపోయాక వచ్చా దూరినుంచి — నిద్ర చాలలేదు... అయినా యీ నియమం ఉండడంవల్లనే తానే పెందలాడే లేచి స్నానం చేసి బయలు దేరాడు... అసలు తనతండ్రి దీపావళికే రమ్మని బలవంతం చేశారు... కాని ఉద్యోగ బలం మరింత బలిసింది...

నాన్నగా రింటిదగ్గిరుంటేనేగాని ఏర్పాట్లు పైముకి కావు...

అన్నిపువ్వులూ మహదానందంతో ఆహ్వానించాయి తన్ని...

పకపకలాడాయి కొన్ని...పళ్ళుకన్పించకుండా కొన్ని... దరహాసంతో కొన్ని... యిలా తమతమ మనోవికారాల్ని దాచుకున్నా యా పూలబాలలు...

గబగబా పూలు కోస్తున్నాడు చక్రపాణి..

ఎఱ్ఱ గులాబీ లంటే సుజాతకి మరీ ప్రాణం...

ఎంత సిగ్గునీ — మొహమాటాన్నైనా లేతబుగ్గల్లో దాచేసుకుని కార్యమైనమర్నాడే ఎంతో రహస్యంగా అడిగేసింది తనని... 'నాకు ఎఱ్ఱగులాబీలు తెచ్చిపెట్టరా?' అని..

'నీ బుగ్గల్లోనే ఉన్నాయిగా — యింకా వేరే ఎందుకు...' అన్నాడు తను...

'మా సుజాతకి ఎఱ్ఱగులాబీ లుంటే భోజనంకూడా అక్కర్లేదు బావా!' అన్నాడు బావమఱది సుజాతని కాపురానికి తీసుకొచ్చినపుడు...

రెండో సజ్జలోకి ఎఱ్ఱగులాబీల్ని కోస్తున్నాడు...

రెండేళ్ళయింది సుజాత కాపురానికి వచ్చి.

అసలు తన పెళ్ళే చాలా విచిత్రంగా జరిగింది...

చదువు ముగిస్తేనేకాని పెళ్ళిమాట ఎత్త వద్దన్నాడు తను తల్లితో. అప్పటికి చక్రపాణి యింజనీరింగు చదువుతున్నాడు-రెండో సంవత్సరంలో...

'అయితే ఏం, పిల్లని చూసొస్తే ప్రమాదం లేదుగా' అన్నాడు తండ్రి రాఘవయ్యగారు...

'ఇదివర కెన్ని చూసి రాలేదు...' అంది కామాక్షమ్మ.

తనూ 'సరే' అని బయలుదేరాడు...

ఆ ఊరు తమ ఊరికి అంతదూరం కాదు... అలా అని పరిచయ మున్నదీకాదు తనకి... మధ్యాహ్నం మూడుగంటలకల్లా చేరా రక్కడికి...

సాధారణాతిథ్యం — కుశల ప్రశ్నలు తర్వాత మొదటిరంగం ప్రారంభ మైంది... నాయిక రంగంమీదికి వచ్చింది... తల్లీ — వదినగార్లు తోడుండగా...

ఆమె వచ్చీ రావడంతోటే కళ్ళప్పగించి నఖశిఖ పర్యంతమూ చూసేటంత ఆత్రంగా లేడు చక్రపాణి... ఎలాగో యిక్కట్టించి బయటపడితే చాలనుకుంటున్నా డతడు... గోడల చిత్రాలంకరణ పరిశీలిస్తున్నాడు...

ఇంతలో సన్నని జంత్రవాద్యనాదం తన నిటు త్రిప్పింది ...

ఆశ్చర్యం వేసింది... ఆమె రూపంలో ఏదో నిరాడంబరత కన్పిస్తోంది... 'ఏ తావునరా నిలకడ నీకు...' అనే కృతిని మధుర గంభీర నాదంతో పలికిస్తూం దామె వయొలిన్ మీద...

ఆ రాగ తరంగాలు తన హృదయం లోతుల్ని చొచ్చుకు పోతున్నై ...

అయిదు నిమిషాల్లో ఆ కృతి ఆగింది...

తానూ కళ్ళు తెరిచాడు... ఆమె నొసటి కుంకుమ చెమ్మగిల్లింది... కళ్ళల్లో అల సత్వం కనిపిస్తూంది... తల్లీ — ఒదినగారూ ఆమెని లోనికి తీసుకువెళ్ళారు ...

తా మింటికి వచ్చేశారు...

తనకు తెలీకుండానే శుభలేఖ లచ్చయి పోయాయి...

తలిదండ్రులు బిడ్డల మనస్తత్త్వా లన్నంత తేలిగ్గా గ్రహించుకుంటారు కాబోలు...

మరి అంతవరకు బిగువుగా ఉన్న తన పట్టుద లేమైందో...

'రామకృష్ణ భరద్వాజ'

మరో మూడు మాసాల్లో వివాహం ముగిసింది...

తర్వాత ఒక సంవత్సరం దాకా సుజా తని చూడలేదు... ఉత్తరాల్లో తప్ప... తమ సంప్రదాయం ప్రకారం కామేశ్వరి వ్రత మైతేనే కాని కాపురానికి కోడల్ని తీసుకురాకూడదన్నారు నాన్నగారు ...

ఆ పన్నెండు నెలలూ పన్నెండు యుగా లైనాయి సుజాతకీని...

చక్రపాణికి ముచ్చటగా మూడో సంవత్సరం గడిచింది యింజనీరింగులో...

నాల్గో సంవత్సరంలో అడుగు పెడుతూం డగా సుజాత కాపురానికి వచ్చింది. తాను కాలేజీకి వెళ్ళాడు...

అప్పుడే పరిచయ మైంది వాసిష్ఠతో...

వాసిష్ఠ తనకంటె రెండు సంవత్సరాలు జూనియర్... స్టూడెంట్సు యూనియన్ ప్రారంభోత్సవానికి తన 'అభ్యుదయ కాములు' నాటిక ప్రదర్శింప బడింది... కాలేజీలో... అందులో తనే హీరో వేషం వెయ్యక తప్పిందికాదు...

రంగు కడుక్కుని యివతలికి రాగానే తన నభినందించినవారిలో వాసిష్ఠ మొదటిది.

రచయితకూడా తానే కావడం వల్ల నాయక పాత్రకి న్యాయం జరిగిందని ఆమె అభినందన... తనకి కొంచెం సిగ్గువేసింది. ఆమె తెలివి తేటల్ని – సౌహార్దాన్ని తాను మెచ్చుకున్నాడు మనస్సులో... వెంటనే అన్నాడు–'మీ రసజ్ఞతకి అభివందనాలు...' కృతజ్ఞతా సూచకంగా ఒక్క దరహాసాన్ని దానం చేసి నిష్క్రమించింది వాసిష్ఠ.

ఆ తరువాత పదిహేను రోజులకల్లా పత్రిక ఆఫీసునించి తనకో ఉత్తరం వచ్చింది... అది క్రిందటినెలలో ఆ పత్రికలో పడ్డ తన కథమీది విమర్శ... చాలా నిశితంగా ఉంది... పేరు వాసిష్ఠ.

ఇలాంటి ఉత్తరాలు రావడం తనకి పరిపాటే...

అయితే యింత నిశితంగా ఏ విమర్శలూ లేవు...కాని యీ వాసిష్ఠే తనని నాటకం నా డభినందించినట్లు తెలీదు...

ఆ ఉత్తరానికి సమాధానం వ్రాశాడు...

అందులో కథాసంవిధానం గూర్చి ఆమె చూపిన విమర్శని సమ్మతించి తనలోపాన్ని ఒప్పుకున్నాడు... ఇక ముందుకూడా యిలాంటి విమర్శలు తన కెంతో పురోభివృద్ధిని కల్గిస్తాయని ఆశిస్తున్నట్లు వ్రాశాడు...

మూడో నాటికల్లా సమాధానం వచ్చింది...

కాని పత్రికవారి దగ్గరనుంచి కాదు... అదే వూరినుంచి....

తాను రచయిత్రి కాక కేవలం పఠిత మాత్రమే కావడంవల్ల విమర్శ కొంచెం బెరుగ్గా ఉండవచ్చు... తమ మనస్సు కేమైనా కష్టం కల్గిస్తే క్షమార్హ నని అందులో మాటలు... చివరగా మరోమాట... శ్రమ అనుకోకపోతే ఎల్లుండి సాయంత్రం ఒకసారి మా యింటికి దయచేయ ప్రార్థన...'

ఇలాంటి అవకాశాలు అందరికీ రావు... అందులో తన కసలే రావు...ఏదో రచనల మీదైతేనేం – తన నటన మీదైతేనేం మోజుపడి పిలుస్తోం దీ ఆడబడుచు... పోనీ ఒకసారి వెళ్ళి చూద్దాం అనుకున్నాడు చక్రపాణి...

ఆ ఎల్లుండి సాయంత్రం నిర్మలమనస్కుడై బయలుదేరాడు... లేఖలో ఉన్న అడ్రసు పట్టుకుని...

సులభంగా యిల్లు గుర్తించాడు...

ఇంతకీ ఆవేళ ఆమె పుట్టిన రోజుట...

కాని ఆశ్చర్యం – ఆ వేళటి పార్టీకి తనొక్కడే అతిథి...

'ఇం కెవర్నీ పిలవలేదా ?'...అక్కడికీ అడిగేడు తను సాహసించి...

'ఏమిటో నాకు ఆడంబరాలంటే నచ్చవు. నిండైన మనస్సుతో ఏ కొంచమైనా బావుంటుంది...ఏమంటారు ?'

'అవునండి...' అంతకంటె ఏమంటాడు తను...

ఆమె తండ్రి– అక్కయ్య– తమ్ముడు– ఉన్నారు... వాళ్ళకి తనను ఇంట్రడ్యూస్ చేసింది...

ఏమైనా వాళ్ళంతా కొంచెం ఉన్నవాళ్ళే అనిపించింది...ధోరణి...ఈ సంగతి తెలిస్తే (పుట్టిన రోజన్న సంగతి) తానూ ఏదైనా కానుక తీసుకు వెళ్ళేవాడినే అని నొచ్చుకున్నాడు...వట్టి అభినందనలు తెల్పి తిరిగివచ్చాడు...

ఆ తర్వాత రెండు మూడు సార్లు మళ్ళీ ఆహ్వానించింది...ఏదో అవకాశంలేక వెళ్ళ లేదు...

మళ్ళీ రెండు కథలు అచ్చయాయి పత్రికల్లో...

ఒక కథని ఆమె పట్టుకొచ్చి చూపేదాకా అది అచ్చయినట్టే తనకు తెలీలేదు...

ఆ సంవత్సరం లిటరరీ సెక్రటరీ తానే కావడంవల్ల కాలేజీ మ్యాగజైనుకి కథలు, వ్యాసాలూ స్టూడెంట్సునించి తానే సేకరిస్తున్నాడు...ఎఱిగున్న కొందరు రచయితల్ని కథ లిమ్మని తా నడిగేడుకూడా! వాసిష్ఠనీ అడిగేడు... ఆమె ముఖం విప్పారింది...

వారమైనా కథ యివ్వలేదు...మరో మూడురోజుల్లో కథలూ, వ్యాసాలూ సంపాదకుని కియ్యాల్సిన టైమయిపోతూంది...

ఇంతగా బ్రతిమాలించుకుంటున్నందుకు వాసిష్ఠమీద తనకి కొంత విసుగుకూడా కలక్కపోలేదు...

అయినా సహజం అని సరిపెట్టుకుని (ఆ జాతికి...) మళ్ళీ అడిగాడు.

ఆ రోజు ఆమె యివ్వాలని తీసుకువచ్చిందనలు...

కాని తానే తొందరపడ్డాడు...కథ తీసుకుని కృతజ్ఞత తెల్పాడు...అలాగే రీడింగు రూమ్‌కి వెళ్ళి ఆత్రంగా కథ చదివేశాడు అరగంటలో...

అత ననుకొన్నట్టు ఆమె కేవలం పఠిత కాదు...కొంతవరకు రచయిత్రి...కలం పేరుకూడా మరీ అపరిచితంకాదు...అయితే కథలో వస్తువే ఎంచేతో ఎలాగో ఉంది...

అది కేవలం తా మిర్వరిమీదా వ్రాయబడింది మాత్రమే...

తాను నాయకుడు – ఆమె నాయిక...

నాయకుడు రచయిత – విద్యార్థి...నాయిక రచయిత్రి – విమర్శకురాలూ అయిన విద్యార్థిని...

అన్నట్టు నాయకుడు నటుడుకూడా... నాయిక పాటుతుంది – ట – కథలో... ఈమె సంగీత ప్రకర్ష తనకి తెలీదు. అయితే నాయికలో మరోగుణం ఎక్కువగాఉంది... ఆమె మంచి అందగత్తె – ట !!

అయితే అందులో అతనికి నచ్చని విషయ మల్లా ఒక్కటే...

అంతటి స్వల్పపరిచయంతోటే రాగోదయం... ముగింపుమాత్రం తనకి బాగా హత్తుకుంది...

కారణం అది చాలా సహజంగా ఉండడమే...

అంత అందగత్తె ప్రేమనీ కథానాయకుడు తిరస్కరించడం...అందులోనే ఆమె రచనా చమత్కృతి పరాకాష్ఠ నందుకుంది. కనుకనే నాయికమీద తనకి పరమమైన సానుభూతి కల్గింది...

ఆ మర్నాడు తన నడిగింది వాసిష్ఠ ఎంతో మృదువుగా...

'కథ ఏమీ బాగాలేదుకదూ!' అదో చమత్కారం కాబోలు...

'కాదు – అద్భుతంగా ఉంది...'

'నన్ను హేళన చెయ్యడాని కింకేం దొరకలేదు కాబోలు మీకు...'

నిజంగా చెప్తున్నాను...కథ చాలా బాగా వ్రాశారు...నాహృదయానికి హత్తుకుంది... మీలో యింత నేర్పుందని నే నెన్నడూ ఊహించలేదు. అలాంటి అవకాశాన్ని మీరు కల్గించారుకారు...మీ కలంపేరుకూడా నాకు పరిచితమే...అయితే మీ కథ లేవో స్పష్టంగా చెప్పలేనుకాని దీన్నిబట్టి అవి కూడా ఎంత మహత్తరంగా ఉన్నాయో ఊహించగలను...'

'అట్టే పొగిడేయకండి...' ఆమె ముఖంలో సిగ్గు చివురించింది...ముఖం కొంచెంగా వంచుకుని – స్వరం కొంత తగ్గించి అడిగింది...

'ఇంతకీ మీ అభిప్రాయ మేమిటి...యీ కథమీద...?'

'ఇంతకంటె యిం కేం చెప్పగలను...'

'అంతేనా?...' అంది...తొందరగా. మళ్ళీ సర్దుకుని చిన్న నవ్వులో తొందరపాటుని దాచుకుంటూ...

'ముగింపు మాత్రం ఘోరంగా ఉంది కదూ!' ఎంతో హేలగా అడిగింది...ఈ ఈ వికారానికి వ్యాఖ్యాన మేమిటో!!!,

'ఏం అలా అన్నారు?'

'అహఁ! ... నాకే నచ్చుబాటుగా లేదులెండి ... మీకు బాగా లేకపోయినా ఫరవాలేదు...'

'అవును...అలాఎందుకు వ్రాశారు...'?

'ఏదో కథకోసం తమాషాకి అలా వ్రాశాను...'

'కాని...అదే చాలా బావుంది నాకు...'

'ఆఁ...!...ఏం...చాలా అసహజంగా ఉంది కనకనా?' అంది చిరునవ్వుతో...

'కాదు...చాలా సహజంగా ఉంది...'

'అంత సహజత్వం ఏముం దందులో... అంతవరకూ స్నేహంపెరిగాక ఏలోటూలేని అమ్మాయిని తిరస్కరించేవారుంటారా ఎక్కడైనా?'

'పొరబడుతున్నారు ... ప్రేమ అనేది అంత త్వరగా కల్గుతుందనే సిద్ధాంతంలో నాకు నమ్మకంలేదు...అదీగాక స్త్రీ ప్రేమ అంగీకరింపబడ్డం లేకపోవడం ఆమె అందాన్ని అనుసరించి ఉండదు ... ఎంతటి అందగత్తె అయినా ఒకోకంటికి వికృతంగానూ – ఎంతటి తాటకి అయినా ఒకోదృష్టికి అప్సరసలాగూ కన్పించడమే ప్రకృతి వైచిత్ర్యం...'

ఈ మాటలింకా పూర్తికాకముందే వాసిష్ఠ ముఖంలో ఏవోమార్పులు వచ్చాయి ఒకదాని వెంట మరోటిగా...

తన మాటలమధ్యలోనే ఏదో జ్ఞాపకం వచ్చినట్లు...'వస్తా –' అని వెళ్ళిపోయింది ముఖంలో ఏమీ కన్పించనివ్వని వ్యర్థ ప్రయత్నం చేస్తూ...మళ్ళీ కన్పించినప్పుడు ఆమె పల్కరించనేలేదు ... తాను పల్కరించినా ఆమె పల్కనూలేదు...

ఆమెమీద అతనికి చాలా జాలికలిగింది...

ఆమె కథ కాలేజీ మ్యాగజైనులో అచ్చయింది...

ఆ కథ చాలా బావుందన్నా రంతా...

కొందరు లెక్చెరర్లుకూడా...

కాని ఆమెమాత్రం దానిమీద ఎలాంటి ప్రతిచర్యనీ చూపలేదు...

తాను కన్పిస్తే కొన్నాళ్ళు తలవంచుకుని వెళ్ళిపోయేది ... తర్వాత ఎడుగనట్లు తప్పించుకుని వెళ్ళిపోయేది ... తెలివైన ఘటం అనిపించింది తనకి...

తన కాయేటిపరీక్ష లింకా రెండురోజులకైపోతాయనగా సుజాత వచ్చింది వాళ్ళ అన్నయ్యని తీసుకుని...అతని కేదో ఆఫీసు పనుందట!

రెండేళ్ళగా సుజాత అడుగుతోంది తానూ వస్తానక్కడికని... ఓసారి ఆ నగర వైభవం చూసిరా లని ఆమెకి చిరకాల వాంఛితం...

తనకి పరీక్ష ముగిసేదాకా ఆమెతో కదలడానికి అవకాశం లేదని చెప్పేధోరణిలో చెప్పేడు చక్రపాణి ... ఆ రెండ్రోజులూ ఆమె యింట్లోనే కూర్చుంది...

ఆఖరిపరీక్ష రాసి యింటికివచ్చాడు చక్రపాణి...

ఆసాయంత్రం బయలుదేరాడు సుజాతతో ... తన బావగారు ఆఫీసుపనిమీద బయటికి వెళ్ళి ఎప్పుడో వస్తాడు ... మళ్ళీ ఎప్పుడో వెడతాడు .... అందుకని తామే బయలుదేరారు...

'ఇవ్వాళ అట్టే తిరిగే ఓపిక లేదు... సరదాగా పిక్చరుకి పోదాం' అన్నాడు ...

'సరే –? అందామె ... థియేటరులో కూర్చున్నా రిద్దరూ ... అప్పటికే ఆట మొదలైంది...

ఇంటర్వెల్‌లో లైట్లు వెలిగేసరికి తన కుడివైపున నాల్గోవ్యక్తిని చూసి ఆశ్చర్య పోయాడు ...

వాసిష్ఠ తనవైపు సుజాతవైపు చూస్తూంది ఆత్రంగా...

'నమస్కారం...' అంది క్రొత్తగా...

ప్రతినమస్కారం చేశాడు తాను ...

'మీ చెల్లెలా ?' అందామె...

'కాదు ... మిసెస్ ...' అన్నాడు... ఇంట్రడ్యూస్ చేద్దామనుకుంటూ...

ఆమెముఖంలో ఆశ్చర్యం — తొందర — చికాకు ముప్పిరిగొన్నాయి...

ఒక్క చిరునవ్వు నవ్వింది ...

లైట్లారిపోయాయి.

చక్రపాణికి ముచ్చెమటలు పోశాయి...

ఏమిటీ విపరీతం ... ఎందుకు నవ్వాలి ఆమె ... ఇంత అసూయా సుజాతని చూసి ... ఛీ ... అనుకుంటూండగానే అడిగింది సుజాత.

'ఆమె ఎవరు ?...'

'మా జూనియర్ ... వాసిష్ఠ అని...'

'అలా ముఖం మాడ్చుకుంటుందేం ?'

'ఆ మాత్రం అర్థం చేసుకోలేవూ ?'

'అలాగా !' అని నిట్టూర్చింది ......

'అబ్బ ... తలనొప్పిగా ఉంది...అంది సుజాత ...

'అదేమిటి ... హఠాత్తుగా వచ్చేసిందే...'

'అందేంకాదు ... యిందాకనే కొంచెం ఉంది ... యింక కూర్చోలేను...యింటికి వెళ్ళిపోదాం పదండి...' అని కదిలింది ...

తానూ కదిలాడు ...

ఇంటికి రాగానే అడిగా డామెని ...

'ఎందు కలా ప్రవర్తించా' వని ...

కాని, అమ్మో నిప్పులో నెయ్యి పోసినట్టె ...

అయినా అన్నీ అలాగేవస్తాయికథల్లోలాలా ...

మర్నాడు వాసిష్ఠ తనకి వ్రాసిన ఉత్తరం యింటికి వచ్చేసింది ... తనా సమయంలో ఇంట్లో లేకపోతే తన పూర్తి సంరక్షణ బాధ్యతని గుత్తకి తీసుకున్న సుజాత ఆ ఉత్తరాన్ని సెన్సారు పరిశీలన చెయ్యడం వల్ల మరీ గందరగోళ మైంది ... ఇంటికి రాగానే తనమీద విసిరికొట్టిం దామె ఆ ... లేఖని ... అంతే ... మరి మూడు మాసాల దాకా తనకీ సుజాతకీ మాటల్లేవు ...

స్త్రీలు ప్రేమించినప్పు డెంత మధురంగా ఉంటారో ద్వేషిస్తే అంత కర్కశంగానూ ఉంటా రని తన అనుభవంలో మరోమాటు అనిపించింది...

సుజాత అందచందాల్నీ — అలాంటి అందచందాల్ని మెచ్చుకోగల తన అభిరుచుల్నీ విమర్శిస్తూ వాసిష్ఠ తన అక్కసు నంతా తీర్చుకుం దా ఉత్తరంలో... సుజాతలో అనుమాన బీజానికి మరింతగా ఆ ఉత్తరం దోహదమైందనడంలో ఇంక సందేహించనక్కరలేదు.

మిగతా రోజుల ప్రోగ్రాం దాంతో కాన్సిల్...

అందరం ఇంటికి చేరుకున్నాం........

మళ్ళీ ఆమెకి జరిగిందంతా చెప్పివప్పించే సరికి తాను ప్యాసవడం ప్రాజెక్టువద్ద నియోగిస్తూ అప్పాయింట్‌మెంట్ రావడంకూడా జరిగిపోయాయి...

ఉద్యోగానికి బయలుదేరివెడుతూ చెప్పా డామెతో...

'మనుష్యుల్ని — పరిస్థితుల్ని అర్థం చేసికోగల్గడమే సంస్కార మంటే...అది లేనివాళ్ళు బుద్ధిపూర్వకంగా తప్పుచేసేవాళ్ళ కంటెకూడా నేరస్థులు..తర్వాత నీయిష్టం..'

ఉద్యోగంలో జాయినయ్యాక ఒకఉత్తరం వ్రాశాడు పరిస్థితిని సింహావలోకనం చేస్తూ సుజాతకి...కాని ఆమె సమాధానం వ్రాయలేదు...

ఈ లోగా అక్కడికి టూర్ వచ్చింది వాసిష్ఠ తన క్లాస్‌మేట్స్‌తో కలిసి...

ఫీల్డ్‌లో తనని చూసింది...

ఎంతో ఆప్తంగా పల్కరించింది...

తను అసహ్యంగా ముఖం త్రిప్పకున్నాడు...

కాని ఆమె తనని వదలలేదు...

తనతో పా టింటికి వచ్చేసింది...

తన ఆ ఉత్తరాని కెందుకు సమాధాన మియ్యలే దంది...

జరిగిందంతా చెప్పి ఆమెని కసిదీరా దుయ్యబట్టాడు...

ఆమె తన అభిప్రాయాల్ని వ్యక్తంచేసి— తనపనికి పరితాపపడుతూండగా —

తన ఉత్తరానికి ప్రత్యుత్తరంగా సుజాతే నేరుగా వచ్చి గుమ్మంలో నించుంది నాన్నగారితో...

వచ్చినవాళ్ళు వచ్చినట్లుగా త మిద్దరినీ చూసి కొయ్యబారిపోయారు...

వాసిష్ఠ కంట మున్నీరు ప్రవహిస్తూంది...

తన ముఖం కంద గడ్డలా ఉండి ఉంటుంది...

వెంటనే వాసిష్ఠ లేచింది... గబగబ వెళ్ళి 'నన్ను క్షమించండి సుజాతా !' అంటూ; ఆమె చేతులు పట్టుకుంది...

మీ సంసారంలో ఏర్పడ్డ కలతలకి కారణమైన నన్ను క్షమించగల్గే సౌహార్దం మీలో యింకి పోనీకండి !!' అంటూ ప్రాదేయపడింది......

విషయ మంతా వివరించింది...

అంత కోపం కరడుకట్టుకొన్న సుజాత అంతలోనే కళ్ళల్లో మబ్బుల్ని నింపుకుంది...

ఒక్కటే ప్రశ్న వేసింది...

'ఇలా ఎందుకు చేశారు ?'

'మీ చెల్లెలే యిలా చేస్తే మీ రీ ప్రశ్న వేస్తారా?' అతి దీనంగా అంది వాసిష్ఠ...

'ఏదో చిన్నతనాలు... యిలాంటి వాటి కంత ప్రాముఖ్య మివ్వకూడదు...' అంటూ సర్దారు నాన్నగారు...

'ఇంతకీ మీరు చాలా అదృష్టవంతులు...' అని అభినందించి సుజాతని వాసిష్ఠ...

ఆ వేళ అంతా కలసి భోజనం చెయ్యడం జరిగింది...

తా ననుకోకుండా మర్నా డుదయమే

క్యాంపుకి వెళ్లాల్సిన పని తగిలింది... ఒక పదిహేను రోజులదాకా తిరిగి రావడానికి వీలు పడలేదు.

తన బ్యాచ్ విద్యార్థులతో తిరిగి వెళ్ళిపోయింది వాసిష్ఠ. ఇంటిదగ్గిర వ్యవసాయాలూ – వ్యవహారాలూ మిగిలి పోవడం వల్ల నాన్నగారికి ఉండడానికి వీల్లేక పోయింది ...

ఒంటరిగా ఉండల్లేక సుజాత ఆయనతో తిరిగి వెళ్ళిపోయింది ...

ఆమె వెళ్ళిన తరువాత వచ్చిన నాల్గో ఉత్తరంలో తన కుటుంబం మెగ్గ తొడిగింది ...

ఆ వేళ తన సంతోషానికి మేరలేదు.

ఇంటికి రమ్మని నాన్నగారు ఉత్తరాలు వ్రాస్తున్నారు ...

ఎంత ప్రయత్నించినా యీ నాల్గు నెలల్నించీ తీరిక యిన్నాళ్ళకి కుదిరింది ప్రయాణం ...

తెల్లారకట్ల రెండయింది యింటికి చేరే సరికి ...

అలా నిద్ర పట్టిందో లేందో యిలా మళ్ళీ మేలుకున్నాడు ...

స్నానం ముగించుకుని సజ్జలు చేత పట్టుకుని యిలా వచ్చేశాడు ...

అసలు తాము మళ్ళీ నిర్మల హృదయులయ్యాక మనసారా మాట్లాడుకోనేలేదింకా ...

ఈసారి తనతో తప్పక తీసుకు వెళ్ళాలి సుజాతని.

అంతగా కావలిస్తే రెండు మాసాల తర్వాత మళ్ళీ పంపెయ్యవచ్చు.

ఉల్లాసంగా పువ్వులు కోస్తున్నాడు. చక్రపాణి...

గబగబా ఆ సజ్జనిండా కోసేశాడు ఎఱ్ఱ గులాబీలని...

చివరగా ఆ మెరకమీది మొక్కపూలు కూడా కోసేసి యింక వెళ్ళిపోవడమే...

కదిలాడు ముందుకి...

మిగలమగ్గిన సీతాఫల మొకటి చేతికి తగిలి పగిలింది...

'ఈ చెట్టుకాయలు మరీ తియ్యగా ఉంటాయి' అనుకున్నాడు...

చేతికి వచ్చిన రెండు గింజల్నీ చప్పరించాడు...

'అబ్బ – పంచదార తయారు చెయ్య వచ్చునేమో దీన్తో...' అనుకున్నాడు...

టాప్ దగ్గిరికెళ్ళి చేతులు కడుక్కున్నాడు.

గబగబా మెరకమీది ఎఱ్ఱగులాబీ మొక్క దగ్గిరి కెళ్ళాడు.

ప్రక్కనే ఎత్తుగా ఉంది నాగమల్లె...

వాసనలో కాకపోయినా అందంలో మనోహరంగా ఉన్నాయి దాని పూలు...

ఈ మొక్క గులాబీలు మరీ పెద్దవి...

గబగబా ఆ పూలు కోస్తున్నాడు...

నరాల్లోకల్లా కస్సున దిగింది గులాబీ ముల్లు...

'అబ్బా' – అనుకుని కళ్లుమూసి తెరచే లోగా గులాబీలకంటె ఎఱ్ఱని నెత్తురు చిమ్మింది...

నాగమల్లె చెట్టుమీది రెండుపక్షులు హడావుడిగా అరుస్తూ ఎగిరి తలోవైపుకి పోయి ...దూరాన...మళ్ళీ కలిశాయి...

ఆ ఊపుకి నాగమల్లె పువ్వొకటి సంభ్రమంగా జారి తన నెత్తిమీద పడింది...

ఆ చెట్టుమీది మిగతా పువ్వులన్నీ అల్లరిగా కదులుతున్నాయి...

తగని చికాకనిపించింది చక్రపాణికి...

'బా బు గా రూ !...బాబుగారూ !!...'

అంటూ కంగారుగా వచ్చాడు నౌఖరు...

వెనక్కి తిరిగి చూశాడు చక్రపాణి...

'ఏగంరండి బాబూ...అమ్మాయిగోర్ని పురుగు ముట్టింది' ఏడుపు దిగమింగుతూ అన్నాడు...నౌఖరు...

ఏం జరుగుతూందో తెలియడంలేదు చక్రపాణికి...

నౌఖరుతెచ్చిన బండిలో ఎక్కాడు ...

డాక్టరో ప్రక్కా – పాముల మంత్రగాడో ప్రక్క ఉన్నారు సుజాతకి ... అందరి ముఖాలూ యితనికోసమే చూస్తున్నాయి...

ఇంజక్షనిచ్చాడు డాక్టరు ... సుజాతనోట నురుగులలా వస్తూనే ఉన్నాయి...

'ఇంగ్లీషుమందులిస్తే మంత్రం పట్టివ్వదం'టున్నాడు మంత్రగాడు...

'ఫర్వాలేదు–మరో ఇంజక్షనిమ్మ'న్నాడు రాఘవయ్యగారు...

'ఇంగ్లీషుమందులు వద్దంది ... కామాక్షమ్మగారు...

'పాముని సంపేశారా ?' అడిగాడు మంత్రగాడు...

'తప్పించుకు పోయిందోయ్ ... అన్నారు రాఘవయ్యగారు...

'ఇంతకీ ఎలాకరిచిందండి...' అడిగాడు డాక్టరు...

'స్నానాలగదిలో ... ఏం చెయ్యను ... అంతా నాఖర్మ...అంది కామాక్షమ్మగారు... కళ్ళొత్తుకుంటూ...

పాములవాడు మంత్రం వేస్తున్నాడు ...

సుజాతనోటి నురుగులాగి పోయాయి...

'మంత్రం పని చేస్తుందన్నాడు మంత్రగాడు...

'ఇంజక్షనువల్ల స్పృహవస్తూంద'న్నాడు డాక్టరు...

వంటినిండా చమటలు పోశాయి... సుజాతకి...అందరి ముఖాలూ దరహసించాయి...ఆత్రంగా...

మెల్లిగా... 'ఏ...మండీ... !' అంది సుజాత...

'సుజీ !!...' అన్నాడు చక్రపాణి ఆశగా !!!...

కనురెప్పలు సగంతెరిచి తన రెండు చేతులూ జోడించింది సుజాత...

మంచంమీద కూర్చున్నాడు చక్రపాణి...

భర్త రెండుచేతులూ తన గుప్పిట్లోకి తీసుకుంది సుజాత...

సంతృప్తిగా కళ్ళుమూసి తెరిచింది...

'సుజీ !' అన్నాడు చక్రపాణి...

ఎఱ్ఱగులాబీలు సజ్జలో మరింతగా మెఱుస్తున్నాయి ... చక్రపాణి కళ్లల్లో ఆశారేఖల్లాగే...



# సంఘంలో స్త్రీ పాత్ర

శారదా అశోకవర్ధన్

అనాదిగా సంఘంలో స్త్రీ మాతృమూర్తిగా, గృహిణిగా, గుర్తింపబడుతూంది. ఈనాటికి కూడా స్త్రీకి విద్య గరపడంలో ముఖ్యోద్దేశం ఆమెను ఒక చక్కటి తల్లిగా- భార్యగా రూపొందించాలనే. సంఘంలో స్త్రీకి రెండు ముఖ్యమైన బాధ్యత లున్నాయని మనవిశ్వాసం. ఒకటి మాతృత్వాన్ని వహించడం, మరొకటి యింటిని చక్కదిద్దుకోవటం. స్త్రీ మాతృత్వానికీ, గృహిణీత్వానికీ పరిమితులు విధించి, సాంఘిక, ఆర్థిక కార్యకలాపాల్లో పురుషుడి జోక్యానికి హద్దులుకల్పించే ఈనాటి సాంఘిక వ్యవస్థానిర్మాణం, అటు స్త్రీకి, యిటు పురుషుడికీ కూడా లాభసాటి కాదని కొంతమంది అభిప్రాయం.

స్త్రీ, యింటిని చక్కదిద్దుకునే విషయాలలో, ఆమెకు మాతృత్వాన్ని సిద్ధింపచేయడంలో పురుషుడు కూడా స్త్రీతో పాటు బాధ్యతల్ని పంచుకోవలసివుంటుంది. అలాగే స్త్రీలుకూడా పురుషుడితోపాటు అతని సాంఘిక, ఆర్థిక కార్యకలాపాలలో పాలుపంచుకోవాలి.

పూర్వపు రోజుల్లోనయితే స్త్రీకి మాతృత్వమూ, గృహిణత్వమూ—ఈ రెండే బాధ్యతలు వుండేవి. ఆమె శక్తి సామర్థ్యాలన్నీ వాటిల్లోనే ఉడిగిపోయేవి. కానీ, యీనాడుయీఆధునిక శాస్త్రీయ, విజ్ఞాన యుగంలో స్త్రీకి మాతృత్వం విషయంలోనూ, యింటి పనుల్లోనూ, ఎంతో స్వేచ్ఛ లభించింది. బాల్య వివాహాలు సమసిపోవటంతో భార్యగా- తల్లిగా తన భవిష్యత్తును తాను నిర్మించుకొనే విద్యను నేర్చుకునే అవసరమూ, అవకాశమూ స్త్రీకిలభించాయి. మాతృత్వ కాలంలో తన భవిష్యత్తును తాను నిర్మించుకునే అవకాశం వెనుకటి రోజుల్లో స్త్రీకి ఏమాత్రమూలేదు. కానీ, ఈనాడు స్త్రీ తన సంతానాన్ని పరిమితం చేసుకోవటానికి, వారికి సక్రమమైన పోషణ కల్పించటానికీ, కుటుంబ నియంత్రణ అవకాశం కల్పిస్తోంది. ఈనాటి స్త్రీ మాతృత్వ కాలానంతరం కూడా, చాలా కాలం జీవిస్తోంది. ఈనాడు చదువుకున్న స్త్రీకి కొద్దిమంది పిల్లలు మాత్రమే వుంటున్నారు. అదీ వారి యౌవనపుతొలి రోజుల్లోనే ఏర్పడుతున్నారు. ఆమెకు నలభై యేళ్ళ వయస్సు వచ్చేసరికి తొలి సంతానం ఎదిగి చేతికంది వస్తుంది. అందుచేత తనకు యిష్టమైన జీవన పథాన్ని రూపొందించుకోనే వ్యవధి ఆ స్త్రీకి ఉంది.

'ఇంటి బానిస' బ్రతుకునుంచి, శాస్త్రీయ విజ్ఞానం స్త్రీని ఉన్నత పథాల్లోకి తీసుకెళ్ళింది. పూర్వకాలంలో ఈ ఒక్కపనీ స్త్రీ కాలాన్నంతా హరించివేస్తూండేది. నీళ్ళు తెచ్చుకోవటం, ధాన్యం దంపుకోవటం, బట్టల్ని ఉతుక్కోవటం, పదార్థాలు దాయటం, వంటచేసుకోవటం, పిల్లల్ని సాకటం — ఈ ఇంటి పనులతోనే రోజంతా గడిచిపోయేది. కానీ, శాస్త్రీయ విజ్ఞానం యీ బాధ లేకుండా చేసింది. నీటి కుళ్ళాయిలు, ధాన్యం మిల్లులూ, లాండ్రీలు, హోటళ్లు— యిలాంటి వెన్నో సౌకర్యాలు ఏర్పడి, స్త్రీకి కార్యభారాన్ని తగ్గించాయి. అందువల్ల స్త్రీకి, గృహకృత్యాలు వెనకటిలా ఒక పెద్ద సమస్యకాదు. ముఖ్యంగా పట్టణాల్లోని మధ్య తరగతి గృహిణులకు, యివన్నీ నిత్యజీవితంలో అంతర్భాగాలై పోయాయి. స్త్రీ శక్తి యుక్తుల్ని నిర్మాణాత్మకమైన సాంఘిక కార్యక్రమాల వైపు మళ్ళించడానికి యివి తోడ్పడ్డాయి.

ఒక చక్కటి మాతృమూర్తిగా- భార్యగా, తాను రూపొందటానికి వీలుగా స్త్రీ తన భవిష్యత్తును తాను నిర్మించుకోవాలని అంతా యీనాడు గుర్తించారు. నాలుగు గోడల మధ్యా బందీ అయిన స్త్రీ తన వ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా అభివృద్ధి పరచుకోలేదు. ప్రతీ పురుషుడూ, ప్రతి స్త్రీ పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని సంతరించుకోవాలంటే, ఒక సక్రమమైన, సంతృప్తికరమైన జీవన పథాన్ని ఏర్పరచుకోవడం చాలా అవసరం. ఈ విధంగా భవిష్యత్ జీవన పథాన్ని ఏర్పరచుకోవటంవల్ల స్త్రీ మాతృమూర్తిగా, గృహిణిగా, మరింతగా రాణించడానికి వీలుకలుగుతుంది. ఇక, గృహం వెలుపల ఉపయోగకరమైన పనుల్లో స్త్రీ మునగటంవల్ల, ఆమె విజ్ఞాన పరిధులు విస్తృతమవుతాయి. తల్లిగా- భార్యగా తన బాధ్యతలను తాను సక్రమంగా నిర్వర్తించడానికి మరింత శక్తి సామర్థ్యాలు లభిస్తాయి. నిజానికి బయటి సాంఘిక కార్యక్రమాలలో తిరిగే మనిషి, కేవలం యింట్లో నాలుగు గోడల మధ్యా బందీ అయిన స్త్రీ కన్న ఎక్కువగానే, చక్కటి మాతృమూర్తిగా- గృహిణిగా కాగలుగుతుంది.

ఇంటి ఆర్థిక వ్యవస్థకు ఏ విధంగా స్త్రీ ఆలంబనమై సహాయకారి అవుతూన్నదో, ఆ బాధ్యతల్లో పాలుపంచుకుంటూన్నదో, అదే విధంగా గృహ కృత్యాలలో స్త్రీకి తోడ్పడాలనీ పురుషులు కూడా గుర్తిస్తున్నారు. ఇంటిని చక్క దిద్దుకునే పని కేవలం స్త్రీ ఒక్కతికే పరిమితం కాలేదు. పురుషులు తమ బాధ్యతలను విస్మరిస్తే, ఎంతటి నేర్పరులైన స్త్రీలైనప్పటికీ, వారు యింటిని చక్కదిద్దుకోలేరు. అందువల్ల గృహనిర్మాణం అనేది పురుషుడూ, స్త్రీకూడ సమిష్టిగా కలిసి చేయాల్సినపని.

స్త్రీ జీవనపథానికి గర్భధారణ కొంత అంతరాయం కలిగించినప్పటికీ, తన కాలంలో కొంత భాగాన్ని యిల్లూ, పిల్లల పోషణ విషయంలో వెచ్చించడానికి ప్రాధాన్యత నిచ్చి, ఆ పరిమితుల మేరకు, తన జీవనపథాన్ని నిర్ణయించుకోవాలి. నేటికన్న మిన్నగా, స్త్రీ పురుషు లిరువురూ, తమ తమ బాధ్యతల్ని గుర్తించి మెలిగే సాంఘిక వ్యవస్థ కావాలి. ఆ వ్యవస్థ రూపురేఖలు దిద్దుకోవడానికి, మనమంతా శ్రమించాలి. ★

# సోవియట్ కళాకారుల ....





రూపవతి బల్లేరినా నీనెల్ పెట్రోవ, వార్వెరా పొట పోవాల నృత్యాలకు చెందిన నాల్గు చిత్రాలు.





## .... అత్యద్భుత కళాప్రదర్శనలు

సోవియట్ యూనియన్‌లోని వివిధ రిపబ్లికులకు ప్రాతినిధ్యం వహించే 24 మంది సభ్యులు గల సోవియట్ బృందం, హైదరాబాదులో డిసెంబరు 26, 27 వ తేదీలలో తమ ప్రదర్శనలు ఇచ్చారు. సాంస్కృతిక మార్పిడి కార్యక్రమంక్రింద కేంద్ర ప్రభుత్వం ఆహ్వానంపై వారు భారత దేశంలో పర్యటించారు. కిరోవ్‌ఒపేరా, బ్యాలేకు చెందిన నీనెల్ పెట్రోవా, ప్రైమాబల్లేరినా వంటి ప్రసిద్ధ సోవియట్ కళాకారులు యీ బృందంలో ఉన్నారు.



పెట్రోవా తన స్వంత రీతిలో నృత్యం చేస్తుంది. తన హంస శారీరకంగా గాయపడిన పక్షికాదు, మృత్యువుకూ చిహ్నంకాదు, మృత్యువు సమయంలో కూడా జీవకళ కలిగి నట్టిది.



ఉజ్బెకిస్థాన్‌కు చెందిన ప్రముఖ సోలోయిస్ట్ నెల్లిబషిరోవా.



డ్రమ్ పై వివిధ రీతులను ప్రదర్శిస్తున్న కళాకారుడు.

లెనిన్‌గ్రాడ్ బ్యాలె పాఠశాలకు చెందిన సోలోయిస్ట్ అనాటోలి నిస్నివిచ్, యుక్రేనియన్ కళాకారుడు వార్వెరా పౌటా పోవా, ఉజ్బెకిస్థాన్‌కు చెందిన ప్రముఖ సోలోయిస్ట్ నెల్లి బషీరోవా, ఆర్మేనియన్ ఒపేరా బ్యాలె థియేటర్‌కు చెందిన ఒపేరా డ్యాన్సర్ అజాద్ గరిబియన్‌లు వారి కళా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్న యితర చిత్రాలను ముందు పేజీలలో చూడవచ్చు.



నగరానికి విచ్చేసిన బృందం చిత్రం.



బృందం నాయకురాలును సమాచారాశాఖ మంత్రికి పరిచయం చేస్తున్నప్పటి దృశ్యం.



రిట్జ్‌లో పత్రికా విలేఖరులతో జరిగిన సమావేశం దృశ్యం.



బృందనాయకురాలు శ్రీమతి నాదెజ్డా కజంత్సేవా ప్రారంభోత్సవంనాడు ప్రసంగిస్తున్న దృశ్యం. సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ యం. ఆర్. అప్పారావును కూడా చిత్రంలో చూడవచ్చు.



ప్రారంభోత్సవం నాటి ప్రేక్షకుల సమూహము.



ఈ ఉత్సవం ఆఖరు రోజు ప్రదర్శనంతుదకు ఆర్థిక మంత్రి ప్రసంగిస్తున్న చిత్రం



ఆర్థిక మంత్రితో బృందం సభ్యులు.

అంతర్రాష్ట్రీయ సాంస్కృతిక బృందాల మార్పిడి క్రింద అస్సాం బృందం యిటీవలనే మన రాష్ట్రాన్ని సందర్శించింది.

అస్సాం తనకు ప్రత్యేకమైన రీతులతో జానపద నృత్యాలను రూపొందించుకున్నది. వారి ఉత్సాహం మత సంబంధమైనది. విఖ్యాత పురాణేతిహాసమైన రాధాకృష్ణుల ప్రేమ గాథ, రాసలీలలను నృత్యాంశాలుగా రూపొందించారు. శాస్త్రీయ నృత్యాలతో పోల్చితే యీ నృత్యాలలో సాంకేతిక అంశాలు సులువుగా ఉంటాయి. యీ నృత్యాలను యువకులు ప్రదర్శిస్తే ఉత్తేజపూర్వకంగాను, యువతులు ప్రదర్శిస్తే మనోహరంగాను ఉంటాయి.



సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి నుంచి అస్సాం బృందం నాయకుడు పుష్పగుచ్ఛాన్ని స్వీకరిస్తున్న దృశ్యం.



సైనికోద్యోగుల కొరకు విడిగా ఒకప్రదర్శనం జరిగింది.



అస్సాం సాంస్కృతిక బృందం ప్రదర్శనలను
తిలకిస్తున్న ప్రేక్షకులు.



ఇటీవల గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రాలలో పర్యటించిన
ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక బృందం సభ్యులు.

# నచికేతుడు

ఇందు

పూర్వం వాజశ్రవసుడు విశ్వజిన్నామ యజ్ఞం చేసి తన సమస్తం ఋత్విజులకు దానం చేస్తుండెను. అతని కొడుకు నచికేతుడు తండ్రిని సమీపించి "తండ్రీ! నన్నెవరికి దానం చేస్తావ్?" అని ముమ్మారు ప్రశ్నించాడు. ఆ మాటకు వాజశ్రవసుడు కోపించి "యముని" కన్నాడు.

తన తండ్రి కోపంతో అన్నాడని గ్రహించి "తండ్రీ! మనుష్యుడు పైరువలె పుట్టి, జీర్ణమై నశించి, తిరిగి పైరువలెనే పుడుతున్నాడు. జీవితం శాశ్వతం కాదు. మాటే శాశ్వతమైంది. నీ మాటను కాపాడుకొనుటకు నన్ను యమునివద్దకు పంపు. సందేహింపకు" అన్నాడు.

వాజశ్రవసుడు కొడుకు ధైర్యానికి మెచ్చుకొని తన మాట నిలబెట్టుకొనుటకు యముని వద్దకు పంపాడు. నచికేతుడు పెద్దల మాటను సత్యయుతం చేయుటకు యముని వద్దకు పోయాడు. కాని యముడు ఇంటివద్ద లేనందువల్ల మూడు రాత్రులు ఉపవసించాడు.

పిమ్మట యముడు వచ్చిన తరువాత యముని భార్య యమునితో ఇలా చెప్పింది. "ఓ యముడా! అగ్నియే అభ్యాగతుడు. ఎవరి ఇంట అతిథి మర్యాదలు జరుగవో అతనికి ఇహపరసాధనంగా ఉండు పుణ్యఫల మంతయు నశిస్తుంది. మన ఇంట నచికేతుడు మూడు రాత్రుల నుండి అభోజనంగా ఉన్నాడు. కనుక వెంటనే అతనికి పాద్యాదులిచ్చి పూజించు."

యముడు నచికేతు డున్నచోటికి వచ్చి "ఓ నచికేతుడా! నీకు నమస్కారం. నీవు అతిథివి గాన మాకు పూజ్యుడవు. నాయందు దయయుంచి మూడు వరాలు కోరుకొను. మూడు రాత్రులు నిరాహారుడవై యుండవలసివచ్చినందుకు ఈ మూడు వరాలు ఇస్తున్నాను," అన్నాడు.

"యమలోకం నుండి తిరిగివచ్చిన నన్ను నా కొడుకు వీడే యని నా తండ్రి గుర్తించునట్లు చేయి," అని మొదటి వరం కోరాడు నచికేతుడు.

అలాగే ఇచ్చానని యము డన్నాడు.

"స్వర్గాన్ని పొందినవారు దేవత్వం పొంది, దుఃఖాలు లేనివారై సుఖింతురు. కనుక అట్టి స్వర్గలోక సాధన మగు అగ్నివిద్యను నా కుపదేశింపు," అని నచికేతుడు రెండవ వరం కోరాడు.

యముడు 'తథాస్తు' అని రెండవ వరం కూడ ఇచ్చాడు.

"ఓ యముడా! మరణించిన పిదప ఆత్మ ఉన్నదా? లేదా? ఈ సందేహం పోగొట్టు ఇదే నే కోరెడి మూడవ వరం," అన్నాడు నచికేతుడు.

"ఆత్మవిషయమైన ఈ ధర్మం మిక్కిలి సూక్ష్మమైంది. తెలియశక్యంకానిదికూడ నన్ను దీనికోసమై నిర్బంధించక ఏదైన ఇంకొకవరం కోరుకొను," అన్నాడు యముడు తన అశక్తతను తెలియజేస్తూ.

అయినా నచికేతుడు తన పట్టు విడవలేదు. దీనిని బోధించుటకు నీవేతప్ప ఇతరులెవరూ అర్హులుకారు. కనుక నీవే దీనిని నాకు చెప్పాలి," అన్నాడు.

యముడు నచికేతుని ఆత్మజిజ్ఞాస ఎట్టిదో తెలుసుకోవా లనుకున్నాడు. ఏదైన ఆశ చూపెడుతే అతని మనోధైర్యం సడలుతుందేమో నని "ఓ నచికేతుడా! పుత్రులు, పౌత్రులు, ఏనుగులు, గుఱ్ఱములు, పశువులు, బంగారము, సమస్త రాజ్యము, వీటి ననుభవించుటకు తగిన ఆయుష్షును ఇస్తాను. అప్సరసల నిస్తాను, కోరుకొను. అంతేగాని ఆత్మను గూర్చి నన్ను ప్రశ్నింపకు," అన్నాడు.

"నీవు చెప్పిన సమస్త భోగములు క్షణికమైనవి, నశించునవి కాన నేను వీటిని కోరను. ఆత్మస్వరూపమును గురించే నాకు చెప్పు." అన్నాడు తిరిగి నచికేతుడు.

నచికేతుడు జ్ఞానోపదేశమునకు అర్హుడని యముడు ఆత్మస్వరూపాన్నిగూర్చి ఇట్లు వివరించాడు:

"ఆత్మ జననమరణములు లేనిది. మనుష్యాది దేహములు నశించినను నశింపనిది. చెడునడతను వదలి, ఇంద్రియచలనం లేక, ఏకాగ్రచిత్తం కలవాడే ఆత్మజ్ఞానం కలవాడు."

"అగ్నిలోకమున ప్రవేశించి ఆయా రూపములతో ఎట్లుండెనో అట్లే ఆత్మ ఆయా ప్రాణులయందు ప్రవేశించి ఆయా రూపములతో ఉండెను. ఆత్మను ప్రత్యక్షం చేసికొన్నవాడే బ్రహ్మానంద సుఖం అనుభవింపగలడు."

"ఆత్మను నే నేవిధంగా తెలిసికోగలను? అది ప్రకాశరూపంగ ఉందా? నా బుద్ధిచే తెలిసికోగలనా? వివరింపు," అని ప్రశ్నించాడు నచికేతుడు.

"మనం మన ప్రతిబింబాన్ని అద్దమందు చూస్తున్నట్లుగానే నిర్మలమైన బుద్ధియందు ఆత్మను దర్శింపవచ్చు. ఆత్మయే పరమాత్మ. అదే బ్రహ్మ స్వరూపం." అని యముడు పరమాత్మ స్వరూపాన్ని వివరించి చెప్పాడు. ఈ రీతి నచికేతుడు ఆత్మస్వరూపం తెలిసికొని బ్రహ్మ సాయుజ్యం పొందాడు.

కఠోపనిషత్తు

# 'ఆంధ్రప్రదేశ్'

## తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు మాసపత్రిక ప్రకటనరేట్లు

దిగువ రేట్ల ననుసరించి 'ఆంధ్ర ప్రదేశ్' మాస పత్రికలో ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | నాలుగు సంచికలలో | | | ఒక సంచికలో మాత్రమే | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ | పూర్తిపేజీ | సగంపేజీ | పావుపేజీ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| **లోపలి పేజీ** | 300 | 150 | 100 | 100 | 55 | 30 |
| వెనుక అట్టపేజీ (4) | 400 | — | — | 150 | — | — |
| అట్ట 2, 3 పేజీలు | 350 | — | — | 125 | — | — |

**ఒక సంవత్సరం కాంట్రాక్టు ప్రకటనలకు 20 శాతం రిబేటు ఇవ్వబడును.**

### నిబంధనలు

1. మెకానికల్ వివరాలు : 10¾" × 8¾" డెమ్మీ
2. ముందుఅట్ట టైటిల్ పేజీపై ప్రకటనలు స్వీకరించబడవు.
3. పావు పేజీకి తక్కువగా ఉన్న ప్రకటనలు స్వీకరించబడవు.
4. వచ్చే సంచికలో ప్రచురించడానికి వీలుగా స్థలం వివరాలు, డబ్బుతోసహా ప్రకటన సమాచారాన్ని ప్రతినెల 8 వ తేదీలోపుగా యీ కార్యాలయానికి పంపాలి. క్రాస్ చేయని డిమాండ్ డ్రాఫ్టుద్వారా గానీ, మనియార్డరు ద్వారా గానీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ డైరెక్టరు, హైద్రాబాదు పేర డబ్బును పంపాలి.
5. బ్లాకుల విషయంలో అన్నివిధాలా శ్రద్ధ తీసుకోబడుతుంది. అయితే మిషనుపై బ్లాకు పగిలిన యెడల యీ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన విధం, స్థలం వివరాలను ఒక సంచికలో ప్రకటించాలో (భాషను తెల్పాలి) లేక 4 సంచికలలో ప్రకటించాలో స్పష్టంగా పేర్కొనాలి.
7. డబ్బు చెల్లింపు, యితర ప్రత్యుత్తరాలను దిగువవారితో జరుపాలి :—

డైరెక్టర్,

సమాచార పౌరసంబంధాల శాఖ,

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం,

**హైదరాబాద్-1.**



# మన జాతీయ విహంగం

**పి. సి. జైన్**

సుందర భారతావని తూర్పువైపున గల భూభాగమంతా పక్షులూ, పూలూ, నదులూ, కొండలూ, కోనలతో అలరారిన ప్రదేశం. అనాదిగా ఇవన్నీ మన సాహిత్యంలో, చిత్రశిల్ప కళల్లో, కవిత్వంలో చొచ్చుకుపోయాయి. వాటిని ఉద్దీపింపజేస్తూ వస్తున్నాయి. నిజానికి భారతదేశంలోని వ్యక్తి జీవితంతో ఇవన్నీ బలంగా లతలా పెనవేసుకుపోయాయని చెప్పవచ్చు.

ఈ దేశంలోని కవులు రంగురంగుల ప్రకృతిమధ్య జీవించి, ప్రకృతిలోని అపార సౌందర్యనిధినీ, సుందర రూపాలనూ మన కళ్ళముందు చిరస్థాయిగా దిగవిడచి వెళ్ళిపోయారు. అపారమైన పక్షిగణాలలోనుండి మన దేశంలోని కవి మయూరాన్ని ఎన్నుకున్నారు. కళ్ళను చెదిర్చేరంగులు, వెల్లివిరిసిన ఆనందాన్ని వ్యక్తం చేసే నర్తన పాదాలు, పరిసరాలూ పచ్చని తరుగుల్మాలతో కలిసిపోగల స్వభావం, మారుతున్న ప్రకృతికి, ఋతువులకు అనుగుణంగా అది పొందేమార్పు— వీటన్నిటి దృష్ట్యా పక్షిగణాలలో మయూరమే కవి హృదయానికి అతిసన్నిహితంగా వచ్చింది.

## సౌందర్య సాధనం

నిరంతర రసమయ జగత్తుకు మయూరం ప్రతినిధి అనీ, బాహ్యజగత్తుకు చిహ్నమనీ సంస్కృత కవులలో అగ్రగణ్యుడు కాళిదాసు వ్యక్తంచేశాడు. ఋతువులు ఆరింటిలోనూ మయూరాన్ని ప్రతిష్టించి, సాహిత్యం ద్వారా దానికి శాశ్వత పీఠాన్ని వేశాడు. బండలుకరిగే ఎండల గ్రీష్మంలో దాని జన్మవిరోధిసర్పం దాని నీడలోనే సేదదీర్చుకోవలసి వచ్చిన పరిస్థితికి కవి మయూరం మీద సానుభూతి చూపలేకపోయాడు. వర్షఋతువులో పురివిప్పి మయూరం ఆడుతుంటే ఎగిరొచ్చిన తేనెటీగలు మయూరం తోకలో వెదజల్లినట్టున్న నెమలి కన్నుల్నిచూసి, అవి విడవడానికి సిద్ధంగావున్న ప తామర మొగ్గలో అని భ్రమపడి వాటిమీద వాలాయట. నిజానికి వర్షఋతువు నెమళ్ళ హృదయాలలో ఆనందం హోరుయెత్తించి పొర్లి ప్రవహింపజేసి నర్తింపజేస్తుంది. అందానికీ ఆటకు ప్రసిద్ధికెక్కిన మయూరం శరత్కాలంలో కనిపించకపోయేసరికి దాని అందచందాల విలువా, నర్తనపాదాల విలువా మరింత స్ఫుటంగా మనకు తెలిసివస్తాయి.

పెంపుడు నెమళ్లు తీవిగా ఒకయింటి కప్పునుంచి మరొక ఇంటికప్పుమీదకు ఎగురుతూ పోతున్నట్టు అభిజ్ఞాన శాకుంతలంలో కాళిదాసు వ్రాశాడు. మేఘదూతంలో అలకాపురిని వర్ణిస్తూ పెంపుడు మయూరాలు గొంతెత్తి అరుద్దామని మెరిసే తమ మెడల్ని అలవోకగా సాచాయని వ్రాశాడు.

అలకాపురిలో యక్షుని యింటిలో పక్షులగురించి అని అమర్చిన దండెమీద వాలిన నెమలినిచూసి యక్షిణి చరచిన చప్పట్ల శబ్దానికి నెమలి చేసిన నృత్యాన్ని కవి చాలా హృద్యంగమంగా వర్ణించాడు. చెట్లమధ్య, వజ్రాలు తాపిన బంగారపు దిమ్మె అమర్చిన దండెంమీద నిలుచున్న నీలికంఠి నెమలి; సాయం సంధ్యవేళ యక్షిణి చరచిన చప్పట్లకు ఆమె ముంజేతి కంకణాల మధురిమ నిస్వనాలు గాలిలో వీనులవిందై, పసందై ఎగిరినవేళ నెమలి నృత్యం చేసిందట.

మయూరం దేవతలకు ప్రీతిపాత్రమైన పక్షి. దేవగణాధి నాయకుడూ, పరమశివుని తనయుడు అయిన కార్తికేయునికి మయూరం వాహనం. అంతేకాదు దేవతల రాజు సహస్రాక్షునికి ప్రియ శకుంతలం. రావణాసురునికి భీతిల్లి ఒకసారి దేవుళ్ళందరూ స్వీయరక్షణార్థమూ పక్షుల శరీరాల్లోకి ప్రవేశించి దాగున్నారని రామాయణం చెప్తున్నది. ఇంద్రుడు నెమలి ఆకారాన్ని ధరించాడు. తనకు రక్షణ కల్పించిన నెమలిపై

ఇంద్రుడికి అభిమానం కలిగి, దానికి సర్పాల వల్ల భయం కలుగకుండానూ, శరీరంమీద తోకవైపున వెయ్యి నెమలి కన్నులు ఏర్పడేట్టుగానూ, తాను వర్షాన్ని కురిపించే సందర్భంలో దానికి ఆనందోత్సాహాలు అవధుల్ని అధిగమించి పొర్లి ప్రవహించేట్టుగానూ వరం యిచ్చాడు.

రాతితో, కంచుతో, ఎర్రమట్టితో అనాదిగా నెమలి శిల్పి చేతుల్లో అందచందాలు దిద్దుకొంటూ అతని మనసులో ఇంద్రధనుస్సు రంగుల్ని నింపుతూ వస్తోంది. మానవ జీవితంతో మయూరానికి విడదీయలేని సంబంధం పెనవేసుకుని వున్నదనీ కళా ప్రాంగణంలో మయూరం కొంగ్రొత్తరంగవల్లులు తీర్చిదిద్దడానికి ఆలంబన అని సర్వులూ అంగీకరించినదే. మధ్యయుగారంభంలో మయూరాన్ని కార్తికేయునికి వాహనరూపంలోనూ, విడిగానూ చిత్రిస్తూ వుండేవారు. క్రీస్తుశకం పదవశతాబ్దంలో చోళరాజుల కాలంలో కార్తికేయుని వాహనంగా సుందరమైన నెమళ్లు రాజసం ఉట్టిపడుతుండగా ఠీవిగానిలిచి పాదాల గోళ్ళతో పాముల్ని పట్టుకుని వున్నట్టు కంచు విగ్రహం ప్రతిమలు చెక్కబడుతుండేవి. అందమైన నెమలికన్నులతో మనోహరంగావున్న నెమలిని కార్తికేయుడు అధిష్ఠించినట్టుగా 14–15 వ శతాబ్దపు విజయనగర శిల్పకలలో చెక్కబడివున్నది-

## వివిధకళా ప్రాంగణాల్లో నెమలి

ఇంద్రధనుస్సు రంగుల్ని వెదజల్లే నెమలి కన్నులు సౌందర్యానికి చిహ్నాలు. ఇవి విసనకర్రలు మొదలయిన నిత్యావసర వస్తువుల్ని, అందమైన అలంకార సామగ్రిని తయారు చేయడానికి వుపయోగపడుతాయి. చిత్రకారులు చిత్రించిన చిత్రాలనుచూస్తే శ్రీ కృష్ణుడు నెమలి కన్నుల్ని కిరీటంలో ధరించి గౌరవించినట్టు అర్థమవుతుంది. నెమలికన్నుల్ని పూర్ణచంద్రబింబంతో పోల్చి చెప్పుతుంటారు. చంద్రకళలతో నెమలికన్నులు తళుకుజిలుగులు విరజిమ్ముతాయని కూడా చెప్తుంటారు. ఒక్కొక్కగారి నీలికలువ ఉత్పలతో నెమలి కన్నును పోలుస్తుంటారుకూడాను.

మనదేశంలో దంతం, గాజు లోహము మొదలయిన వాటితో తయారుచేసే చిత్ర, శిల్పకళా ఖండాల్లో నెమలి ఎంతగానో అలంకారయుతంగా వుపయోగపడతున్నది. మయూరపంకి పడవలను గూర్చి తెలియజేసే కథలనేకం బెంగాలులో ప్రచారంలో వున్నాయి. ఇందులో చాంద్ సౌదాగర్ అనే వణిజప్రముఖుని కథ ప్రసిద్ధమయినది. కథియవార్, సౌరాష్ట్రలలోని గౌనులు, జాకెట్టుల అంచుల్లో నెమలిడిజైనులు – ఒక్కొక్కప్పుడు పురివిప్పని నెమళ్ళు - కనిపిస్తాయి. దక్షిణాది తంజావూరులోనూ- లోహపు పనితననంవున్న యితర ప్రాంతాలలోనూ దీపపు శెమ్మాలలో నెమళ్ళు దీపశిఖలను నిలుపుతున్నట్టు తయారు చేస్తుంటారు. అలాంటి డిజైన్లలో నెమలికి పవిత్రత ఆపాదించబడి భగవదారాధనా కార్యాలకు వుపయోగించబడుతుంది.

నెమలి వొంటిమీద ఇంద్రధనస్సు ప్రతిఫలించిన రంగుల్లాంటి తళతళలాడే రంగురంగుల వెంట్రుకలనుబట్టి యిది భారతదేశంలోనే కాక యితరదేశాల్లో కూడా బాగా ప్రసిద్ధికెక్కింది. సలూమాన్ ఆస్థానాన్ని మయూరం అలంకరించిందని చెప్తారు. "మూడేళ్ళకొకసారి వెండి బంగారాలను - దంతము వానరాలను - మయూరాలను తెరిషషానౌక తీసుకొచ్చేది" అని బైబిలులోకూడా దీనిని గూర్చిన ప్రస్తావనవుంది. గ్రీకుఇతిహాసాల్లో కూడా జూనోకు మయూరం ప్రీతిపాత్రమైన పక్షిగా వున్నట్టు వ్యక్తపరచబడింది. అలెగ్జాండరు కాలంలోనే నెమలి గ్రీకు దేశానికి కొనిపోబడిందని కొంతమంది చెప్తే- పెర్సితెస్‌కు ముందునుండికూడా గ్రీకులకు నెమలినిగూర్చి తెలుసని మరి కొందరి అభిప్రాయం.



# సాంద్రవ్యవసాయ కార్యక్రమం

ఫోర్డు ఫౌండేషన్ ఏర్పాటు చేసిన వ్యవసాయ ఉత్పత్తి బృందమువారు వ్యవసాయ ఉత్పత్తికి తీవ్రమైన కృషి చేయడానికి కొన్ని ప్రాంతాలను సెలక్టు చెయ్యాలని సిఫారసుచేస్తూ భారతదేశంలో ప్రస్తుతం ఉన్న . తక్కువపంట దిగుబడికి భూమి, వాతావరణం, యితరభౌతిక కారణాలేవీ హేతువుకావనే అభిప్రాయాన్నే వెల్లడించారు. అందువల్ల ప్రతి రాష్ట్రంలోను గరిష్ట పరిమితిలో అధిక ఉత్పత్తిశక్తి ఉండే ఎంపికైన పైర్లను ఎంపికైన ప్రాంతాలను సెలక్టు చేయాలని యీ బృందం వారు సూచించారు.

ఈ ప్రతిపాదనలను అనుసరించి ఎంపిక అయిన రాష్ట్రాలలోని ఒక్కొక్క జిల్లాలో "సాంద్ర వ్యవసాయపథకం" అని బహుళ ప్రచారంలో ఉన్న తీవ్రతర వ్యవసాయ జిల్లా కార్యక్రమాన్ని చేపట్టడం జరిగింది. ప్రారంభదశలో ప్రయోగాత్మక ప్రాతిపదికపై 1960—61 వ సం॥ లో సెలక్టు అయిన ఏడు జిల్లాలకు మూడు జిల్లాలలో — ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ గోదావరి, మద్రాసు రాష్ట్రంలో తంజావూరు, బీహార్‌లో షాహబాదు జిల్లాలలో యీ కార్యక్రమాన్ని అమలు జరపడం ప్రారంభించారు. మరుసటి సంవత్సరం మిగతా నాలుగు జిల్లాలు — ఉత్తర ప్రదేశ్‌లో అలీఘర్, పంజాబులో లూథియానా, రాజస్థాన్‌లో పాలీ మధ్య ప్రదేశ్‌లో రాయపూర్ జిల్లాలలో యీ కార్యక్రమాన్ని అమలు జరిపారు.

## ముఖ్య ఆశయాలు

రైతులకు కావలసిన అవసరా లన్నిటినీ సాధ్యమైనంత స్వల్ప వ్యవధిలో సరఫరాచేసి వ్యవసాయ ఉత్పత్తులను అధికం చేయడమే యీ కార్యక్రమం ముఖ్యాశయం. ఐదు సంవత్సరాల కాలంలో రు. 100 లక్షల ఖర్చుతో యీ కార్యక్రమాన్ని అమలు జరుపుతారు. అంగీకృత దామాషాలో ఫోర్డు ఫౌండేషన్, భారత ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వం సంయుక్తంగా పై మొత్తాన్ని లభింపజేస్తాయి.

యీ కార్యక్రమం ప్రధాన అంశాలను దిగువ ఇవ్వడం జరిగింది :

(అ) ప్రతిరైతుకు వ్యవసాయ ఉత్పత్తి ప్రణాళికను తయారుచేయడం; (ఆ) ఉత్పత్తి ప్రణాళికను అనుసరించి మేలు రకం విత్తనాలు, క్రిమిసంహారక మందులు, ఎరువులు మొదలైన అవసరాలను మదింపు వేయడం; (ఇ) రైతుకు కావలసిన యీ అవసరాలను పూర్తిగా తగిన సమయంలో అందజేయడం; (ఈ) రైతుల అవసరాలను ఆదుకోవడానికి తగిన పరపతి అందజేయడం; (ఉ) శాస్త్రీయ దృక్పథం అలవడడానికి వీలుగా రైతుల క్షేత్రాలలో ఎక్కువ సంఖ్యలో ప్రదర్శనలను ఏర్పాటు చేయడం.

ఆంధ్రప్రదేశ్‌లో పశ్చిమ గోదావరి జిల్లాలో 1960—61 వ సం॥ రాబీ పంట కాలంలో యీ కార్యక్రమాన్ని ప్రారంభించారు. 20 బ్లాకులలో వరి, చెక్కెర, మిరప, అరటి పంటలతో ప్రారంభించి, 1963 ఖరీఫ్‌కాలంనుంచి పశ్చిమ గోదావరి జిల్లాలోని మొత్తం 20 బ్లాకులలో పొగాకు, వేరుశనగ, ఫలాలు, కూరగాయలు, కొబ్బరి పంటలకుకూడా యీ కార్యక్రమాన్ని వర్తింపజేశారు.

## అధికోత్పత్తి

ఈ కార్యక్రమ ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. మొదటి రాబీకాలంలోనే గడచిన మూడుసంవత్సరాల సగటుఉత్పత్తి కన్నా వరిధాన్యం క్రింద 38 శాతం, మిరప క్రింద 22 శాతం అధికోత్పత్తి సాధించబడింది. ఆ తర్వాతి సంవత్సరాలలోకూడా యీ ప్రగతిస్థాయిని కొనసాగించారు. 1963—64 వ సంవత్సరంలో పంట కోతకు వచ్చేకాలంలో భారీవర్షాలు వచ్చినప్పటికీ సాంద్రవ్యవసాయ పథకం అమలుకుపూర్వం మూడు సంవత్సరాల సగటు ఉత్పత్తి 1769 పౌండ్లు ఉత్పత్తికన్నా యీ సంవత్సరంలో సగటు ఉత్పత్తి 2296 పౌండ్లకు పెరిగింది. 1957—58 నుంచి 1959—60 సంవత్సరాల ఉత్పత్తికన్నా 1960—61 నుంచి 1962 - 63 సంవత్సరాలలో అదనంగా 1,37,107 మెట్రిక్ టన్నుల బియ్యం ఉత్పత్తి జరిగింది.

రైతుల అవసరాలన్నిటినీ సకాలంలో ఆదుకొని, శాస్త్రీయ సేద్యపు విధానాలను అనుసరించిన యెడల అన్ని ముఖ్యపంటల ఎకరా రాలుబడిని స్వల్ప కాలంలో అధికం చేయడం సాధ్యపడుతుందని పశ్చిమ గోదావరి జిల్లాలో సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అమలు ద్వారా కలిగిన అనుభవం ద్వారా వెల్లడయింది.

## సవరించబడిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం

పశ్చిమ గోదావరిజిల్లాలో గతమూడు సంవత్సరాలుగా అమలు జరుపబడుతున్న తీవ్రతర వ్యవసాయజిల్లా కార్యక్రమం ఫలితాలు ప్రోత్సాహకరంగా ఉన్న దృష్ట్యా నూ,

( మిగతా 63 పేజీలో )

(7వ పేజీ తరువాయి)

సరఫరా విషయంలో చేసుకోవలసిన గమ్యాలను నిర్ణయించారు. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా విషయాల్లో కూడ శ్రద్ధ తీసుకొన్నారు. బోకారో ఉక్కు కర్మాగారానికి అత్యధిక ప్రాముఖ్యంఇచ్చారు. ఆర్థికమైన తదితరములైన సహాయ సంపత్తులమధ్య, మనము చేరుకోవలసిన గమ్యాలమధ్య అధికమైన అంతరం ఉన్నప్పటికీ ఈ అంతరం మూడవ పంచవర్ష ప్రణాళికయొక్క ప్రాథమిక ఆశయాలను సాధించటానికి అడ్డురాదని నెహ్రూజీ వాంఛించారు. ఇట్టి ప్రగాఢమైన విశ్వాసం నెహ్రూజీ వంటి ఔన్నత్యం, సామ్రాజ్యం కల వ్యక్తియందే అభివ్యక్తం కాగలదు. తృతీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను కులూ లోయలో సుదీర్ఘంగా పరిశీలించిన పిమ్మట నెహ్రూజీ కొన్ని నిర్ణయాలకు వచ్చారు. అవి అన్నీ తృతీయ పంచవర్ష ప్రణాళిక యొక్క రిపోర్టులో ప్రథమాధ్యాయంగా రూపొందాయి.

"ప్రణాళిక లన్నవి నిరంతరంగా కొనసాగవలసిన కార్యక్రమం, వాటిని స్వల్పవ్యవధులకు పరిమితం చేయటం సాధ్యంకాదు. తృతీయ పంచవర్షప్రణాళిక ప్రథమ-ద్వితీయ పంచవర్ష ప్రణాళికలకు ఉత్తర భాగమునూ, చతుర్థ-పంచమాది ప్రణాళికలకు పూర్వభాగమున్నూ అవుతోంది. నిర్ణయింపబడిన గమ్యాలను చేరుకోవటానికి ఈ ప్రణాళికలనేవినిరంతరంగా కొనసాగవల్సినఉద్యమం కాబట్టి ఆయా విషయాల్లో తీసికోవలసిన ప్రధాన నిర్ణయాలన్నీ ప్రణాళికల లక్ష్యాలనూ, వాటి వెనుకనుండే సాంఘిక ప్రయోజనాలనూ బాగా గుర్తించినవారిచేతనే తీసికోబడాలి. కేవలం అయిదు సంవత్సరాల సమయాన్ని గూర్చి మాత్రమే ఆలోచించేటప్పుడుకూడ ముందుచూపు, దీర్ఘకాలిక ప్రణాళికా దృష్టి విస్మృతం కారాదు. కాబట్టి దీర్ఘకాలిక దృష్టి అనేది ప్రణాళికా రచనలోని సారమని చెప్పవచ్చు. ఈ కార్యక్రమాలు క్రమ పద్ధతిలో నిర్వహింపబడినప్పుడు ప్రజలలో అభివృద్ధి సూచకమైన ఒక సంచలనం కలిగి, అది వారిని కార్యోన్ముఖులుగా, సాధనాపరులుగా తీర్చిదిద్దుతుంది. వారు జీవిత ప్రయోజనాన్ని గుర్తించగలిగి, చరిత్ర నిర్మాణంలో తాము కూడ భాగస్వాములమన్న తృప్తిని పొందుతారు. చివరకు, మానవత్వం యొక్క అభివృద్ధి, మానవ వ్యక్తిత్వం యొక్క అభివృద్ధి అన్నవి మాత్రమే గణనీయాలవటం స్పష్టం. ప్రణాళికా నిర్వహణంలో వస్తుసంచయమేకాక మానవ శక్తికూడ వినియోగపడటం అత్యంత ముఖ్యం. భారాలతో, సమస్యలతో సతమతమవుతున్న భారత ప్రజలు నేడు-నిర్మాణంలో తాము సహాయపడుతున్న - ఒక క్రొత్త ప్రపంచం సరిహద్దుల్లో నివసిస్తున్నారు. ఈ సరిహద్దును దాటాలంటే - ధైర్యం, కార్యోన్ముఖత్వం, సహనశీలం, కష్టపడి పనిచేసే శక్తి, భవిష్యత్తును గూర్చిన ఆశాపూరితమైన దృష్టి ప్రజలు అవశ్యం కలిగి ఉండాలి."

తృతీయ పంచవర్ష ప్రణాళిక రెండవ సంవత్సరంలో చైనాభూతం మన ద్వారాల దగ్గరకు వచ్చేసింది. అంతటా నిరాశ, భయాందోళనలు వ్యాపించాయి. ప్రణాళికను విడనాడక తప్పదని కొందరు సూచించారు. కాని నెహ్రూజీ సహజ బద్ధమైన నిశ్చింతతో, పర్వతంవలె అచంచలంగా నిలిచారు. ప్రగాఢమైన విశ్వాసంతో ప్రణాళికలను విడనాడరాదని నిర్ణయించటమే కాక ప్రణాళికా లక్ష్యాలను శీఘ్రగతిని సాధించాలనీ, ద్విగుణీకృతమైన శక్తియుక్తులతో, విశ్వాసంతో శత్రువు నెదుర్కోవాలనీ వాంఛించారు.

మనదేశాభివృద్ధి విషయంలో - ప్రతి దశలోను - నెహ్రూజీ వ్యక్తిత్వం సుస్పష్టము కాగలదు. నెహ్రూజీకి ముందున్న మహానాయకులు దేశానికి నైతికబలాన్ని, స్వాతంత్ర్యాన్ని ప్రసాదించారు. ఝాన్సీరాణి, అసంఖ్యాక స్వాతంత్ర్య సమర యోధులు, స్వదేశంకోసం ఆత్మార్పణం చేసిన విప్లవవీరులు, మహానాయకులైన దాదాభాయి నౌరోజీ, బాలగంగాధరతిలక్, లాలా లజపతిరాయ్, చిత్తరంజనదాస్, గోవిందరానడే, సావర్కార్, శ్రీఅరవింద, అనీబిసెంటు, ఆలీ సోదరులు, మోతీలాల్ నెహ్రూ, సరోజినీనాయుడు, రాజగోపాలాచారి, బాబూ రాజేంద్రప్రసాద్, సర్దార్ వల్లభాయిపటేల్, మౌలానా అబుల్‌కలాం ఆజాద్, ఖాన్ అబ్దుల్‌గఫార్‌ఖాన్, నాగేశ్వరరావు పంతులు, వేంకటప్పయ్యపంతులు, ప్రకాశం పంతులు, సుభాష్‌చంద్రబోసు, ఇంకా దేశంకోసం పోరాడిన మరెందరో జ్ఞాత - అజ్ఞాత శాంతి సైనికులు, చివరన మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ మానవ ఔన్నత్యంలో ఎంతో కన్నుల పండువైన దృశ్యం. మానవ చరిత్రలో ఎంతో ఉదాత్తము కీర్తనీయము అయిన అధ్యాయం. ఈ వారసత్వాన్ని అంతా సమీకరించి, మన కిచ్చి పోయారు నెహ్రూజీ. దీనికి మనం అర్హులమేనా ?

*నెహ్రూజీకి మనం తగినవారసులమా?*

1964 మే నెల 27వ తేదీ మధ్యాహ్నం ఒక క్షణంపాటు ప్రతి భారత పౌరునీ, ముఖ్యంగా ప్రతి కాంగ్రెసువాదినీ ఎదుర్కొన్న సమస్య యిది. కాని, వెనువెంటనే మానవాకాశంలో తృప్తి తళుక్కుమన్నది. మహాత్ములైన వారు తమ తమ జీవితకాలాలలో మాత్రమేకాక క్షణికాలైన ఈ దేహాలను త్యజించిన పిమ్మటకూడా మహాత్ములే.

చరిత్రకెక్కిన మహాపురుషు లందరూ, ఇట్టి వారే. ఇందులకు మనకు సన్నిహితమైన ఉదాహరణం మహాత్మాజీయే. ఆయన సందేశాలు — ప్రేమ, అహింస, శాంతి అనేది — ఆయన మరణించినపిమ్మట మరింతగా వ్యాప్తి చెంది, ప్రపంచా న్నంతటినీ ఆవరించాయి. లాల్‌బహదూర్ శాస్త్రీజీ భారతదేశ ప్రధానమంత్రిగా — ఏకగ్రీవంగా ఎన్నుకోబడటంలో నిరాశాప్రవక్తల విపరీత సూచనలు అసహ్యాలై పోయినాయి. గాంధీజీ — నెహ్రూజీలు దేశాన్ని వివేకవంతం చేశారు. భారతదేశ మిప్పుడు సంరక్షకుని నిరంతర పర్యవేక్షణ అపేక్షించే మైనర్ కాదు. నిరాడంబరత్వం, సత్యం, వివేకం, ప్రగాఢశీలం మూర్తీభవించిన మహానీయుడు మన ప్రధానమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రీజీ. అనుభవశాలి అయిన మహానాయకుడు శ్రీ కామరాజ్ సహాయంతో ఇటీవలి పంజాబు వ్యవహారాన్ని ఆయన పరిష్కరించిన విధానం చూస్తే — పలువురి జోస్యాలకు భిన్నంగా — ఈయన ఎంతటి స్థిరప్రజ్ఞుడో తెలియగలదు. ఇంతకంటె అధికమైన సవాళ్ళనుకూడ మన ప్రధానమంత్రి ఎదుర్కొనవలసి రావచ్చు. అయినప్పటికీ, కాంగ్రెసు నాయకుల తోడ్పాటుతో, భారత ప్రజల సహకారంతో ఆ సమస్యల నన్నింటినీ ఆయన దృఢచిత్తంతో, ప్రగాఢ విశ్వాసంతో ఎదుర్కొని పరిష్కరించ గల రనటంలో ఎట్టి సందేహంలేదు.


ఆధారాలు :

1. భారతప్రభుత్వ దుఃఖం.
2. జవహర్‌లాల్ నెహ్రూ : పంచవర్ష ప్రణాళికలు.
   శ్రీ త్రిలోక్ సింగ్.
3. నెహ్రూ : శాంతి ప్రవక్త.
   శ్రీ ఎమ్. ఎ. రమణారావు.
4. 25–6–1964 తేదీనాటి ఎకనామిక్ రివ్యూ సంపాదకీయం.


---

(మిగతా 61 వ పేజీ తరువాయి)

చెప్పుకోదగిన పరిమాణంలో బియ్యం నిలవ చేయడానికీ, జొన్నలు, రాగులు, మొక్కజొన్న, చెరకుగడ, వేరుశనగ, పత్తి, అరటి, కూరగాయలు మొదలైన యితర పంటల ఉత్పత్తిని అధికం చేయడానికీవీలుగా తూర్పుగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, నిజామాబాదు, వరంగల్లు, కరీంనగరం, మహబూబునగరం జిల్లాలలో 1963 ఖరీఫ్‌పంట కాలంనుంచి సవరించబడిన ప్యాకేజి పథకాన్ని అమలు జరుపుతున్నారు.

నమ్మకంగా తగినంత వర్షాపాతం ఉండి నీటిపారుదల సౌకర్యం ఉన్న ప్రాంతాలలోని రైతుల వ్యవసాయ అవసరాలన్నిటిని సరఫరా చేయడంలో దృష్టిని కేంద్రీకరించడం ద్వారా త్వరితగతిని అధికాహారోత్పత్తి సాధించవచ్చు. 1963 సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌లోని 150 బ్లాకులలో 40 శాతం మేరకు సవరించబడిన యీ పథకాన్ని అమలు చేశారు.

1961 – 65 లో యీ బ్లాకు లన్నిటిలో 70 శాతం మేరకు యీ పథకాన్ని వర్తింప జేయాలని ప్రతిపాదించారు. మూడవ ప్రణాళికాంతానికి యీ బ్లాకుల ప్రాంతం మొత్తానికి వర్తింప జేయడం జరుగుతుంది.

ప్రతిరైతుకు విత్తనాలు, ఎరువులు, క్రిమి సంహారక ఔషధాలు, పరపతి, సాంకేతిక 'విషయపరిజ్ఞానం' వగైరాలను అందజేయడమే యీ పథకం ఉద్దేశం. రైతులకు ప్రోత్సాహంలభించే విధంగా వారికి అవసరమైన మేరకు పరపతి లభింప జేయడంకూడా చాలా అవసరం. తద్విధంగానే వరివిత్తనాలు, క్రిమి సంహారక మందులు, పైర్ల రక్షణ పరికరాలు, ఆధునిక వ్యవసాయ పరికరాల కొనుగోలుకై రైతులకు సబ్సిడీలు అందజేయడానికి రు 9.00 లక్షలు ఖర్చు చేశారు. యితోధిక ఎరువుల వాడకం, పథకం. తక్కావీ క్రింద రైతులకు రు 37.25 లక్షలు మేరకు పరపతి లభింపజేశారు.

వీటికి తోడు సాధారణ పరపతి పరిమితుల క్రింద సహకార కేంద్ర బ్యాంకులు ఋణాలు మంజూరు చేశాయి. భారత ప్రభుత్వం ద్వారా ఉదారంగా యితోధిక పరపతి సౌకర్యాలు లభింపజేసే ప్రశ్నకూడా ప్రస్తుతం ప్రభుత్వ పరిశీలనలో ఉంది. ప్యాకేజి కార్యక్రమం అమలులో ఉన్న గ్రామా లన్నిటిలో ఆధునిక వ్యవసాయ పద్ధతులు అనుసరించిన ప్రదర్శక క్షేత్రాలను నెలకొల్పారు.

యీ పథకం ద్వారా ఉత్తమ ఫలితాలు కలుగవచ్చు నని ఆశించ బడుతున్నది. ★



### అనంతపురం జిల్లా

శిక్షణ శిబిరం:

గుత్తి పంచాయతీ సమితిలోని జక్కుల చెరువు గ్రామంలో జనవరి 10 వ తేదీనుండి మూడు రోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. వ్యవసాయం, పశు పోషణ, యితర అభివృద్ధి కార్యకలాపాలలో యాభై మందికి ఇక్కడ శిక్షణ యివ్వడం జరిగింది.

### చిత్తూరు జిల్లా

వరివిత్తుల పంపకం:

మదనపల్లి పంచాయతీ సమితిలోని తంబళ్ళపల్లిలో డిశంబరునెలలో 533 మణుగుల మేలుజాతి వరివిత్తుల పంపకం **జరిగింది.**

### గుంటూరు జిల్లా

శిక్షణ శిబిరం:

ప్రత్తిపాడు పంచాయతీ సమితికి చెందిన నిమ్మగడ్డవారి పాలెంలో జనవరి 10వ తేదీ నుండి మూడురోజులపాటు గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది.

పంపింగ్ స్కీమ్:

డిశంబరు 26 వ తేదీన పద్మావతీపురంలో కనకదుర్గా లిఫ్టుఇరిగేషన్ పంపింగ్ స్కీముకు ప్రారంభోత్సవం జరిగింది.

వివాహ, సమావేశ హాలు:

తెనాలిలోని శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానంలో కొత్తగా నిర్మించబడిన వివాహ, సమావేష హాలుకు డిశంబరు 25వ తేదీన ప్రారంభోత్సవం జరుపబడింది.

శిక్షణ శిబిరం:

గురజాల పంచాయతీ సమితిలోని తేలుకుంట్ల గ్రామంలో డిశంబరు 21వ తేదీ నుండి మూడురోజుల పాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది.

కమ్యూనిటీ హాలు:

పిడుగురాళ్ళ పంచాయతీ సమితిలోని ముత్యాలమ్మపాడులో డిశంబరు 28వ తేదీన కమ్యూనిటీహాలుకు ప్రారంభోత్సవం జరిగింది.

### హైదరాబాద్ జిల్లా

ఆటలు, క్రీడలు

డిశంబరు 28 వ తేదీన బొల్లారం ఉన్నత పాఠశాలలో జిల్లా ఆటలు, క్రీడల పోటీలకు ఆర్థికశాఖామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

గ్రామసహాయకుల శిబిరం:

చేవెళ్ళ సమితి తాలూకా మల్కారం గ్రామంలో స్త్రీల కొరకై ఒక గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది. దీనిలో50 మంది స్త్రీలుపాల్గొన్నారు.

### ఖమ్మం జిల్లా

నీటిపారుదల పథకం:

మధిరతాలూకా మాసవరం గ్రామంలోని కాలువకు ఆనకట్ట నిర్మించేందుకై డిశంబరు 25 వ తేదీన రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రిశంకుస్థాపనచేశారు.

కొత్తగూడెం పంచాయతీ సమితి కాకర్ల గ్రామంలో ఎర్రవాగు ప్రాజెక్టుకు మంత్రి శంకుస్థాపన చేశారు.

### కర్నూలు జిల్లా

సమాచార కేంద్రం:

కార్మిక, రవాణా, సమాచార శాఖ మంత్రి డిసెంబరు 26వ తేదీన కర్నూలులో జిల్లా సమాచారకేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

### మహబూబ్‌నగర్ జిల్లా

శిక్షణ శిబిరం:

ఆమనగల్లు పంచాయతీ సమితికి చెందిన కాకర్లపాడు గ్రామంలో ప్రత్యేక గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహించబడింది. ఈ శిబిరంలో 50 మంది పాల్గొన్నారు.

శిక్షణ శిబిరం:

అచ్చంపేట పంచాయతీ సమితికిచెందిన మారెళ్ళపల్లి గ్రామంలో డిశంబరు 28వ తేదీనుండి మూడురోజులపాటు సమీకృత వ్యవసాయ ఆహారోత్పత్తి, కుటుంబ నియంత్రణలపై మూడు రోజులపాటు గ్రామసహాయకుల శిక్షణ శిబిరం నిర్వహించబడింది.

### మెదక్ జిల్లా

పాఠశాలా భవనం:

చేకుమల్‌లో జిల్లా పరిషదున్నత పాఠశాల కొత్తభవనానికి డిశంబరు 31వ తేదీన

ప్రగతి పథంలో

ప్రారంభోత్సవం జరిగింది.

సహకార సంఘం :

కోయిర్ గ్రామంలో డిశంబరు 26వ తేదీన చర్మకారుల పారిశ్రామిక సహకార సంఘం భవనానికి జిల్లాకలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

విద్యుదీకరణ :

జహీరాబాదు పంచాయతీ సమితిలోని మన్నాపూర్ గ్రామంలో డిశంబరు 26వ తేదీన రాష్ట్ర విద్యుచ్ఛక్తి మండలి అధ్యక్షుడు వీధి దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

శిక్షణ శిబిరం :

దుబ్బాక పంచాయతీ సమితికి చెందిన ఘామ్‌పల్లి గ్రామంలో డిశంబరు మొదటి వారంలో గ్రామ నాయకుల శిక్షణ శిబిరం ఒకటి నిర్వహింపబడింది. ఈ శిక్షణ కార్యక్రమంలో అరవై మంది పాల్గొన్నారు.

నల్గొండ జిల్లా

వాసెక్టమీ శిబిరం :

ఆలైర్ పంచాయతీ సమితికి చెందిన బహదూర్‌పేట గ్రామంలో వాసెక్టమీ శిబిరం ఒకటి నిర్వహించబడింది.

వ్యవసాయ కార్యక్రమం :

చింతలపల్లి పంచాయతీ సమితిలో రెండు వందల ఎనభై రెండు మణుగుల మేలుజాతి విత్తనాలు 453 మణుగుల రసాయనికపు ఎరువులూ పంపిణీ చేయబడ్డాయి.

యువక శిబిరం :

డిశంబరు 19 నుండి మూడు రోజుల పాటు వెల్మకాన గ్రామంలో ప్రత్యేక యువక శిబిరం నిర్వహించబడింది. మునుగోడు పంచాయతీ సమితికి చెందిన యువక మండలు అన్నిటినుండీ మొత్తం 60 మంది ప్రతినిధులు యీ శిక్షణ శిబిరంలో పాల్గొన్నారు.

నెల్లూరు జిల్లా

సైన్సు ప్రదర్శన :

నెల్లూరు వి. ఆర్. కళాశాల హైయ్యర్ సెకండరీ పాఠశాలలో డిశంబరు 28వ తేదీన మూడురోజులపాటు జరిగే జిల్లా సైన్సు ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిగింది.

శ్రమదానం :

కాకుటూరు పంచాయతీ సమితి తాలూకు భిర్తవారిపాలెం గ్రామీణ స్వచ్ఛంద సేవాదళ సభ్యులు డిశంబరు నెలలో శ్రమదానంతో ఎలిమెంటరీ పాఠశాల నిమిత్తం ఒక చొప్పగడ్డి గృహాన్ని నిర్మించారు.

నిజామాబాదు జిల్లా

సహకార చక్కెర ఫ్యాక్టరీ :

సారంగపూర్‌లో నిజామాబాదు సహకార చక్కెర ఫ్యాక్టరీకి డిశంబరు 24వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జిల్లా క్రీడలు :

డిశంబరు 27వ తేదీనుండి మూడు రోజులపాటు జిల్లా క్రీడలు నిజామాబాదులో నిర్వహింపబడ్డాయి.

వరంగల్లు జిల్లా

ఆలేరుపై ఆనకట్ట :

రొల్లకల్లు, మధసతుర్తి, ఉగ్గంపల్లి గ్రామాలలో ఆలేరునదిపై ఆనకట్టలకు డిశంబరు 24వ తేదీన శంకుస్థాపనలు జరిగాయి.

పశ్చిమగోదావరి జిల్లా

చిన్ననీటిపారుదల పథకం :

దిప్పకాయలపాడువద్ద గోపాలపురం చిన్ననీటి పారుదల పథకానికి జనవరి 8వ తేదీన పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి శంకుస్థాపన చేశారు.

యువజన కార్మికుల శిక్షణ శిబిరం :

డిశంబరు 22వ తేదీన గోపన్నపాలెంలోని జి. ఎస్. టి. కేంద్రంలో ప్రాంతీయ యువజన కార్మికుల శిక్షణ శిబిరం ఒకటి స్త్రీలకొరకై నిర్వహింపబడింది. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ జిల్లాలకు చెందిన 40 మంది స్త్రీలు యిందులో పాల్గొన్నారు. ✲

## నాటక పోటీ ఫలితాలు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధాలశాఖ, రక్షణ కృషి, ప్రణాళికా ప్రచారాలు యితివృత్తంగాగల నాటకాల పోటీని నిర్వహించింది. ఈ పోటీలో శ్రీ చిల్లర భావనారాయణ వ్రాసిన నాటకం 'కృష్ణవేణి' కి ప్రథమ బహుమతి లభించింది. ఈ బహుమతి విలువ రూ. 1000.

'జై హింద్' అన్న నాటకానికి 500 రూ. ల ద్వితీయ బహుమతి లభించింది. ఈ నాటక రచయిత 'కొలకలూరి' (అనంతపురానికి చెందిన శ్రీ కె. ఇనాక్).

ఏలూరుకు చెందిన శ్రీ ఎస్. వి. రామారావు వ్రాసిన 'అమరజ్యోతి' అన్న నాటకానికి తృతీయ బహుమతిగా రూ. 300 లు ఇవ్వబడుతుంది. ఈ పోటీకి మొత్తం 74 నాటకాలు వచ్చాయి.

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

డిశంబరు 18 : హైదరాబాదులో నౌబత్ పహాడ్‌పై ఖగోళ దూరదర్శినిని నెల కొల్పారు.

డిశంబరు 19 : హైదరాబాదులో మూడు రోజులపాటు జరిగిన కళాశాల విద్యా విషయాల మహాసభను గవర్నరు ప్రారంభించారు.

డిశంబరు 22 : రాష్ట్ర రాజధానీ నగరంలో నిర్మించిన నిజాం ఆర్థోపెడిక్ ఆసుపత్రికి రైల్వేలమంత్రి ప్రారంభోత్సవం జరిపారు.

డిశంబరు 25 : హైదరాబాదులో నాలుగు రోజులపాటు జరిగిన అఖిలభారత ఇస్లామిక్ స్టడీస్ మహాసభ ఆరంభమైంది.

24 మంది సభ్యులుగల సోవియట్ సాంస్కృతిక ప్రతినిధివర్గం హైదరాబాదుకు చేరుకున్నది.

డిశంబరు 28 : 40 వ అఖిలభారత రాడికల్ మహాసభను ముఖ్యమంత్రి కాకినాడలో ప్రారంభించారు.

భారతదేశంలో నిర్మించబడిన భారత నౌకాదళంతాలూకు మొదటి హైడ్రోగ్రాఫిక్ నౌక ఐ. ఎన్. ఎస్. దర్శక్ జల ప్రవేశోత్సవాన్ని భారత నౌకా దళాధిపతి జరిపారు.

డిశంబరు 30 : అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు 15 వ వార్షిక మహాసభను హైదరాబాదులో యూనియన్ హోంశాఖామంత్రి ప్రారంభించారు.

హైదరాబాదులో 25 వ అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనానికి కేంద్ర హోంమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జస్టిస్ పి. సత్యనారాయణ రాజుచే ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా రాష్ట్ర గవర్నరు ప్రమాణ స్వీకారం చేయించారు.

జనవరి 2 : సుప్రసిద్ధ మరాఠీ నవలా రచయిత శ్రీ హరినారాయణ ఆప్టే శతాబ్ద్యుత్సవాలను ముఖ్యమంత్రి హైద్రాబాదులో ప్రారంభించారు.

విద్యావిషయాలకు సంబంధించిన గణాంకములపై జరిగిన మూడవజాతీయ గోష్ఠికి రాష్ట్ర కార్మికశాఖామంత్రి హైద్రాబాదులో ప్రారంభోత్సవం జరిపారు.

జనవరి 4 : విజయవాడవద్ద ఇంద్రకీలాద్రిపై ప్రారంభించిన రాష్ట్రంలోని మొదటిరోడ్డు సొరంగం పనులకు కేంద్ర రవాణాశాఖ మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

జనవరి 12 : హైద్రాబాదులో అఖిలభారత చిత్రకారుల సమ్మేళనాన్ని గవర్నరు ప్రారంభించారు.

జనవరి 15 : శ్రీ వి. బి. రాజు, రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషను అధ్యక్ష పదవి స్వీకరించారు.

జనవరి 16 : కేంద్ర విద్యాశాఖా మంత్రి ఉస్మానియా విశ్వవిద్యాలయం స్నాతకోపన్యాసం చేశారు.

విద్యార్థి విద్యార్థినుల తల్లిదండ్రులు, ఉపాధ్యాయుల రెండవ జాతీయ మహాసభను డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు ప్రారంభించారు.

జనవరి 17 : మారిటియస్ ప్రధాని డాక్టర్ ఎస్. రమ్గూలమ్ రెండు రోజుల పర్యటనపై హైద్రాబాదుకు విచ్చేశారు.

## భారత దేశంలో

డిశంబరు 14 : అంతర్జాతీయ భూగర్భ శాస్త్రజ్ఞుల 22వ మహాసభను రాష్ట్రపతి ప్రారంభించారు.

డిశంబరు 23 : కొత్త రైలు మండలాన్ని స్థాపించడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయించినట్లు రైల్వేమంత్రి లోకసభలో ప్రకటించారు.

డిశంబరు 24 : పార్లమెంటు ఉభయ సభలు కాలనిర్ణయంలేకుండా వాయిదా పడినవి.

ధనుష్కోడి, దాని పరిసర ద్వీప ప్రాంతంలో బీభత్సమైన తుపాను వచ్చింది.

డిశంబరు 29 : భారతీయ చరిత్ర మహాసభ 26 వ సభ రాంచీలో ప్రారంభమైంది.

గృహవసతి శాఖామంత్రుల సమావేశం చండీఘర్‌లో ఆరంభమైంది.

జనవరి 4 : కేంద్ర ప్రభుత్వం తమ ఉద్యోగుల కరువుభత్యాలను హెచ్చిస్తూ ప్రకటన చేసింది.

జనవరి 6 : 1961 వ సం॥ రపు ఆదాయపు పన్ను చట్టానికి సవరణలు చేయడానికై రాష్ట్రపతి ఆర్డినెన్సు జారీచేశారు.

కామన్వెల్తు సంబంధాల ఏడవ మహాసభను కేంద్ర విద్యామంత్రి కొత్తఢిల్లీలో ప్రారంభించారు.

జనవరి 8 : మూడవ అంతర్జాతీయ చలనచిత్రోత్సవానికి న్యూఢిల్లీలో రాష్ట్రపతి ప్రారంభోత్సవం జరిపారు.

జనవరి 9 : భారత జాతీయ కాంగ్రెసు 69వ మహాసభ దుర్గాపూర్‌లో ఆరంభమైంది.

జనవరి 11 : పార్లమెంటు, రాష్ట్రశాసన సభల సభాపతుల మహాసభ బొంబాయిలో ప్రారంభమైంది.

జనవరి 15 : బరౌనీలో ప్రభుత్వాధ్వర్యంలో నెలకొల్పబడిన రెండవ రిఫైనరీకి కేంద్ర పెట్రోలియమ్, కెమికల్స్ శాఖా మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## విదేశాలలో

డిశంబరు 29 : ఇటలీ అధ్యక్షుడుగా సిగ్నర్ గ్యుసెప్పె సరగట్ ఎన్నికయ్యారు.

జనవరి 2 : పాకిస్తాన్ అధ్యక్షుడుగా ఫీల్డ్ మార్షల్ అయూబ్‌ఖాన్ తిరిగి ఎన్నిక అయ్యారు.

జనవరి 5 : కవి, విమర్శకుడు, నాటక రచయిత శ్రీ టి. ఎస్. ఇలియట్ లండన్‌లో దివంగతులయ్యారు.

జనవరి 8: ఖట్మండులో తొలి భారత పారిశ్రామిక ప్రదర్శనాన్ని నేపాల్‌రాజా ప్రారంభించారు.

జనవరి 16 : బురిండి ప్రధాని శ్రీ ఎం. పీరె నెగెండుమెవెను బుజుంబురాలో హత్య చేశారు.

జనవరి 17 : కన్సాస్‌లో విచిటావద్ద అమెరికా విమానదళ ఫ్లయింగ్ టాంకర్‌కు ప్రమాదం సంభవించి 24 మంది మరణించారు.

# చలన చిత్ర పరిశ్రమకు ప్రోత్సాహం

రాష్ట్రంలో చలనచిత్ర పరిశ్రమను ప్రోత్సహించడానికీ, ఉన్నత సాంకేతిక, కళా ప్రమాణాలతోనూ విద్య లేక సాంస్కృతిక విలువలతోనూ చిత్రాలను నిర్మించడాన్ని కూడా ప్రోత్సహించేందుకూ, ప్రతి సంవత్సరం దిగువ పేర్కొన్న వర్గాలలో నిర్మించబడిన ఉత్తమచిత్రాలకు బహుమతులు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది :—

1. ఫీచర్ చిత్రాలు
2. డాక్యుమెంటరీ చిత్రాలు
3. బాలుర చిత్రాలు
4. విద్యా చిత్రాలు.

ప్రభుత్వం ఈ క్రింద పేర్కొన్న అవార్డులను ప్రకటించింది :

## (ఏ) ఫీచర్ చిత్రాలు

(1) ఉత్తమ చిత్రానికి గవర్నరు బంగారునంది. ఈ చిత్ర నిర్మాతకు రూ. 10,000 లు, దర్శకునికి రూ. 4,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(2) రెండవ ఉత్తమ చిత్రానికి ముఖ్యమంత్రి వెండినంది. ఈచిత్ర నిర్మాతకు రూ. 3,000 లు, దర్శకునికి రూ. 1,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(3) మూడవ ఉత్తమ చిత్రానికి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కాంశ్యనంది. ఈచిత్ర దర్శకునికి ప్రశంసాపత్రం.

(4) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవార్డుల ఫిల్మ్స్ కమిటీ సిఫార్సుచేసిన చిత్రాల ఉత్తమ కథా రచయితకు రూ. 1,000 లు, రెండవ ఉత్తమ కథా రచయితకు రూ. 500 ల చొప్పున రొక్కం బహుమతులు.

## (బి) డాక్యుమెంటరీ చిత్రాలు

(1) ఉత్తమ చిత్రానికి గవర్నరు బంగారునంది. ఈ చిత్ర నిర్మాతకు రూ. 2,000 లు, దర్శకునికి రూ. 1,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(2) రెండవ ఉత్తమ డాక్యుమెంటరీ చిత్రానికి ముఖ్యమంత్రి వెండినంది. ఈచిత్ర నిర్మాతకు రూ. 1,000 లు, దర్శకునికి రూ. 500 ల చొప్పున రొక్కం బహుమతులు.

(3) మూడవ ఉత్తమ డాక్యుమెంటరీ చిత్ర నిర్మాతకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంశ్యనంది. ఈ చిత్ర దర్శకునికి ప్రశంసాపత్రం.

## (సి) బాలుర చిత్రాలు

(1) బాలురకొరకు నిర్మించిన ఉత్తమ ఫీచర్ లేక డాక్యుమెంటరీ చిత్రానికి గవర్నరు బంగారునంది. ఈచిత్ర నిర్మాతకు రూ. 10,000 లు, దర్శకునికి రూ. 2,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(2) బాలుర కొరకు నిర్మించిన రెండవ ఉత్తమ ఫీచర్ లేక డాక్యుమెంటరీ చిత్రానికి ముఖ్యమంత్రి వెండినంది, ఈచిత్ర నిర్మాతకు రూ. 3,000 లు, దర్శకునికి రూ. 1,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(3) మూడవ ఉత్తమ చిత్ర నిర్మాతకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంశ్యనంది. ఈచిత్ర దర్శకునికి ప్రశంసాపత్రం.

## (డి) విద్యా చిత్రాలు

(1) ఉత్తమ చిత్రానికి గవర్నరు బంగారునంది. ఈ చిత్ర నిర్మాతకు రూ. 2,000 లు, దర్శకునికి 1,000 ల చొప్పున రొక్కం బహుమతులు.

(2) రెండవ ఉత్తమ చిత్రానికి ముఖ్యమంత్రి వెండినంది.

(3) మూడవ ఉత్తమ చిత్రానికి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర కాంశ్యనంది.

# ప్రభుత్వ నిర్ణయాలు

* ప్రస్తుతం పనిచేస్తున్న ప్రైవేటు బియ్యం మిల్లులకు - ఒక వేళ అవి ఇతరత్రా అర్హతగలిగి వున్నట్లయితే, రెండు నెలలలోగా అవి దరఖాస్తు చేసినట్లయితే - లైసెన్సులు జారీ చేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

* నాలుగవ ప్రణాళికా కాలంలో నాగార్జునసాగర్ వద్ద ఒక ఇంజనీరింగ్ కళాశాలను నెలకొల్పే ప్రతిపాదనను ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

* ఆంధ్రప్రదేశ్ మార్కెటింగ్ సమాఖ్య, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి రూ. 60 లక్షలు ఋణం పొందడానికి వీలుగా తాను హామీనివ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల నిమిత్తం నెలకొల్పిన సహకార విక్రయశాలల అవసరాల నిమిత్తం పంట కోతల సమయంలో అత్యవసర పదార్థాలను భారీ ఎత్తునకొని నిలువ చేయడానికిగాను ఈ ఋణం ఉద్దేశించబడింది.

* జహీరాబాదులోని బంగాళాదుంపల ఉత్పత్తిదార్ల సంఘానికి, విత్తనాల కొనుగోలు నిమిత్తం ఒక లక్ష రూపాయలవరకూ, ఎరువు మిశ్రమాల నిమిత్తం మరో లక్ష రూపాయల మేరకు రొక్కం పరపతి సదుపాయం కలుగజేయడానికి నిశ్చయించబడింది.

* నాగార్జునసాగర్ ఆయకట్టు ప్రాంతంలో రైతులకు, ఎకరానికి రూ. 350 ల చొప్పున బ్యాంకు అడ్వాన్సులు - ఋణాలు ఇచ్చే నిమిత్తం కేంద్ర భూమి తనఖా బ్యాంకుకు హామీ ఇవ్వడానికి నిర్ణయం జరిగింది.

* భూసార సంరక్షణ కార్యకలాపాలు సాగిస్తున్న ఫీల్డ్ మెన్‌కు వారి జీతంలో 20 శాతం మేరకు ప్రత్యేక అలవెన్సు ఇవ్వడానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఇందునిమిత్తం రూ. 40,000లు కేటాయించారు.

* చేనేత పరిశ్రమ సహాయార్థం అపెక్స్, కేంద్ర బ్యాంకులు రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి పొందిన రూ. 200 లక్షలకు హామీని విస్తృతీకరించడానికి నిశ్చయించడమైనది.

* మంజీరా నీటిని శుభ్రపరిచే పనిని ఈ నది ఉత్పత్తి స్థానం వద్దనే చేపట్టడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

* అధికార్లను, సిబ్బందిని తరచుగా బదిలీలు చేయకుండా శాఖాధిపతులందరికీ సూచనలు పంపడానికి నిశ్చయించడం జరిగింది.

* నాలుగవ పంచవర్ష ప్రణాళికలో టూరిజంపై రూ. 50 లక్షలు (రాష్ట్రవాట) ఖర్చుచేస్తారు. ఈ మొత్తాన్ని హోటళ్లు అధికాదాయ, స్వల్పాదాయ. వర్గాల విశ్రాంతి గృహాలనిర్మాణం, నిర్వహణల నిమిత్తమూ, యాత్రికుల కొరకు మోటారు లాంచీలు. టాక్సీ కార్ల కొనుగోలు నిమిత్తమూ వెచ్చిస్తారు. ఇందుకొరకు రాష్ట్రంలో వివిధ ప్రదేశాలను ఎన్నిక చేశారు.

* ప్రతాప్‌గిర్జికోఠీలో చెవి, ముక్కు, గొంతు వ్యాధుల ఆసుపత్రిని నెల కొల్పడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

యువ

## మార్చి సంచిక

మార్చి సంచికలో ప్రభాత్‌కుమార్ ముఖోపాధ్యాయ్ సంక్షిప్తనవల

"రత్నదీపం"

మిస్. సుధారాణి

బింబ ప్రతిబింబాలు

సంధి (సీరియల్)

ఆశల అంతం

కల్యాణమందిర్ (సీరియల్ నవల)

ఇం కా

కార్టూనులు, వడ్డాది పాపయ్యగారి వర్ణచిత్రాలతో ఫిబ్రవరి 20 న అందజేస్తాము.

## యు వ కా ర్యా ల య ము

పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్ - 1

# మనోరమలో ఒక్కరోజు

## హైదరాబాదు యాత్రికునికి 'అప్సరస'లో

## ఒకరోజు మర్చిపోని అనుభూతి

**అది అతనిని**

గోల్కొండకోట

చార్‌మినార్

పబ్లిక్‌గార్డెన్స్

ఉస్మాన్‌సాగర్

సాలార్జంగ్ మ్యూజియం

ఉస్మానియా విశ్వవిద్యాలయం

*మొదలయిన స్థలాలకు తీసుకొని వెళ్తుంది.*

శుక్రవారం మినహా ప్రతిరోజూ పర్యటించవచ్చు

## సాలార్జంగ్ మ్యూజియం

ప్రవేశరుసుముతో సహా

**రూ. 5-00 మాత్రమే**

రిజర్వేషన్లు చేయించుకోవలసిన స్థలము - మనోరమ బయలుదేరు స్థలము:

**రాష్ట్ర సమాచార కేంద్రం, సమాచార పౌర సంబంధాల శాఖ**

**గాంధీభవనం ఎదుట, హైదరాబాదు.**

ఫోను నం. 43281 మరియు 43282

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at Yuva Press, Public Garden Road, Hyderabad.

